# జి-11 తో
# తయారయిన
# సింథాల్
# మిమ్ములను, మిగతవానికంటె,
# కాపాడును

సింథాల్ టాయిలెట్ పౌడరుయందు గల జి-11 (హెక్సాక్లోరాఫేన్) హానికరమైన, క్రిములను నిర్మూలించు, అసమాన పదార్థము. చెమటతో కూడిన దుర్గంధమును నిరోధించును. మిమ్ములను రోజల్లా సువాసనతో హాయిగా ఉంచును.




INTERPUB/GCP/15

# ఉత్తరాలు

## కథలు

మీ (మా) పత్రిక 12 4 68 సంచికలో శ్రీ తిరుమల రామచంద్ర యనువదించిన "ఉదయన జననోదంతం" నందు 9 వ పేజీలో యొక చిన్నపొరపాటు దొర్లినదని తలుస్తాను తిలోత్తమ ఎదురైనది సాహస్రానీకునకుగానీ, శతానీకునకు కాదుగదా! కానీ మీ (మా) పత్రికలో శతానీకునకు తిలోత్తమ ఎదురైనట్లుగా వ్రాశారు

కొసనం శేషగిరిరావు, (పెడన)

* అది అచ్చు పొరపాటు పొరపాటుకి చింతిస్తున్నాము. సం॥

*   *   *

29 3.68 వ వారపత్రికలోని గంగికథను చదివినాను. అన్నివిధాలా తన ధర్మమును, శీలమును కాపాడుకున్నది కాని చివర్కు సుఖమనుభవించలేదు. ధర్మమును పాటించిననో కష్టములు కల్గునట్లు కథను ముగించుటకంటె, ఎన్ని కష్టములనుభవించిననూ చివర్కు సుఖము ఆనందము కల్గునట్లు ముగించిన చాలా బాగుండునని నా అభిప్రాయము

మరువాడ శివయ్యశాస్త్రి (సిరివళ్ల)

## మహీధరోక్తి

ఈవారం 'మహీధరోక్తి'లో మొదటిపాదంలో నరసు నట్లు మూాషు డెరుంగ నేర్చునే అని ఉంది. కాని 'నరసు నట్లు మూడు డెరుగంగ నేర్చునే' అని ఉండాలను కుంటాను.

శాంతమూర్తి హైదరాబాద్)

## ఒకవారం విపరీతం

ఈవారం విపరీతాలన్నీ హత్యలూ, ఆత్మహత్యలూ కావడం విపరీతంగానే ఉంది. ఇంకొకటి. మద్రాసు ముఖ్యమంత్రి పేదలకు మేడలు కట్టిస్తాననడం, విదేశస్తులు మన ఆవకాయని తెగ తినడం మీ విలేఖరికి విపరీతంగా తోచడం మాకు వింతగా ఉంది!

చంద్ర, (విశాఖ)

## గేయాలు

"ఆంధ్రసచిత్ర వారపత్రిక" ది. 29 3 68 ఉగాది సంచిక ఆంధ్ర మహాజనులకు ఉగాది కానుకగా భాసించింది. అందులో ముఖ్యంగా నారాయణరెడ్డిగారి ఉద్వేగంతో కూడిన 'ఆవేదనా గేయం', 'దండలోని దారం' అన్న గేయంలోని—'మాలలోని పూలను చూసి బేలగా ప్రశ్నించకు వారు పుట్టిన ఊరేదని? మీకు పెద్దలు పెట్టిన పేరేదని? ఈ వాక్యాలు వినసొంపుగా వున్నయ్. ఇవ్వి నారాయణరెడ్డిగారి స్వీయానుభవాల్లా తోస్తున్నయ్ వారికి కల్గిన ఆవేదన ఈవిధంగా వెల్లడించుకున్నందుకు ధన్యవాదాలు.

మండవి శ్రీనివాసరావు (సికింద్రాబాద్)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 26—4—'68

కీలకనామ సం॥ చైత్రమాసం॥ బహుళ చతుర్దశి

సంపుటము : 60 సంచిక : 33

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
1, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6 50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: 'దునియాలో' వైజయంతీమాల.



శ్రీరాజ్ ప్రొడక్షన్స్ సమర్పించు
ముద్దుపాప
పాటలు-మాటలు
అనిసెట్టి
దర్శకత్వం
K.S.గోపాలకృష్ణ
సంగీతం
K.V.మహాదేవన్-
పామర్తి.
ఆంధ్ర... జ్యోతి
నైజాం...ఉషా
సీడెడ్...జయలక్ష్మి



ఇంతకంటె తొందరగా పోయే సాధన మేముంది?
నదీ జలాల రాయబారాలు
...ప్రేమించివుండొచ్చు కాని, నిన్ను గాఢంగా ప్రేమించలేదు...
మరణశిక్ష
నడపలేక పోతున్నారు... సహాయం చేసేదా?
ఒకరెవరొద్దు నాకు నేనుగా నడుపుకో గలను



10—4—68 చైత్ర శుద్ధ ద్వాదశి బుధవారం

**శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి 30—వ పుణ్యవర్ధంతి**

ప్రవిమల జీవిత ప్రసృమర ప్రథితాకృతు లాత్మభక్తిసా
ర వివశచిత్తు లార్యగుణరంజనమంజులదానవీరులున్
తవులరు మిన్నబోలు మహితాత్మకు లిచ్చట; నీవె కొందవున్
అవగుణ సత్త్వవశా తెలుగువాట వెలింగిలి సత్యమూర్తివై

# అక్షరజ్ఞానమా, జనాభా మొత్తాలా?

సరే, గుట్టు రట్టు బయటపడింది. బీహారు, ఉ. ప్ర. కాంగ్రెసు కేంద్ర శాసన సభ్యులు ఉద్యోగాల విషయంలో అక్షర జ్ఞానం బదులు జనాభా సంఖ్యలనే లెక్కలోకి తీసుకుంటే ఇంగ్లీషు అధికార భాషగా ఉండటానికి అభ్యంతరం లేదన్నారుట. హిందీ — ఇతర రాష్ట్రాలలో నిరాక్షరాస్యత తక్కువ కాబట్టి వారికి ఉద్యోగాలు అధికంగా దొరుకుతున్నాయని వారి భయం. ప్రభుత్వంవారు 'ఇండియా' అనే పుస్తకం ఏటా వెలువరిస్తారు. అందులో అక్షరజ్ఞానం — లెక్కలు ఇలా ఉన్నాయి—

హిందీ ప్రాంతం

| | | |
|---|---|---|
| రాజస్థాన్ | 15.2 | శాతం |
| మ. ప్ర | 17.1 | ,, |
| ఉ. ప్ర. | 17.6 | ,, |
| బీహారు | 18.4 | ,, |

హిందీ - ఇతరప్రాంతం

| | | |
|---|---|---|
| ఆం. ప్ర. | 21.2 | శాతం |
| అస్సాం | 27.4 | ,, |
| కేరళ | 46.5 | ,, |
| మదరాసు | 31.4 | ,, |
| మైసూరు | 25.4 | ,, |
| ప. బెం. | 29 3 | ,, |

**పాలకులు**

ఈ అంకెలనిబట్టి భారతదేశాన్ని వెనుకబడిన ప్రాంతాలవారే పాలిస్తున్నారని గ్రహించవచ్చు — ప్రత్యేకంగా ఉ. ప్రదేశ్, బీహారువారు.

ఈ సందర్భంలో ఒక విషయాన్ని గమనించాలి. అధికారంలో ఉండటంచేత హిందీ ప్రాంతంవారు తమ ప్రాంతాలని అత్యంత లాభంగా ఉండే ఏర్పాట్లు చేసుకున్నారు. ప్రణాళికలకి సంబంధించినంతవరకూ బీహారుకి రూ. 250 కోట్ల హెవీ ఇంజనీరింగు ప్రాజెక్టు, బొకారో ఉక్కుమిల్లు, బరవుని నూనె కర్మాగారం, రాంచి ఫవుండ్రీ కర్మాగారం, అక్కడే హెవీ మెషిన్‌టూల్స్ కర్మాగారం, ఇంకా ఒక ఫోర్జి ఇచ్చారంటే అర్థం ఏమిటి? వారణాసిలో డీసెల్ ఫ్యాక్టరీ, అలహాబాదులో హెవీ స్ట్రక్చరల్ ప్రాజెక్టు, హెవీ పంపు — కంప్రెసర్ల ప్రాజెక్టు కూడా ఈ సంగతినే నిరూపిస్తాయి.

**ఫలితం**

ఈ పెద్ద పెట్టుబడుల ఫలితం ఏమిటి? హిందీప్రాంతం తలసరి ఆదాయాల వివరాలు ఈ విధంగా ఉన్నట్టు ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీదేశాయి లోక్‌సభలో చెప్పారు—

| | |
|---|---|
| బీహారు | రు. 280 |
| మ. ప్ర. | రు. 357 |
| రాజస్థాన్ | రు. 382 |
| ఉ. ప్ర. | రు. 365 |

ఇక హిందీ— ఇతరప్రాంతాల వివరాలు—

| | |
|---|---|
| ఆం. ప్ర. | రు. 354 |
| అస్సాం | రు. 390 |
| కేరళ | రు. 294 |
| మదరాసు | రు. 439 |
| మైసూరు | రు. 309 |
| ప. బెంగాలు | రు. 388 |

ఎంత తక్కువ పెట్టుబడి చేసినా కేరళలో వ్యక్తిగత ఆదాయం బీహారుకన్నా ఎక్కువ వుందని గ్రహించవచ్చు ఈ అంకెలనిబట్టి.

**ముడిసరుకు ఎక్కడ?**

దక్షిణాదిలో మంచి రకం ఖనిజం, బొగ్గు లేవు కాబట్టి అక్కడ ఉక్కు మిల్లు పెట్టడం కష్టం అంటారు. జపాన్‌కి ఖనిజమూ, బొగ్గూ లేవు కాని ప్రపంచంలో పెద్ద ఉక్కు ఉత్పత్తిచేసే దేశాలలో ఒకటి (అమెరికా, రష్యాల తర్వాత.) బరవునిలో నూనె ఊటలు ఉన్నాయా, అలహాబాదులో పారిశ్రామిక స్థావరం ఉందా? బరవుని నూనె కర్మాగారానికి ముడినూనె అస్సాంనుంచి గొట్టాల ద్వారా వస్తుంది.

దక్షిణాది కాంగ్రెసు కేంద్రమంత్రులు పట్టుబడితే అక్కడ ఉక్కుమిల్లు వచ్చే ఉండేది.

ప్రాంతీయ విభేదాలని రద్దుచెయ్యటానికీ, ఉత్పత్తి పెంచటానికీ ప్రణాళికలని ప్రవేశపెట్టామంటారు. ఒరిస్సా, బీహారు, మ. ప్ర. లలో ఉక్కుమిల్లులని ఇందుకోసమే స్థాపించారు. తూర్పు ఉత్తరప్రదేశంలో పెద్ద కర్మాగారం ఒకటి — పెడుతున్నారు. కాని, కేరళలో కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చారంటే ప్రణాళికల బాధ్యత ఎంతమాత్రం? ఈ రాష్ట్రంలో అక్షరజ్ఞానం హెచ్చు, ఉద్యోగావకాశాలు తక్కువ, ప్రజలందరికీ వోట్లు వున్నాయి. మూడవ ప్రణాళికలో కొచ్చిన్‌లో నూనె కర్మాగారం పెడుతున్నారు. నాలుగవ ప్రణాళికలో ఎంతో దండుగతో కూడుకునివున్న షిప్‌యార్డు నిర్మించపోతున్నారు.

**చివరకు మిగిలేవి?**

కేరళ, తమిళనాడులలో ప్రజలకి (ప్రత్యేకంగా), పారిశ్రామికమయిన పెట్టుబడి వారి రాష్ట్రాలలో తక్కువ కావటంచేత, ఉద్యోగాలే మిగిలాయి. కొంతకాలం కింద కేంద్రంలో 'మీననయిటిస్' అనే జబ్బు ప్రారంభం అయిందనే వదంతి లేవదీశారు — అక్కడ మీనన్ పేరుకల కొందరు పెద్ద ఉద్యోగులు ఉండటంతో నేడు కేంద్ర ప్రభుత్వంలో కేరళరాష్ట్రం వారి సంఖ్య క్షీణించిపోతున్నది.

జనవరి 1965 హిందీ గడువు తేదీ నాటికి కేంద్రంలో చాలామంది కార్యదర్శులు అరవవారు ఉన్నారు వారిని ఒక్కొక్కరినీ పంపించివేసి హిందీప్రాంతంవారిని వేశారు. పక్కనే హిందీ అనువాదకుల బృందాన్ని సృష్టించారు. ఈ బృందంలో హిందీ — ఇతరప్రాంతంవారు చేరటం కష్టం కదా? 1967 లో హిందీ— రథం హిందీ— ఇతర ప్రభుత్వోద్యోగులని బయటికి నెట్టేస్తుంది — వారందరూ హిందీ పండితులు మెచ్చే హిందీ భాషాప్రావీణ్యాన్ని సంపాదించుకోవాలిగదా! హిందీ వివాదంద్వారా హిందీప్రాంతం తక్కిన దేశప్రాంతాలని పాలించా

అని చూస్తోంది. వంద సంవత్సరాల క్రితం కారల్‌మార్క్స్ ప్రపంచ కార్మిక వర్గం ఏకం కావాలన్నాడు. నేడు హిందీ — ఇతర వర్గాలవారిని ఏకం కావాలని నినాదంచేసే వారెవరూ లేరు. ఈ నినాదం లేకపోతే భారతదేశం సాంకేతికంగా వెనుకబడిపోయే ప్రమాదం ఉంది.

*　　*　　*

పార్లమెంటు వ్యవహారాలని ఒక పరిశ్రమగా ప్రకటిస్తే బాగుంటుంది. (బాంకింగు, వార్తాపత్రికల ప్రచురణలని ప్రకటించినట్లు) ఈ పరిశ్రమ బాధ్యతని అన్ని పార్టీలవారూ భరించాలి.

కాంగ్రెసు అధికారంలో ఉన్నపార్టీ. ఎన్నికలలో వోడిపోయినవారందరికీ ఉద్యోగావకాశాలు ఇప్పించగలుగుతోంది.

వోడిపోయిన తరువాత శ్రీ థామస్‌ని ఆస్ట్రేలియా హైకమిషనర్‌గా, బాబూ రాజబహాదూర్‌ని నేపాల్ రాయబారిగా చేశారు; శ్రీ అలగేశన్‌ని ఇథియోపియా రాయబారిగా చేస్తారుట. శ్రీ కె. డి. మాలవీయాని హెవీ ఇంజనీరింగ్ కార్పొరేషన్ అధ్యక్షుడుగా చేశారు. శ్రీ మహావీర్‌త్యాగిని ఇండియన్ ఫయినాన్స్ కమిషన్ అధ్యక్షుడుగా నియమించారు. శ్రీ అజిత్ ప్రసాద్ జైయిన్, శ్రీ మాథుర్‌లని రాజ్యసభకి పంపించబోతున్నారు.

ప్రధాన మంత్రికి పోషణ ఇచ్చే అవకాశాలు చాలా ఉన్నాయి. కాని ఎన్నో అవాంతరాలూ ఉన్నాయి. పత్రికా రచన పరిశ్రమ అయితే పార్లమెంటు పరిశ్రమ ఎందుకు కాకూడదు? అయితే బాంకింగ్, పత్రికాప్రచురణ లాభాలకోసం చేసేపనులు. శాసనసభల నిర్వహణ కాదు అంటారు. ఈ వాదానికి సమాధానం మధ్యప్రదేశం శాసనసభలో జరిగిన ఉదంతాలు కొన్ని, సంఘసేవ పరిశ్రమగా ప్రకటించిన ఉదంతమూ—ఇవి రెండూను.

పార్లమెంటుని పరిశ్రమగా ప్రకటించి వోడిపోయిన వారందరికీ ఇతర ఉద్యోగావకాశాలు ఏర్పరచాలి. అవసరమయితే రిటయిరయిన న్యాయమూర్తిని ఎవరినయినాపిలిచి ఎవరెవరికి ఏ ఏ ఉద్యోగాలు వెయ్యాలో కనుక్కోవచ్చు. ఈ విధంగా భారతదేశం ప్రపంచానికే మార్గదర్శి కావచ్చు. ●

## కీ॥ శే॥ యూరీ గగారిన్



యూరీ గగారిన్ కేవలం ఒక వ్యక్తి మాత్రమేకాదు. మానవుడు సాధిస్తున్న సాంకేతికాభివృద్ధికి చిహ్నం. అయితే, వ్యక్తిగా కూడా గగారిన్ అఖిల మానవజాతి ప్రేమాభిమానాలనిచూరగొన్నాడు. అంతరిక్ష నావలో ఆకాశంలో పయనం చేసిన యూరీ గగారిన్ ఒక సామాన్యమయిన విమానం కూలిపోవటంవల్ల ప్రాణాలు కోల్పోవటం విధి వైచిత్రాలలో ఒకటి. చరిత్రలో, అందరు మానవుల హృదయంలో యూరీ గగారిన్ శాశ్వతంగా జీవిస్తాడు.



రాజధానిలో దేశోద్ధారకుని 30 వ వర్ధంతిసభలో ప్రసంగిస్తున్న ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి: సభకు హాజరైన మంత్రులు శ్రీ వెనిగళ్ల సత్యనారాయణ, శ్రీ విజయభాస్కరరెడ్డి, శ్రీ శిలం సిద్ధారెడ్డి, ప్రభృతులు.

# ఆవేశాలూ - అపరాధాలూ

*** వి. యస్. సుక్థాంకర్ ***



# * * దెయ్యం హత్యా - ఇంగ్లీషు జడ్జి * *

కండీపూర్ వంగదేశంలోని టిప్పెరా జిల్లాలో ఒక చిన్నగ్రామం. కండీపూర్ ఊరుమధ్యలో ఒకకొలను, ఆ కొలను చుట్టూ ఒక వెదురు పొదా ఉంటాయి. ఈ పొద లోపల దెయ్యం ఉందని ఊరి ప్రజల నమ్మకం. ఎవరివిగాదనయినా కోపం వస్తే ఈ దెయ్యం ఆ మనిషిని వెంటనే చంపేస్తుందిట...

ఒకవేళ మీరే గనుక ఈ ఊరికి వెళ్ల వలసివస్తే ఈ దెయ్యంగురించిన కథలు వినటానికి సిద్ధంగా ఉండాలి, మీకు ఇష్టం ఉన్నా లేకపోయినా.

ఈ 'దెయ్యంకథ'లన్నిటిలోనూ ఎక్కువ ప్రచారం కలది ఒక ఇంగ్లీషు జడ్జికి సంబంధించినది. ఈయన 1894లో కలకత్తా హైకోర్టు జడ్జిగా ఉండేవాడు.

ఇక కండీపూర్‌కి వెళ్లేవారు బహుశ వినే కథ చదవండి...

బృందాబన్ అనే మనిషి ఉదయతార అనే అమ్మాయిని పెళ్లిచేసుకున్నాడు. ఇద్దరూ పదేళ్లు సంసారం చేశారు. 1894లో బృందాబన్ చనిపోయాడు. ఎక్కడ చనిపోయాడు? ఉదయతార సోదరుడు శరత్చంద్ర ఇంట్లో.

ఈ శరత్చంద్రకి జగత్చంద్ర అనే చుట్టం ఉండేవాడు. జగత్చంద్రకి ఇల్లూ వాకిలీ లేవు. ఒకసారి కండీపూర్‌లో ఉండేవాడు, ఇంకోసారి మరేదయినా చిన్న గ్రామంలో ఎవరో తెలిసినవారి ఇంట్లో ఉండేవాడు.

జగత్చంద్ర ఉదయతారకన్నా చిన్నవాడు. అయినా, వారిద్దరికీ సంబంధం ఉన్నట్లు ఊళ్లో వాళ్లందరికీ తెలుసు...

బృందాబన్‌కి ఈ సంగతి తెలుసా? ఏమో! కాని, అతనికీ జగత్చంద్రకీ పడేది కాదు.

1894లో ఒకరాత్రి బృందాబన్ శవం దొరికింది. ఊరి మధ్య కొలను చుట్టూ ఉన్న వెదురు పొదలో దొరికింది. శరత్‌చంద్ర ఇల్లు ఈ కొలనుకి చాలా దగ్గర.

ఆరాత్రి శరత్‌చంద్రతోబాటు బృందావన్ దంపతులు, వారి ఇద్దరు కొడుకులూ నిద్రకి ఉపక్రమించారు. శరత్ ఇంటికి ఒకటే ఒక పెద్దగది. అందరూ అందులోనే పడుకునేవారు.

మధ్యరాత్రి ఉదయతార తన సోదరుడు శరత్‌ని లేపింది. బృందాబన్ గదిలో లేడు. ఏమయినట్లు? శరత్ లాంతరు వెలిగించి వెతకటానికి సిద్ధం అయ్యాడు.

ఉదయతార అతనికి 'దెయ్యం' సంగతి గుర్తుచేసింది. ఒంటరిగా చీకట్లోకి వెళ్ల వద్దంది.

శరత్‌కి కూడా ఈ సలహా నచ్చింది. పక్క ఇంట్లో ఉన్న జగన్నాథ్‌ని తోడు రమ్మని పిలిచాడు. ఉదయతార తను కూడా వస్తానన్నది.

ముగ్గురూ తల పగిలి నెత్తురు మడుగులో పడి ఉన్న బృందావన్‌ని వెదురు పొద మధ్య చూశారు. అప్పటికి అతనికి ఇంకా ప్రాణం పోలేదు.

ఉదయతార ఏడుపుకి, అరుపులకి అంతు లేదు. అంతకి కొన్ని నెలల ముందు తన తండ్రి శవం కూడా అక్కడే దొరికిందని అరిచింది. దెయ్యంవాత పడిపోయాడన్నది.

బృందాబన్‌ని ఇంటికి తీసుకు వెళ్లారు

కాని తెల్లవారకముందే అతను మరణించాడు

ఉదయమే శరత్ పోలీసుస్టేషనుకి వెళ్ళి బృందాబన్ సయితాన్‌చేత ప్రాణాలు కోల్పోయాడని చెప్పాడు. పోలీసులు తమ పరిశోధన మొదలుపెట్టారు.

తర్వాత జగత్‌చంద్ర, ఉదయతారలని ఎరెస్టు చేశారు.

టిప్పెరాలోని చిన్న న్యాయస్థానంలో విచారణ జరిగింది. న్యాయమూర్తి భారతీయుడే. జగత్‌చంద్రకి హత్యానేరంపయి మరణ శిక్ష విధించాడు. ఉదయతారకి యావజ్జీవ కారాగృహవాసం శిక్షవిధించాడు.

('ఈ జడ్జి పాపం అంత తెలివిగలవాడు కాదు! సయితాన్ చేసిన నేరానికి మనుష్యులని శిక్షించాడు!' అనుకునేవారు గ్రామస్థులు.)

జగత్‌చంద్ర, ఉదయతారలు ఎప్పీలుమీద హయికోర్టుకి వెళ్ళారు. ఈసారి వారి కేసుని ఒక యూరోపియన్ న్యాయమూర్తి విచారించాడు. సాక్ష్యాన్ని జాగ్రత్తగా అనుశీలించి యిద్దరినీ నిరపరాధులుగా నిర్ణయించి వదిలివేశాడు.

('ఈయనది ఇంగ్లాండులో చదువుకున్న బుర్ర కదా! బృందాబన్‌ని చంపింది సయితానేనని ఇట్టే కనిపెట్టేశాడు!' అనుకున్నారు కండీపురం వాసులు.)

ఈ జడ్జిగారి పేరు బెనర్జీ. ఆయన తన తీర్పులో ఏమన్నాడు?

'వాది జగత్‌చంద్రమీద హత్యానేరారోపణ జరిగింది. టిప్పెరా సెషన్‌ల జడ్జి ఈ నేరారోపణ రుజువు అయిందని తీర్మానించారు. ఆ కోర్టు వ్యవహారాలని నిర్ధారణ చెయ్యటానికని విచారణ ఈ కోర్టుకి పంపటం జరిగింది. ఎప్పీలు చేసిన ఉదయతార అనే వ్యక్తికి యావజ్జీవ కారాగృహవాసం శిక్ష పడింది (కింది కోర్టులో).

'మరణించిన వ్యక్తి ఈ వనిత భర్త. వైద్యుల సాక్ష్యం ప్రకారం 26 ఫిబ్రవరి, 1894 నాడు అతనిని తలమీద, వంటిమీద బలంగా కొట్టటంవల్ల చనిపోయాడని నిస్సందేహంగా తెలుస్తోంది. ప్రాసిక్యూషన్‌వారు మరణించిన వ్యక్తి భార్య ఉదయతార, జగత్‌చంద్రల మధ్య అక్రమ సంబంధం ఉందని వాదించారు; ఉదహరింపబడిన రాత్రి బృందాబన్‌ని స్త్రీబందీ (ఉదయతార) యింటి బయటికి తీసుకొని పోగా ఆ నిమిత్తమయి పొంచి ఉన్న జగత్‌చంద్ర అతనిమీద పడి, ఉదయతార సహాయంతో కొట్టి చంపాడని వారి ఆరోపణ. నేరం చేసినట్లు ముద్దాయిలు ఇద్దరూ అంగీకరించారని అంటున్నారు. కేసు మొత్తం ఈ నప్పుకోలుమీద ఆధారపడి ఉంది.

'డిప్యూటీ మేజస్ట్రేటు ముందు జరిగిన విచారణలో తెలిసిందేమిటంటే, 24 ఏప్రిల్ నాడు ఉదయతార అనే ముద్దాయిని క్షమించటం జరిగింది కాని ఆమె డిప్యూటీ మెజస్ట్రేట్‌తో చెప్పిన దానిని మార్చటంతో సెషన్స్‌జడ్జి ఆమె విచారణ ఆపి ఇద్దరు ముద్దాయిలనీ కలిపి విచారించాలన్నాడని...ఒకరివిూద ఒకరికి చెప్పి ముద్దాయిలవద్ద నేరాంగీకారపత్రాలని పోలీసువారు తీసుకున్నట్లు మాకు స్పష్టంగా తెలుస్తోంది. మార్చి 9వ తేదిన జగత్‌చంద్ర, ఉదయతారలు తమ నేరాంగీకార ప్రకటనలు పోలీసుల భయంతో ఇచ్చినవని అన్నారు... సందర్భాలన్నిటినీ జాగ్రత్తగా పరిశీలిస్తే తను బృందాబన్‌ని చంపినట్లు, మార్చి 1వ తేదీన, జగత్‌చంద్ర ఇచ్చిన ప్రకటన హృదయపూర్వకంగాచేసినదికాదని తెలుస్తుంది. దీనిని బట్టి మనం ఎటువంటి చర్యనీ తీసుకోవలేము. వీరిని మేజస్ట్రేట్ ముందు పెట్టటానికి పోలీసువారు పడిన హడావుడి, అవసరం చూస్తే నేరం ఒప్పించేందుకు వారు ప్రయత్నించినట్లు తోస్తుంది. ముద్దాయిలు ఒకరివిూద ఒకరికి అపనమ్మకం కలిగే ప్రయత్నాలు పోలీసువారు చేస్తున్నట్లు స్పష్టమవుతున్నదని ఇంతకిముందే చెప్పాను. వారి నేరాంగీకార ప్రకటనలని బట్టి మనం ఎటువంటి చర్యనీ తీసుకోవలేము. అందుచేత సెషన్స్‌జడ్జి తీర్పుని కొట్టివేసి ముద్దాయిలని విడుదల చెయ్యటంకన్నా గత్యంతరం మాకు కనిపించటంలేదు...'

జస్టిస్ బెనర్జీ తన తీర్పుకి కారణాలని స్పష్టంగా చెప్పాడు. ఈ సంగతి కండీపూర్‌జనానికి విడమరచి చెప్పి చూడండి! మిమ్మల్ని చూసి నవ్వుతారు. బృందాబన్‌ని హత్యచేసింది 'దెయ్యం' అని కనిపెట్టగలిగే తెలివి జడ్జిగారికి ఉన్నదనికూడా గ్రహించలేరే మీరు, అనుకుంటారు! ●

# తక్కువ ప్రేమ చూపించిన తలిదండ్రుల హత్య!

తనమీదకన్నా తన తమ్ముడి మీదే ప్రేమ ఎక్కువచూపిస్తున్నారన్న అనుమానంతో మహేందర్ సింగ్ (27 ఏళ్ళు) అనే అతను తుపాకీతో తనతల్లి దండ్రుల నిద్దరినీ కాల్చి చంపేశాడట అతనితండ్రి కారుకొనే ప్రయత్నంలో వుండడం చూశాక ఆకారుకూడా తన తమ్ముడికే అయ్యుంటుందని వుద్రేకపడి తనకు జీవితాన్నిచ్చినవారి జీవితాలను అంతం చేశాడట ఈ ఘోరం పాటియాలవద్ద డియోఘిర్ అనేచోట 23మార్చిన జరిగింది ఇలాటి ఘోరాలకు శిక్షాస్మృతులో శిక్ష లుంటాయి.

## జైల్లో కసి తీర్చుకున్న హంతకుడు

తిహార్‌సెంట్రల్ జైలులో 31మార్చిన ఒక హత్యజరిగింది జస్వంత్‌సింగ్ అనే ఖైదీ బలదేవ్ సింగ్ అనే మరో ఖైదీని వెన్నులోనూ, గుండెల్లోను పొడిచిచంపేశాడట వీరిద్దరికీ పాతవిరోధం వుందనీ, పగతీర్చుకునే అవకాశం జైల్లో లభించిందనీ తేలింది అసలే హత్యకేసులో జైల్లోకి వచ్చిన జస్వంత్‌సింగ్‌కు యీమరో హత్యకు ప్రభుత్వం ఏశిక్ష విధించగలదు

## అయిదువేల మిలియన్ల ఎలుకలు

స్వతంత్రభారత దేశంలో 5వేల మిలియనుల ఎలుకలు స్వేచ్ఛాజీవనం చేస్తున్నాయనీ, ఇవి సాలీనా నూరుకోట్ల ఆహారధాన్యాలను స్వాహా చేస్తున్నాయనీ ఆశాఖ (ఆరోగ్య—కుటుంబ నియంత్రణ) డిప్యూటీ మంత్రి శ్రీమూర్తిగారు తెల్పారట







ఖైదీలకోసం జైళ్ళలో కనీసం టీ షాపులైనా వుండాలని మద్రాసు ప్రభుత్వం ఆలోచిస్తోంది కేరళ, మహారాష్ట్ర ఉత్తరప్రదేశ్‌యీ "జైల్లో టీ" అమలు జరిపారట

## అక్రమ సంబంధం - హత్య

తన ఇద్దరి భార్యల్లో చిన్నభార్య చిన్నపొన్‌కు కుప్పన్ అనే మరొకతనితో అక్రమ సంబంధం వున్నట్టు పసికట్టి ఆమెను చంపేశారుట ఇతని పేరు వినాయకం. ఈ దారుణం మధురాంతకంలో జరిగింది.

## దారుణ హత్య

పాండిచ్చేరికి దగ్గరలో వున్న బొమ్మపాలయం అనే వూళ్ళో తిరు వెంకటపతి అనే అతను తన భార్యను కత్తితో పొడిచి చంపాడట. అప్పటికి వివాహమయి ఏడోరోజేనట తనతో రమ్మంటే రానందన్న కోపంతో పన్నెండుసార్లు పొడిచి చంపేశాడట యీతడు రమ్మంటే రానంటే యింతశిక్షా!

*        *        *

ప్రెసిడెంటు ఆయూబ్‌ఖాన్‌కి పక్షవాతం వచ్చి ఎడమచేయి చచ్చుపడి పోయిందట రావల్‌పిండిలో జరిగిన సమావేశంలో యీయన తం ఎడమచేతిని ప్యాంటు జేబులోనే వుంచుకున్నారట!

*        *        *

## మనిషికి ఆవుదూడ గుండె కవాటం

వెల్లూరు (మద్రాస లో మెడికల్‌కాలేజీ ఆసుపత్రిలో రామస్వామి అనే వ్యక్తిగుండె ఆపరేషన్‌చేసి, పాడైపోయిన ఒక కవాటానికి బదులుగా ఆవుదూడ గుండెలోని కవాటాన్ని అమర్చి ఆపరేషను జయప్రదంగా చేశారట. ఇది సౌత్‌ఈస్ట్ ఏషియాలో మొట్టమొదటి ఆపరేషనట!

*        *        *

కౌంటర్ రివల్యూషనరిస్టులు (తిరుగుబాటుకి ఎదురు తిరుగుబాటుదారులు) అన్న నేరం ఆరోపించి వోయిద్దరికి మరణదండన విధించడమేగాక 50 వేల మంది చూస్తుండగా వారిని చంపారట— చైనాలో!

*        *        *

ఓంకాసీ ప్యాసింజరు తిరుచ్చివచ్చేసరికి అందులో 30 ఏళ్ళ వ్యక్తిశవం దొరికిందట ఎవరావ్యక్తి? ఎలా, ఎందుకు ఎప్పుడు ఎక్కడ చనిపోయాడు అన్న వింకా తేలలేదు మధురనుంచి దిండిగల్లుకు ప్రయాణం చేస్తున్నట్టు అతని జేబులోవున్న టిక్కెట్టువల్ల తెలిసింది ఏదో విషప్రయోగం వల్ల అతను మరణించాడనీ— బహుశా ఆత్మహత్యఅయ్యుండచ్చనీ అనుకుంటున్నారు— హత్య ఎందుకై వుండకూడదు!



## హరిజన స్త్రీలను

# నగ్నంగా తిప్పింది నిజమా ?

మహబూబ్‌నగర్‌లో వొవ్వూళ్లో హరిజన స్త్రీలను నగ్నంగా తిప్పారన్న వార్తను లోక్‌సభలో అబద్ధం అని కొట్టిపారేశారు. అసలలా అవూరివాళ్లు తిప్పడానికి కారణం ఏమిటో తెలీలేదు. ఒకస్త్రీ దొంగతనమో ఏదో చేసిందనీ, ప్రతీకారంగా యీ విధంగా అవూరివారు చేశారనీ అన్నారు కొందరు.

# పూర్వజన్మ జ్ఞానం

పంజాబుకు చెందిన పది సంవత్సరాల అమ్మాయికి జన్మాంతరజ్ఞానం కలిగిందట. తను క్రితం జన్మలో అమెరికాలో హోటలు నడిపే ఒకతని కూతురుననీ, తన 18 వ ఏట జలప్రమాదంలో చనిపోయాననీ ఆమె చెప్పిందట. ఈమెను అమెరికా తీసుకువెళ్ళగా తనయిల్లు, తండ్రి మిగతా పరిసరాలనూ అక్కడే మెసిలే వ్యక్తిలా చూపిందట. రాజస్థాన్ విశ్వ విద్యాలయంలో పేరా సైకాలజీ డైరెక్టర్ డాక్టర్ బెనర్జీ యీ విషయాన్ని అంగీకరిస్తూ "ఇది సంభవమే" అన్నారట. ఇలాటి కేసులో సుమారు ఏడువందలు తను విన్నానని కూడా చెప్పారట. టర్కీలో 16 ఏళ్ళ నేతాజీ అనే కుర్రాడికి కూడా పూర్వ జన్మజ్ఞానం కలిగి— తను క్రితం జన్మలో ఫలానా వూరుకు చెందినవాడననీ, తనను ఎవరో బుర్రమీద కొట్టి హత్య చేశారని చెప్తూ బుర్రమీద తనకు క్రితం జన్మలో తగిలిన గాయం కూడా చూపించాడట.

# చనిపోయిన స్త్రీతో 11 మాసాల కాపురం

68 ఏళ్ళ గెర్ట్రూడ్ అనే ఆమె చనిపోయినా, ఆమెను 11 నెలలుగా తనయింట్లోనే అట్టిపెట్టుకున్నాడని రోన్నాబూత్‌మీద అభియోగం వచ్చింది. ఒంటరితనం భరించలేక, అతను చనిపోయిన ఆమెను 11 నెలలుగా పక్కన పడుకోబెట్టుకుంటున్నాడట. [illegible] పుత్తున్నాడట. ఇది బ్లాక్‌పూల్‌లో జరిగింది. శవం చెడిపోకుండా రసాయనాలను వాడివుంటాడనుకుంటున్నారు. సైకియాట్రిక్ వైద్యం చేసి యితని మనోస్థితి తెలుసుకోవాలన్నారుట— అకాశవాణి.

* * *

1960 నుంచి 68 మార్చివరకూ సౌత్‌వియత్నాంలో 3లక్షల 20వేల మంది 'ఈ'యుద్ధంలో చనిపోయారనీ, ఇందులో మూడోవంతుల మంది ఏ పాపం ఎరుగని అమాయకులేనని తెలిసింది—పాపం!!

# విడాకుల కేసుల పీరవిహారం

ఢిల్లీలో విడాకుల కేసులు వీరవిహారం చేస్తున్నాయట. 1954 లో 3 అప్లికేషనులతో ప్రారంభమయి 1967 వచ్చేసరికల్లా 266 అయ్యాయుట. పోయిన సంవత్సరం వచ్చిన 113 అప్లికేషన్లలోను 101 అప్లికేషనులను ఆమోదించలేదట. మరి ఆ 101 జతల భార్యాభర్తలు సహజీవనం చేయగలరా! అసహజీవనమ్మైనా చేస్తారా— ఏమో!

— శ్రీలా శ్రీ ●

# క్షేమేంద్రుని బృహత్కథామంజరి కథలు

అనువాదం: తిరుమలరామచంద్ర

## వాసవదత్తా సందర్శనగాధ



సహస్రానీకునికి సంగమకుడు చెప్పిన శ్రీదత్తుని వృత్తాంతం ఊరట కలిగించింది. మృగావతినే ధ్యానిస్తూ ఆరాత్రి గడిపాడు. తెల్లవారింది. మళ్ళీ ఉదయ దిక్కువైపు ప్రయాణం సాగించాడు. జమదగ్ని ఆశ్రమం చేరాడు. ఆ ఆశ్రమంలో ఏనుగులు సింహాలు సహజవైరం మాని ప్రశాంతంగా వున్నాయి.

సహస్రానీకుడు ఆశ్రమంలో ప్రవేశించాడు. జమదగ్ని మునికి ప్రణమిల్లాడు. జమదగ్నిముని సహస్రానీకునికి ఆదరంతో అతిథి సత్కారం చేశాడు. పతి విరహంతో కుందుతున్న రాజ్ఞి మృగావతిని, మదన సుందరుడయిన ఉదయనుని అతనికి అప్పగించాడు. 'నరపతీ, ఈ శుభలక్షణయుతుడైన బాలుడు మృగావతీ దేవియందు నీకు కలిగిన కుమారుడు. ఇతడు గొప్ప యశోధి, శ్రీమంతుడు, అపరధనంజయునివలె మహా విజేత అవుతాడు. స్వీకరించు' అని అప్పగించాడు.

సహస్రానీకునికి సతీసుతులను చూచి హర్షంతో హృదయంలోని శోకం తొలగిపోయింది. జమదగ్ని మహర్షి అప్పగించిన ఉదయనకుమారుణ్ని స్వీకరించి తన ప్రియురాలయిన మృగావతి, కుమారుడు సహా, మంత్రి సేనాపత్యాది పరివారం వెంటరాగా, తన రాజధాని అయిన కౌశాంబికి మరలివచ్చాడు. నగరం చేరిన తర్వాత ఉదయనకుమారునికి తన మంత్రి సేనాని నర్మసఖుల పుత్రులను పౌరరాజ్య లక్ష్మితోపాటు అప్పగించాడు. ఉదయనునికి యౌగంధరాయణుడు మంత్రిగాను, రుమణ్వంతుడు వాహినీపతిగాను, వసంతకుడు నర్మసఖుడుగాను అయ్యారు.

సహస్రానీకుడు రాజ్యభారాన్ని ఉదయన కుమారునికి అప్పగించి, తన ప్రియురాలైన మృగావతితో కేళీతత్పరుడై పెక్కు సంవత్సరాలు గడిపాడు. అతనిని కీర్తివలె ముదిమి చుట్టుముట్టింది. అతడు ఈ సంసార స్థితి గాలికి కదలాడే కదళీదళలోలమని బుద్ధితో గ్రహించి, కౌశాంబిని వదలి, భార్యతోను, మంత్రులతోను స్వర్గారోహణ మార్గమైన మహాపథంలో మహాప్రస్థానం కావించాడు

మదనాభిరామలయిన రామలంటే, ఎవరికి ఇష్టం వుండదు? ధనమున్నా

యౌగంధరాయణా! కామోపభోగాలన్నీ ఎవరికి అమృతంగా వుండవు? కాని, ఈ విషయ సుఖమనేది తుమ్మెద రెక్కలవలె, ఉత్తుంగతరంగాలవలె, ఏనుగు చెవులవలె సర్వాత్మనా అతి చంచలమయినవి, అస్థిరమైనట్టివి.

పౌరుని వంశంలో పుట్టిన సహస్రానీక మహీపతి పత్నిలోపాటు కులోచితమయిన మహాపథయాత్ర చేసి, పరమపదం పొందగా, ఉదయనుడు వారికి శాస్త్రోక్తంగా ఉత్తర క్రియలు చేశాడు. పిదప తండ్రినుంచి సంక్రమించిన వత్సరాజ్యాన్ని జనరంజకంగా ఏలుతూ, కిరీటి చేసిన అద్భుతకృత్యాలను కూడా జనం చప్పరించివేసేట్టు అపూర్వ పరాక్రమాదులు చూపాడు. కాని ఉదయనునికి ఒక పెద్ద వ్యసనం ఉండేది. అది ఏనుగులవేట. అతడు మంత్రి అయిన యౌగంధరాయణుని మీద రాజ్యభారమంతా వదిలేసి, కిన్నరనాగు ఇచ్చిన వీణను వాయించుకొంటూ, అడవి ఏనుగులను వేటాడుతూ కాలం గడిపాడు. ఇది అతని శత్రువులకు కొంత అలుసిచ్చింది.

ఉదయనుడు రాజ్యకార్యాలను అంతగా పట్టించుకోడంలేదని, గజ మృగయావినోద వ్యసనంలో మునిగి వుంటున్నాడని శత్రు రాజులు తెలుసుకొన్నారు. అలాటి శత్రు రాజులలో ఒక్కడు ఉజ్జయినీపతి అయిన చండమహాసేనుడు ఉదయనుని జయించి లోబరచుకోవాలని అతనికి మనసు పుట్టింది. దానికి పరిపరివిధాల ఆలోచించాడు. — 'అమ్మాయి వాసవదత్త ఉదయనునికి తగిన కన్య. అతడేమో నాకు సహజ శత్రువు. నాకు యాచించదగినవాడు కాదు. అత్యంతం అభిమానధనుడు. కన్యను నాకు యివ్వండి అని నన్ను కోరడు. అతడు అల్లుడైతే నాకు లోబడివుంటాడు. వేరే విధంగా లోబరచుకుందామంటే పొసగదు. అతనికి చాలా దుర్గాలున్నాయి. కోశాగారమూ పెద్దది. అమాత్యులు అతనికి చాల విశ్వాసపాత్రులు. అతనిపై అనురక్తులు. అన్నిటికీ మించి అతడు గొప్ప తెలివితేటలు గలవాడు. అందువల్ల ఉపాయంతో జయించాలి. ఆ ఉపాయాలలోను వేట అనే ఉపాయం తప్ప మరొకటి లేదు.'

వత్సరాజు విషయమై చండమహాసేనుడు ఈ విధంగా చాలకాలం ఆలోచించాడు. తన కార్యసిద్ధికోసం ఇష్టదేవత అయిన దుర్గాదేవి మందిరానికి వెళ్లాడు. ఆ మందిరం అతని పుష్పోద్యానంలో ఉంది. అతడు దుర్గాదేవిని మనసారా స్తుతించాడు. ఆ భగవతి అతనికి ఇచ్ఛాసిద్ధి వరం అనుగ్రహించింది. చండమహాసేనుడు చాల సంతృప్తితో నగరుకు తిరిగివచ్చి, బుధదేవుడనే మంత్రితో ఆలోచించాడు.

'వత్సరాజు ప్రతిదినమూ వీణను వాయిస్తూ అడవిలో తిరుగుతూ, వీణావాదానికి మైమరచిపోయి వచ్చిన ఏనుగులను పట్టుకొంటున్నాడు. ఒక క్రూరమయిన ఏనుగుతో అతడు మనవద్దకు వచ్చేట్టు చేయాలి. కాని మొదట ఈపని చేద్దాము' అని ఒక దూతను పిలిపించి, అతనికి ఏవో రహస్యంగా కొన్ని ఆదేశాలిచ్చి కౌశాంబికి పంపాడు.

వెంటనే ఆదూత కౌశాంబి చేరి, వత్సరాజు ఆస్థానంలో ప్రవేశం సంపాదించి, రాజుకు దండాలు పెట్టి కృత్రిమప్రేమతో చండమహాసేనుడు పంపిన ఉడుగరలు సమర్పించి, మనస్సును చిక్కబట్టుకొని, చండమహాసేనుని సందేశాన్ని అతని మాటగా ఈ విధంగా వినిపించాడు: 'వత్సరాజ, నాకు నా కులసర్వస్వమయిన ఒక కుమార్తె వుంది. ఆమె తన శరీర ప్రకాశసంపదతో కళానిధి అయిన చందురుని తళుకులాగ మెరుస్తూ వుంటుంది. తన మానసోల్లాసం కోసం సృష్టించే నియతి (దైవం) కీర్తిచంద్రిక ముద్ద కట్టినట్టు వుంటుంది. మీరు గాంధర్వ విద్యావేత్తలు. శ్రుతితత్త్వజ్ఞులు. ఆమె వీణలో మీకు శిష్యురాలు కావాలని కోరుకుంటున్నది. నాకుమార్తెమీద ప్రేమతో మా ఉజ్జయినికి దయచేయండి. మంచివారు గొప్పవారు కోరినప్పుడు కాదనడం నేర్చుకోలేదు'

చండమహాసేనుని సందేశం విని ఉదయనునికి చాల కోపం వచ్చింది. 'వాసవదత్త వీణ నేర్చుకోదలిస్తే, మా పట్టణానికే పంపు. లోకంలో శిష్యులు గురువు సన్నిధికి వస్తారుకాని, గురువు శిష్యుని యిళ్లకు వెళ్లడు' అని చండమహాసేనునికి ప్రతి సందేశం పంపాడు. దూత తిరిగి వెళ్లిపోయాడు.

ఉదయనమహారాజుకోపం ఇంకా చల్లారలేదు. ముఖం చిట్లించాడు. బొమముడి పడింది. దానిని చూస్తే, అతని మనస్సులో వ్యాపించిన కోపాగ్నిపొగలాగ కనిపించింది. చెవిలోని కుండలాలు కదిలాయి. యౌగంధరాయణునితో ఇలా అన్నాడు: 'మహామాత్యా, చూచారా, ఈ రాజపశువు దర్పం! అతని మనస్సు గావరంతో మునిగిపోయింది. ఎంతనిబ్బరంతో మాకు సందేశం పంపాడో చూచారా? ఎంత గడుసుతనం? ఆ కల్లబొల్లి మాటలు మాట్లాడేవాడిని సపరివారంగా పట్టుకొనివస్తాను. నా కోపమనే సముద్రం అవలిగట్టును చూస్తాను. సేనను ఆయత్తం చేయించండి.'

యౌగంధరాయణునికికూడాకోపంవచ్చింది. రాజు పరిపాలన విషయాలు పట్టించుకోకుండా ఏనుగు వేటతో కాలం గడుపుతున్నాడు. అతనిని మంచిమాట చెప్పి మరలించుకోడానికి ఇదే సమయమని గ్రహించాడు. ఇలా విన్నవించాడు:— 'మహారాజా, మీకు తగినట్లే మాట్లాడారు. మనస్వులు అవజ్ఞామంథరమయిన పెరవారిమాటను సహించరు. చండమహాసేనుడు ఈ విధంగా సందేశం పంపడానికి కారణం దేవరవారే. మీరు సుఖాలు కోరి స్వచ్ఛందంగా వుంటున్నారు. మీ పరాక్రమ తేజస్సు ప్రేమతో కొంచెం పేశలమయింది. మందగించింది. దిగంతాలకు వ్యాపించిన మీ ఉజ్జ్వల ప్రతాపాన్ని వారే చల్లబరుచుకున్నారు. మీరు మృగయావ్యసనాసక్తులని ప్రతిసామంతుడూ గ్రహించాడు. విరోధులూ గ్రహించారు. దీనివల్ల వారితలలో అవినయం చెలరేగింది. అందువల్లనే వారి తలలు పైకి లేచాయని నా అభిప్రాయం. దేవా అతి ప్రణయంవల్ల లలన, వినయంతో కీర్తి, చెడునీతితో నరపాలుని సిరులు నశిస్తాయి. మరొక సంగతి. చండమహాసేనుడిని సులభంగా జయింపలేము. అతడు మహేంద్రవర్మమనుమడు. జయసేనుని కుమారుడు; చండికాదేవి వరంతో మహా చండమహాసేనుడయ్యాడు. అతనికి వింధ్యవాసిని అయిన చండికాదేవి స్వయంగా విజయకృపాణం అనుగ్రహించింది. అతనివద్ద నడగిరి అనే గజేంద్రం వుంది. అది పర్వతమంతఎత్తయినది. ఆ మదగజం మదజలవాసనను భరించలేక దిగ్గజాలు దిక్కులకు పారిపోయా

## ...బృహత్కథామంజరి

యనుకుంటాను.

చండమహాసేన డొకవాడు వేటకోసం అడవికి వెళ్లాడు. అక్కడ ఒక అడవిపంది కనిపించి. దానిని తరుముతూపోయాడు చండమహాసేనుడు. అది పాతాళానికి పరుగు పెట్టింది. అక్కడ దానిని హతమార్చాడు. ఆ అడవిపంది అంగారకుడనే దైత్యుడు! అతనిని చంపినది మేలే అయింది ఆరాక్షసునికి అంగారవతి అనే కుమార్తె వుంది. ఆమె రూపలావణ్యశాలిని తండ్రి మరణించగానే ఆ కన్య చండమహాసేనుడిని పెండ్లాడింది. ఆమెవల్ల చండమహాసేనునికి గోపాలుడు, పాలకుడు అనే ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె కలిగారు. ఆ కన్య పేరే వాసవదత్త. అంగారవతికి, చండమహాసేనునికి వాసవదత్త జననానికి ముందు ఒక కల వచ్చిందట. ఆ కలలో వాసవుడు (ఇంద్రుడు) కనిపించి పుట్టినింటికి, మెట్టినింటికి అపార విఖ్యాతి తెచ్చే మహారాజ్ఞి అయిన కుమార్తె పుడుతుందని సూచించాడట అందువల్ల ఆమెకు వాసవదత్త అని పేరు పెట్టారట. ఆమెకు ఉదయించే తనయుడు విద్యాధరేశ్వరుడు అవుతాడని జనశ్రుతి.'

యౌగంధరాయణుడు రాజకుమారి వాసవదత్తను గురించి చెప్పిన సంగతులు ఉదయనుడు విన్నాడు సంతోషంతో మనసులోనే ఆలోచించాడు. స్మరుడు జ్ఞాన చక్షువు కదా! చర్మ చక్షువులతో చూడకపోయినా, జ్ఞానచక్షువుతోనే ప్రేమికులు చూసేట్టుచేస్తాడు.

కౌశాంబినుంచి ఉజ్జయినికి తిరిగివెళ్లిన దూత చండమహాసేనునికి ఉదయనుని ప్రతి సందేశం విన్నవించాడు. ఆ సందేశం విని చండమహాసేనుడు వ్యాకులపడ్డాడు. సరే తను ముందుచేసిన ఆలోచనే సముచితమయినదని దానినే ధ్యానిస్తూ కొంతసేపటికి నిర్ణయానికి వచ్చాడు.

ఉదయనుని బందీగా పట్టుకొనడానికి వింధ్యాటవిలో పన్నాగం సిద్ధమయింది. చండమహాసేనుడు ఒక యంత్రగజాన్ని నిర్మించవలసిందని వ్యాధులకు ఉత్తరువు చేశాడు. వ్యాధులు వెదుళ్లతో ఒక బృహదాకారమైన కృత్రిమ యంత్రగజాన్ని సిద్ధపరిచారు. అది నడగొండలాగ రూపొందింది. దానిలో యోధులు కూర్చుని దానిని ఎటుబడితే అటు నడిపించడానికి వీలుగా అది నిర్మించబడింది. ఆ మాయాయంత్ర గజం వింధ్యాటవిలో తిరుగాడే ఏర్పాట్లు చేశారు.

ఈ వింధ్యాటవిలో ఏదో మహాగజం నడయాడుతున్నదనే వార్త కౌశాంబీనగరంలో వత్సరాజు చెవిదాకు పాకింది. గజేంద్రాలను బంధించడంలో కుశలుడైన ఉదయనుడు కొంత గుర్రపుదండుతో వింధ్యాటవికి బయలుదేరాడు. అడవి చేరినతర్వాత, అడవి ముఖంలోనే గుర్రపు దండును ఆపి, తాను ఒక్కడే అడవిలో ప్రవేశించాడు.

మాయా యంత్రగజం తిరుగుతూవుంది. ఉదయనుడు చూచాడు. అది ఐరావతంలాగేవుంది సవిలాసంగా, అలసంగా నడుస్తూంది. చేట చెవులు, తొండం అందంగా కదులుతూ వున్నాయి అది అహంకారంలాగ ఎత్తుగా వున్నది. ఈ సంసారంలాగ నిస్సారంగా వుంది ఐశ్వర్యంలాగా చంచలమై ఒక్కచోట క్షణమైనా నిలువకుండా తిరుగుతూ వుంది. దుఃఖాంతమైన దుశ్శీలం వలె నిష్ఫలమైన చెడు మంత్రాలోచన వలె, కనుగొనరాని స్త్రీ చిత్తంలాగ, మోహాన్ని క్రమ్ముకొనేట్టు చేసే అజ్ఞానం తీరున, మాయామేయమయిన అధర్మంలాగ, అవధిలేని దీర్ఘమైన మనోరథంవలె, అసత్యమైన వేశ్యారాగంవలె వుంది. అవగుణిలాగ మనస్సును హరిస్తున్నది. కట్టుబడని దుర్బుద్ధిలాగ, నిరంకుశుడైన రాజులాగ, అమంగళకరమైన పరద్రోహంలాగ, దానంలేని (మదజలంలేని) లోభంతో సమానంగా వుంది, ఆ కూట (మాయా) కుంజరం.

ఉదయనుడు తన వీణా మధురగీతాలతో ఆ మాయా మతంగజాన్ని ఆకర్షించి పట్టుకొందామనే ఆశతో ఒకచోట నిలబడ్డాడు; దుర్జనుణ్ణి కొలువుచేసి సంతోషపెడదా మనుకునే వెంగలిలాగ. యంత్ర కృత్రిమమైన ఏనుగును వీణావాదనంతో పట్టుకోడం సాధ్యమా? ప్రాయశః, గొప్పవారికి కూడా వ్యసనాసక్తి భ్రాంతి కలిగిస్తుంది కాబోలు!

ఆ ఏనుగు నెమ్మదిగా తనవద్దకు రాక మానదని ఉదయనుడు తన వీణ ఘోషవ

తిని ఒళ్ళు తెలియక వాయిస్తున్నాడు. ఆ అదనుచూచి కూటయంత్ర గజంనుంచి యోధులు అస్త్రశస్త్రాలతో సన్నద్ధులై వెలువడ్డారు. ఆయనను పట్టుకొనడానికి చుట్టు ముట్టారు. ఉదయనుడు ఒంటరిగా వున్నానన్న శంక ఏమాత్రమూ లేకుండా, చెక్కుచెదరని ధైర్యంతో, స్థిరమైన మనస్సుతో వారిని ఎదిర్చాడు వాళకి పట్టుబడకుండా గుండ్రంగా తిరుగుతూ, పెద్దపెద్ద అంగలతో వీరాంగం తొక్కుతూ, పలువురు భటులను పడవేశాడు. కొందరే మిగిలిపోయారు. వారిలో ఒకడు మహాకాలుని వరం పొందినట్టివాడు. అతడు, హతశేషులతోపాటు మోసంగా వెనుక పాటునవచ్చి ఉదయముని బందీగా పట్టుకొన్నాడు.

ఉదయనుడు పట్టుబడ్డాడన్న వార్తవిని చండమహాసేనుడు వింధ్యాటవికి వచ్చాడు బందీ అయిన వత్సరాజును వెంటబెట్టుకొని ఉజ్జయినీనగరం చేరాడు. అతడు తనకు సహజశత్రువు గనుక, మొదట్లో అతనిని చంపుదామనే బుద్ధి కలిగింది ఆ క్రూరుడైన చండమహాసేనునికి. ఎలాగో తను విజయం పొందాడు గదా మరి? కాని, పౌరులు అలాటి క్రూరకృత్యం చేయవద్దని ఆయనను ప్రార్థించారు. దానికి అతడు సిగ్గుపడిపోయి, ఉదయనుని చంపాలనే తలంపు మానుకున్నాడు. అతనికి ఒక విడిది ఏర్పాటు చేశాడు. సకలోపచారాలకు కట్టుదిట్టాలు చేశాడు. కాని, అప్రమత్తులైన ఆరక్షకులను కావలి పెట్టాడు.

కొన్నాళ్లు గడిచాయి. ఒకనాడు చండమహాసేనుడు పౌరులు వెంటరాగా ఉదయనుని విడిదికి వెళ్లి అతనికి ప్రణామంచేసి, ఇలా విజ్ఞప్తి చేశాడు.—'వత్సేశ, నీవు నాకు గౌరవించదగినవాడివి. నీ విషయంలో నాకు ఏపాపచింతా లేదు. నా కుమార్తె వాసవదత్త నీవద్ద వీణా వాదనము, గేయకళను అభ్యసించ దలచింది. నీకు శిష్యురాలు కాదలచింది.' చండమహాసేనుడు చాల తెలివిగలవాడు. తనమాటకు ఉదయనుని ఒప్పించాడు. తర్వాత, అంతఃపురంనుంచి తన కుమార్తెను పిలిపించి వత్సరాజుకు అప్పగించాడు.

ఉదయనుడు ఆ నల్లకలువ కన్నుల దానిని చూచాడు. ఆమె శృంగారమనే పెనుగాలికి మన్మథుడనే సముద్రంలో పైకి లేచిన లహరివలె వుంది. నల్లని వ్రటువ కనుబొమలు అలలు. మెడలోని ఆణిముత్యాల దండలు తెల్లని నురుగుపిందులు. భావగోపవాలవేని మొసళ్ళు. వీటన్నిటితో ఆమె మానాగ్నిని చల్లార్చేనదిలాగ కనిపించింది సన్నని, పలుచని, బంగారు రేకువంటి

(64 వ పేజీ చూడండి)

# పన్నీటి తోట కన్నీటి బాట

బొడ్డు బాపిరాజు




చల్లని వెన్నెల కురుస్తున్న చందమామని కారుమబ్బు కబళించినట్లయింది. మహేంద్రకు మాలతి మాటలు వినగానే ఆనందం చిందులాడుతూ వున్న ముఖాన చీకట్లు ముసిరాయి.

మాలతిని మొదటిసారి చూచినప్పుడే యిన్నాళ్లా తను వెదుకుతున్న దీ తీవ కోపమే అనుకున్నాడు. పాణిగ్రహణంతో అనురాగ ద్వారాలు తెరుచుకొన్న అతని హృదయ మందిరంలో అడుగుపెట్టిన ఆనంద కిరణాలు అదృశ్యమయిపోయాయి మాలతి మాటతో. వచ్చిం దనుకొన్న వసంతాన్ని అకాల శిశిరం ఆక్రమించినట్లయింది. కానిపని కళ్ల ముందు జరిగిపోతూ వున్నట్లు మహేంద్ర మనస్సులోనే మథన పడిపోతూ వున్నాడు.

'అబ్బా!' అంటూ బాధతో భర్త నోటినుంచి వేలు లాక్కొని పడిన గాట్లు మీద నోటితో వూదుకొంటూ

'ఏమి టా మోటు సరసం' అనబోయి భర్త మొగం వేపు చూచిన మాలతికి మాట పెగల్లేదు. ఎంతో సిగ్గుతో చెప్పలేక చెప్పిన తన మాటకు ఎంత హంగామా చేస్తారో అనుకొన్నదే కాని యిలా కళ తప్పిన మొగంతో భర్త కళవళపడడం ఆ ముగ్ధ హృదయానికి కర్థం కాలేదు.

'ఏమిటలా అయిపోయారు? ఏదన్నా బాధగా వుందా అండి?' పొంగి వస్తున్న దుఃఖాన్ని మ్రింగుకుంటూ మాలతి అడిగే మాటలు వినిపించుకొనే స్థితిలో లేడు మహేంద్ర.

పూసిన పువ్వుతోటలా ఆకాశం అలుముకున్న తెల్లని వెన్నెట్లో పడక కుర్చీలో పవళించి, ఈ క్షణం అన్నాళ్ళా తన కోసం ఎంత తపించి పోయింది — తనెన్నిసార్లు కలల్లో కనిపించి కవ్వించిందీ — కమ్మగా కబుర్లు చెబుతూ వున్న భర్త ప్రక్కన పేము కుర్చీలో కూర్చుని ముసిముసి నవ్వుల్తో వింటూ, వక్కపొడి అందించి— కవటాకులేరి సున్నం రాసి — ఈనెలు తీసి— తమలపాకు చిలకలు చుట్టి నోటి కందిస్తున్న మాలతి చెప్పనా వద్దా అనుకోవడంలో ఎరుపెక్కిన చెక్కిళ్ళూ విచ్చుకుంటూ వున్న పెదవులు చూస్తూ అడగనే అడిగాడు మహేంద్ర.

'ఏమిటోయ్ ఆ దేవరహస్యం? ఈ దాసుని చెవిన కూడా పడనీయి. నీకే పుణ్యముంటుంది.'

మాలతి వస్తూ వున్న నవ్వును పెదవుల్లోనే బిగించి 'ఏమీ లేదు — లేదండీ' అంటూనే నవడంలా పండిన ఏరు పెనిమిట చెవిదగ్గర పెట్టి మంద్రంలో సరిగమలు పలికినట్లు 'మీకు అబ్బాయ్ కావాలా? అమ్మాయ్ కావాలా?' అంటూ మాట ముగించకుండానే సిగ్గులో మునిగిపోయింది.

అంతే వినరాని మాట విన్నట్లు కంగారు పడిపోయి మడుపు లందిస్తూ వున్న మాలతి వేలు కసిక్కిన కొరికాడు మహేంద్ర.

* * *

మహేంద్ర మంచివాడే. ఆలోచనకన్నా ఆవేశం పాలెక్కువ. ఇష్టానిష్టాల్ని మనసు ఏ భూతద్దంతో చూస్తుందో మరి. అందరికీ అతి సామాన్యమయిన విషయమే అతనికి వింధ్య పర్వతంలా పెరిగిపోతుంది. అతని అభిరుచుల్ని మెచ్చుకున్నా బలహీనతల్ని హర్షించలేం. రచయిత కాలేదు కాని అతి భావుకుడు. వూహా శిఖరాగ్రాల్లో ఉయ్యాలలూగే సౌందర్యప్రియుడు. కనుక కాబోయే పెళ్ళిని గురించి, రాబోయే ఇల్లాలిని గురించి, సాగించే ప్రణయ జీవితాన్ని గురించి, వేగించే విరహరాత్రుల్ని గురించి రంగు రంగుల చిత్రాలెప్పట్నించో వూహా ఫలకాల మీద చిత్రించుకుంటూ వస్తున్నాడు. ఆ చిత్రంలో ఏ రేఖ మారినా ఏ రంగు చెదరినా అడెంతో దురదృష్టంగా తల్లడిల్లిపోయే తత్వ మతనిది. ఇవన్నీ ఆంతరంగిక విషయాలు. బహిరంగ విషయం, అందమైనవాడు — పట్టభద్రుడు— అవసరం కన్నా అధికంగా గడించిపోయిన పితృ పితామహుల ఆస్తికి ఏకైక వారసుడు.

బంగారు పంజరంలోని ఆ గోరువంక పెండ్లీడుకెదిగిన రామచిలుకల కన్న తండ్రుల కెందరికో కన్నులూరించింది. చాకచక్యంగా వట్టుదారాల్తో ఉచ్చులు పన్నారు. ఏ గాలానికి చిక్కలేదా బంగారు చేప.

'ఇక మనవాడికీ జన్మలో పెళ్లికాదు! భూమండలంలో వాడికంటికి నచ్చేపిల్ల యింకా పుట్టలేదు! బ్రహ్మదేవుడు వాడి కోసం ప్రత్యేకంగా ఓ పుత్తడి బొమ్మను సృష్టిస్తున్నా'డంటూ మహేంద్రను గురించి చెప్పుకుని నవ్వుకుంటూ వుండే లోగానే బంధుమిత్రులందరికీ సకుటుంబ సపరివారంగా విచ్చేసి నవదంపతుల నాశీర్వదించ వలసిందిగా శుభలేఖ లందాయి.

పెండ్లిపీటలమీద మాలతిని మహేంద్రనుచూచిన బంధుమిత్రులంతా 'నిజంగా దేవకన్యే దిగి వచ్చిం'దనుకున్నారు. అందరి కన్నా మహేంద్ర అక్క సుభద్ర మరదల్ని చూస్తూ మురిసి ముప్పందు మయింది. ఈ శుభం చూడకుండానే దాటిపోయిన తండ్రిని తలుచుకుని ఉబికిన కన్నీళ్లెవరూ చూడకుండా చెంగుతో అద్దుకుంది.

మనుగుడుపుల్లో ఆకాస్త అడ్డు తీరిందనిపించారు. ఫలప్రదానా లందుకుని మంగళారతి అద్ది అక్షతలుంచిన పెద్ద ముత్తయిదువ 'అష్టయిశ్వర్యాల్తో—అయిదువతనంతో—కడిపెడు బిడ్డల్నికని కలకాలం సుఖించం'డని దీవిస్తున్నప్పుడు మహేంద్ర కవశకునం ఎదురు వస్తున్నట్లనిపించింది.

మెరుపుతీగలా మెరిసిపోతూ మల్లెపూల జడతో మత్తెక్కిస్తున్న సౌరభంతో తరిగించు చీరతో క్షీరసముద్రంనుంచి బయలుదేరివచ్చిన శ్రీదేవిలావున్న మాలతిని చేతుల్తో చుట్టివేస్తూ 'మరో రెండు చేతులుంటే బాగుండు' ననుకున్నాడు. ఆ అందాన్ని తనివితీరా చూడ్డానికి 'వెయ్యి కళ్ళున్నా చాల'వనుకున్నాడు మహేంద్ర. చంద్రకిరణం చెంగులువతో మంతనాలాడినట్లు, మహేంద్ర తియ్యగా చెపుతూవుంటే, మాలతి పారవశ్యంతో వింటూవుంటే, వాళ్ల కళ్లలోని ఎరుపుజీరలు తూరుపు కొండ కొనల్ని వెలిగించాయి.

మాలతికి మనస్సిచ్చివచ్చిన మహేంద్ర తనయింట ఒకకాలు అత్తవారింట ఒక కాలుగా ఆమూణ్ణెల్లూ ఎల్లాగడిపాడో రైల్వేవాళ్లకే తెలియాలి. వచ్చినప్పుడల్లా వెయ్యికలల్ని వినిపిస్తూ మొయ్యలేనంత విరహం మూటకట్టుకు వెళ్లేవాడు.

ఆషాఢం అతని ప్రాణానికి అడకత్తెరలా దాపురించింది. ఆ వెన్నెళ్ళూ ముత్యాలు ముగ్గులుపెట్టినట్టు మాలతికి వ్రాసిన ఉత్తరాలకన్నా నచ్చక చించివేసినవే ఎక్కువ. అంతకన్నా వ్రాయగాల్సివీ మనస్సులో మిగిలిపోయినవీ మరీ ఎక్కువ. అతని విరహతాపాన్ని తీర్చే చల్లని చినుకుల్తో, నీలిమబ్బుల మేలిముసుగు సవరించుకుంటూ శ్రావణం రానేవచ్చింది. 'ఈసారి తనతో మాలతిని ఎలా అయినా తీసుకువెళ్లా'లన్న స్థిరసంకల్పంతో అత్తవారింటికివచ్చి వ్రాలాడు మహేంద్ర.

కొండంత కోరికల రెక్కలు గట్టుకు వచ్చిన మహేంద్రకు మాలతి మాట వజ్రాయుధంకన్నా వాడిగా తగిలింది. అప్పుడే తండ్రి అనిపించుకోవడమేకాదు అసలు తండ్రనిపించుకోవడమే అతనికిష్టం లేదు. క్రొత్త తీవలకు మొగ్గలు తొడిగే ప్రకృతి ధర్మం అతని యిష్టానిష్టాల్ని పాటించే బాధ్యత కాని, కనికరం కాని వహించలేదు పాపం!

* * *

మున్నీ పసుపుతో ఇల్లు నిండిన సారె సామానుతో నిండుగా వచ్చిన మరదల్ని చూస్తూనే తన కొడుక్కిప్పుడే పెళ్ళాం వచ్చినట్టు ఉబ్బిపోయింది సుభద్ర. 'ఓయ్ మరదల మాణిక్యం! మీ అల్లుడు పెళ్ళాం కావాలంటున్నా డమ్మాయ్. 'పట్టి నిస్తా— పాడావు నిస్తా' నని పెళ్లిలో బొమ్మనప్పగించావ్ గుర్తుందా' అన్న వదినగారికి మాలతి ముసి ముసి నవ్వులే సమాధానాలయ్యాయి. 'ఎవ్వరయితే నేమిలే అమ్మాయ్!

ఆ చెంబుడు నీళ్ళూ చల్లగా పడితే చాలు—'తొలి చూలు కొడుకూ, తొలికాపు పంటా అంటా' రంటూ పక్కింటి పిన్నిగారన్న మాట 'కంతే నండమ్మగారు' అన్న చాకలి ముత్తయిదువు బియ్యం-కొబ్బరి కాయా—ఎఱ్ఱనీళ్ళ—మాలతికి దిగదుడిచి దిష్టి తీశాక కుడికాలు లోపల పెట్టింది క్రొత్త కోడలు.

కోడలు అడుగు పెట్టడంతో ఇంటికి క్రొత్త కళ వచ్చిందంటే వచ్చిందన్నారు నలుగురూ. మహేంద్ర మనస్సులో ముల్లు గ్రుచ్చుకున్న విషయ మెవరికీ పట్టలేదు.

'అదృష్టవంతురాలివి! నీ కడుపున మీ మామగారే వెలుస్తార్లే. వయసులో కన్న కొడుకూ, వయసులో గడించిన ధనం తండ్రి కడుపోల్ల అక్కరకొస్తా' యంటూ ఎంద రెంత ముచ్చటపడ్డా, భర్త ముభావం మాత్రం మాలతి గుండెలో కెలుకుతూనే వుంది. ఆయన స్వభావం అంతేలే' అని సరిపెట్టుకోలేక పోతూవుంది. తనంటే వున్న ఆ మమతలూ ఆప్యాయతలూ అన్నీ వట్టి నటనలే అనుకోలేకపోతూవుంది. 'నలుగురూ ఆనందించే విషయంలో ఉభయుల మధ్యా జారిన తెగ ఎన్నాళ్ళకు లేస్తుందో మరి? అయినా తన తప్పేమిటి? అన్న ఆలోచనల్లో మల్లగుల్లాలు పడుతూ మాలతి ఎంతగా అడిగినా మహేంద్ర సూటిగా తన మనస్సు విప్పలేకా చెప్పలేకా నలిగిపోతున్నాడు.

మల్లెపూవులన్నా మామిడి పళ్ళన్నా అసహ్యపడే వాళ్ళెందరు లేరు. 'ఆ అసహ్యం ఎందు'కని ప్రశ్నిస్తే కారణం వాళ్ళే చెప్పలేకపోవచ్చు. కాని, కారణంలేని కార్యం అంటూ వుండదన్నది యథార్థం.

మహేంద్రకు పిల్లలమీద అసహ్యమే కాదు, అక్కను కూడాను. వాళ్ళు తల్లి ఆరోగ్యాన్ని, అందాన్ని బలి తీసుకుంటా రనీ, తండ్రి సుఖశాంతుల్ని దూరం చేస్తా రనీ, విషబీజా లతనికి తెలియకుండానే హృదయంలో మొలకలెత్తాయి. సృష్టికి ఫుల్‌స్టాప్ పెట్టే ఈ భావం లోకకళ్యాణానికి వేరుపురుగన్నది తెలియని అవివేకాన్ని ఎవరు హర్షిస్తారు? బాబిగాడు పుట్టినప్పు డక్కయ్యతో అంటే, 'పోరా పిచ్చి మాలోకం! ఇప్పుడు కాదు రేపు నీకు పుట్టినప్పుడు తెలుస్తుం దా తీపి' అని తేలిగ్గా నవ్వేసింది.

తొమ్మిది నెలలు ఆహారంలో ఆహారం, తన రక్తంలో రక్తం పంచిస్తూ పడరాని పాట్లుపడుతూ ఏ మెప్పూ కోరకుండా అన్ని నొప్పులూ సహించి ఆ పసినోటికి వెచ్చని రొమ్ము అందించి వాత్సల్యాన్నంతా పాలుగా పట్టించే క్షమాస్వరూపిణి మాతృమూర్తి ఆ ఆనందంకోసం ఎన్ని తపస్సుల నన్నా ధారపోస్తుందని ఊహించగల హృదయం ఎందరి తండ్రుల కుంటుంది? కడుపున పుట్టిన బిడ్డలకే అది తీర్చలేని రుణం అన్నది గుర్తుండదే!

మహేంద్రకు సుభద్రక్క అంటే అమ్మ కన్నా ఎక్కువే. అసలమ్మరూపం మనస్సులో అచ్చుపడీ పడకముందే ఆ యమ్మ కన్ను మూసింది తల్లి పోయేనాటికి మహేంద్రకు ఏడాది వెళ్ళింది. సుభద్రకు పదకొండేళ్ళు వచ్చాయి. పాపం ఆ పిల్లే ఇంటిదీపం ఆరిపోయి దిగజారిన తండ్రికి ఆసరాగా, తమ్ముణ్ణి ప్రాణమొకెత్తుగా పెంచి పెద్ద చేస్తూవచ్చింది. ప్రక్కలో వేసుకొని పడుకొనేదాకా పాటలుపాడి నిద్ర బుచ్చేది. గుజ్జు ముద్దలూ గోరుముద్దలూ చందమామను రమ్మంటూ వెళ్ళిస్తూ తినిపించింది. పాఠాలు చదివించింది. బడికి పంపించింది. ఒక్కనాడూ పల్లెత్తు మాటనకుండా అమ్మ వాత్సల్యం తన సౌభ్రాత్రం కలబోసి ఇంతవాణ్ణి అంతవాణ్ణి చేసింది. ఆ తమ్ముణ్ణి చూసుకుని మురిసిపోయింది. ఆ అక్కతమ్ముళ్ళ ఆత్మీయత చూచి తండ్రి తృప్తిగా గాలిపీల్చాడు. తమ్ముడికి అక్కమాట సుగ్రీవాజ్ఞ. అక్క మాట వేదాక్షరం. అక్కంటే ఆరో ప్రాణం.

సిరీ సంపదా వున్న కుటుంబంలో బుద్ధిమంతుడైన కుర్రవాణ్ణి తెచ్చి సుభద్రకు మూడు ముళ్ళూ వేయించి 'తలమీద బరువు దించుకున్నా' ననుకొనే అంతలో బ్రహ్మదేవుడు ఆ తండ్రి ఆకు కాస్తా చించివేశాడు.

తండ్రి పోయినప్పట్నించి ఆ అక్కాబావలే యింటికి కప్పులా—కంటికి రెప్పలా—కాపాడా రతణ్ణి. బావగారి యాజమాన్యంలో భూమి పుట్రా—డబ్బూ దస్త్రం, అక్కయ్య అజమాయిషీలో చదువూ సౌజన్యం పెరిగి మనిషయ్యాడు.

అక్కయ్యకు నెల తప్పిందంటే మహేంద్ర తనూ సంతోషించాడు. కాని మూడో నెలలోనే అక్క తిన్నది ఆలస్యంగా వెళ్ళబోసుకుంటూ వేవిళ్ళతో బాధ పడుతూవుంటే, ఆ కడుపులో శిశువుమీద అతనికేదో కోపంగా వుండేది. అక్కయ్య యిదివరకుమాదిరి తిరగలేకపోయినా, అంత నడుం నొచ్చినా, ఇంత నీరసం హెచ్చినా, తల నొప్పికీ—తగని బద్ధకానికీ—అన్నింటికీ ఆ కడుపులో వాడిమీదే కక్షగా వుండేది. దానికి తోడు సుభద్ర కాన్పుకూడా కష్టమే అయింది హాస్పిటల్లో చేర్చారు. పెద్ద ప్రాణం కూడా దక్కదేమో అన్నంత పనయింది. ఏ దేవుడో మ్రొక్కిన మ్రొక్కులు విని చక్రం అడ్డు వేశాడు. తల్లీ పిల్లాడు నెల తిరక్కుండానే సలక్షణంగా ఇంటికి చేరుకున్నారు. అక్కయ్య ప్రాణాలో దాగుడుమూతలాడిన ఆ పిల్లడంటే అసహ్యం వేసేది. అక్క పిల్చి 'ఎలా నవ్వుతున్నాడో చూడు మహీ! అచ్చు నీపోలికే! మేనమామ పోలికా మేనత్తచాలికా అంటూ ఊరికేపోదు' అంటె 'ఇదో క్రొత్త న్యూసెన్సు' అనుకుంటూ మంచంకేసి మొగమన్నా త్రిప్పకుండా వెళ్ళిపోయేవాడు. ఇంట్లో వుచ్చమడుగులు చూచినా, దొడ్లో ఆరవేసిన బాబు గుడ్డల్ని చూచినా ఏవగించుకొనేవాడు. పసివాడు పోరు పెట్టి ఏడుస్తుంటే 'ఇదెక్కడి తద్దినంరా భగవంతుడా!' అనుకొన్నా అక్కయ్యతో మాత్రం ఏమీ అనలేకపోయేవాడు. ఆముదం కంపుతో అక్కయ్యను చూస్తే కడుపులో దేవేది. కాని అతని అసహ్యాన్ని అక్కయ్యంటే వున్న అభిమానం అంకుశంలాగా అదుపులో పెట్టేది.

ఆ నెలల పిల్లడికి ఉగ్గూ పాలూ ఏదీ క్షణం ఆలస్యంకాకుండా వాడు 'కుంయ్' మంటే 'వస్తున్నారా చిట్టి తండ్రీ!' అంటూ హాజర్ సేవలు చేస్తూ బావగారి అవసరాల్ని అశ్రద్ధచేస్తూవుంటే అక్కయ్య మీద జాలీ కోపం కలిగేవి మహేంద్రకు.

ప్రసవించాక అక్కయ్య రూపే మారిపోయింది. బారెడు పొడుగూ పట్టుకుంటే పట్టెడుండే ఆ జుట్టు ఏమయిపోయిందో చిక్కి చిక్కి చివరకు ఎలుకతోకలా తయా

రయింది. పసిడి శలాకలా వుండే లావణ్యం లావెక్కి మనిషి మంథరగిరిలా అవుతూ వుంది. తను చదువుకుంటూవుంటె విశ్రాంతిగా వచ్చి అదీ ఇదీ మాట్లాడే అలవాటు వాడి పుట్టుకతో బందైపోయింది తను వద్దంటూవున్నా రాత్రిళ్లు పాలు తెచ్చి తాగందే వదిలిపెట్టని ఆ అక్కయ్యే 'మహీ! పాలు తాగి పడుకో బాబేడుస్తున్నాడురా. మర్చిపోవద్దు'అంటూవున్నదీ రోజున.

ప్రతి అల్పవిషయం ఇంత ఆజ్యం పోస్తూ రోజుకు రోజు కతని ద్వేషాన్ని రాజుకునేట్టు చేసింది. అప్పట్నించీ మహేంద్ర మనస్సులో పిల్లలంటే ఆరని వైరం తీరని కసీ గూడు కట్టుకున్నాయి.

* * *

మహేంద్ర మాలతితో మనస్సులో మాట చెప్పలేకపోతున్నాడు. 'ఎందుకూ ఈ పిల్లా పీచు అప్పుడేమన' కంటూ విసుక్కుంటాడు చిరాగ్గా. 'దేవుడిచ్చిందానికి మనమేం చేస్తాం చెప్పండి. ఇప్పుడు వద్దనుకుని కావాలన్నప్పుడు కొనితెచ్చుకోవడానికిదేమన్నా బజారుసరుకా అండి మా శాంతక్క పిల్లలకోసం చెయ్యని వ్రతం మొక్కని దేవుడూ లేడు.' అంటుంది మాలతి

ఇంటి డాక్టర్‌తో ఎబార్షన్‌కోసం సలహా సంప్రతింపులు చేశాడు. 'ఈ పిచ్చిపనుల్లోపి ఔటానెస్సన్నావస్తే అసలు ప్రాణానికే మోసం తెలుసా' అంటూ మెత్తగా మందలించి పంపాడు. నా వాళ్లనుకున్నవాళ్లతో ఆలోచనడిగితే 'ఎందరున్నారనిరా తొలిబిడ్డకే అంతలా అఘాయిస్తావేందు'కని చనువుగానే 'పచ్చని కాపురంలో చిచ్చుపెట్టుకో'కని కొరడా ఝళిపించరు. డబ్బుకు కానిపని వుండదులే అనుకొని తన అభిప్రాయం మాలతితో చెప్పాడు వుండబట్టలేక. నిప్పులు తొక్కినట్లు అదిరిపోయి అతని మొగం చూస్తూ ఏడ్పు ప్రారంభించింది. రెణ్ణాళ్లు అన్నం నీళ్లూ ముట్టకుండా అటుమటించే మరదల్ని ఆరాతీసి సుభద్ర తమ్ముణ్ణి తలవాచేటట్లు చివాట్లుపెట్టి నయభయాల చెప్పి మళ్లా అటువంటి ప్రస్తావన తేనని తమ్ముడితో ఒట్టు పెట్టించి మరీ వదిలింది.

కలిగిన వారింటి ఆడబడుచు కడుపుతో వున్నదంటే ఎన్నో అచ్చట్లూ ముచ్చట్లూ వుంటాయి. సీమంతమేకాదు పూలముడుపూ సూడిదలు ఏవి జరపాలన్నా అటు అత్తవారితో ఇటు అక్కయ్యతో వద్దంటే వద్దని భీష్మించాడు. 'ఆయన కంత యిష్టంలేనప్పుడెందుకు లెండి' అని మాలతే సర్దిచెప్పింది. నెలకు నెల పైబడుతున్న కొద్దీ పచ్చని వెన్నెరుపూల చెండులా బంగినపల్లి మామిడి పండులా కంటికి నిండుగా కనిపించే మాలతిలో ఏవేవో దుర్ఘటనలూ దుశ్శంకలూ ఊహించుకుంటూ కుంగిపోయేవాడు మహేంద్ర.

మాలతి తల్లివచ్చి శాస్త్రానికింత చలిమిడి వొళ్లోపెట్టి పురిటికి పుట్టింటికి తీసువెళ్లేరోజున, వెడుతున్నట్లుచెప్పి వెళ్లడానికి గదిలోకివచ్చిన మాలతి రెండు చేతుల్లో మొగం దాచుకొని పసిపిల్లవాడిలా ఏడ్చే భర్తనెలా ఓదార్చాలో తెలియక తికమకపడుతూ కంటినిండా నీళ్లు తెచ్చుకుని 'ఆనీళ్లు కాస్తా పడ్డాక నెల తిరక్కుండా వస్తే సరికదా' అంటూ అతని కన్నీళ్లు తుడిచి నెన్నుదురు ముద్దుపెట్టుకుని 'ఏం మనిషో ఏదొచ్చినా విపరీతమే!' అన్న స్వగతాన్నే ప్రకాశంగా అంటూ విడవలేక విడవలేక విడిచిపెట్టే పెనిమిటి కౌగిలి నెమ్మదిగా విడిపించుకొని వెళ్ళే మాలతిని మళ్లీ కళ్లారా చూస్తానా అంటూ కలవరం, ఏదో తెలియనిభయం పట్టుకుంది మహేంద్రను

* * *

ఒక చల్లనివేళ మాలతి తేలిగ్గా ప్రసవించినట్లు తల్లీ పిల్లడు కులాసాగా వున్నట్టు టెలిగ్రాం వచ్చింది; అతనూహించుకున్న అశుభాల్నీ అనర్థాల్నీ అన్నిట్నీ అపహాస్యంచేస్తూ. ఒకసారి వెళ్లి చూచి రమ్మని సుభద్ర ఎంతచెప్పినా వెళ్లనంటే వెళ్లనన్నాడు. వెడితే మాలతి 'ఏ ఆకారంలో కనిపిస్తుందో' అని ఏరికోరి తెచ్చుకున్న ఆ అందాలన్నింటికీ ఆఖరి అంకం వచ్చిందిలే' అనుకున్నవాడెలా వెళ్లగలడు. వచ్చి బారసాల చేసుకోవలసిందని వ్రాసిన మామగారికి మాఇంటానవాయితీలేదని వ్రాశాడు.

మాలతి అన్నప్రకారం నెలలోగానే తిరిగి అత్తవారింట అడుగు పెట్టింది పసివాణ్ణెత్తుకుని. భ్రూమధ్య విభూతిరేఖా, కొనతీర్చిన కస్తూరీ తిలకం, కండ్లకు కాటుకా— చెవిలో దూదీ—తాంబూలంతో ఎరుపెక్కిన పెదవులూ—నడికట్టూ—మనిషికి మాతృగౌరవాన్ని కలిగిస్తూ పొలిండ్లూ అన్నిటికన్నా ఆకళ్లలో తల్లినయానన్న తృప్తి వీటితో 'చక్కనమ్మచిక్కినాఅందమే' అన్నట్లున్న మాలతి నయన చంద్రికలా వుంది మబ్బును చూచిన మయూరంలా తాండవించి పోయాడు మహేంద్ర అతని కళ్లలో ఆనంద జ్యోతులు పురివిప్పాయి. చేతులుచాచి మాలతిని దగ్గరకు చేర్చుకుంటూ 'మాలతీ!' అన్నాడు చెవిలో ఏమి చెప్పేవాడోమరి అంతలోనే గదిలోవేసిన పట్టెమంచంమీద పొత్తిళ్లలో బాబు సన్నగా సంగీతం సాగించాడు. 'బాబులేచాడు



వస్తో సంటూ మాలతి భర్త చేతులు విడిపించుకుని వెళ్లింది. మహేంద్ర హృదయం ముడికిపోయింది తిరిగి చూడకుండా గదిలో నించి దూసుకుపోయాడు.

ఆ మర్నాడే బాబు మంచం గదిలోనించి మారిపోయింది వచ్చి పదిరోజులయినా పన్నెత్తి పలకరించనూ లేదు కన్నెత్తి చూడనూలేదు. బాబుకు పాలుపట్టి నిద్ర బుచ్చి మాలతి వచ్చేవరకు అలా గుమ్మానికి కళ్లప్పగించి కనిపెట్టుకుని వుండడం నిత్యకంటకంగా వుంది అక్కడికీ భర్త పరిచర్యల కడ్డురాకుండా బాబు పనులు సర్దుకుపోయినా ఆ నోరూ వాయీలేని వాడు ఎప్పుడేపని పెడతాడో ఎలా తెలుస్తుంది. ఎప్పుడేగొంతె మాలసామంతా బాబు తన మీద పగ సాధిస్తున్నాడన్నట్టు బాధపడే వాడు మహేంద్ర.

ఒకరోజు మాలతి వద్దంటున్నా వినకుండా చక్కటి పట్టు బట్టలంతాన బాబును తెచ్చి తండ్రి ఒడిలో కూర్చో పెట్టింది. వాడూ బట్టంత గడికేసి ఏడ్చి చూడడం చూస్తే, ఆ పసివాడు బట్ట తడిపి ఏడుపు లంకించుకున్నాడు. ఎక్కడ ఎత్తి పడేస్తాడో ఆ చిరాకు మనిషంటూ ముఖం పాలిపోయి బాబును తీసుకుంది.

బాబు పెట్టుకువచ్చిన ప్రొత్తులో ఇరుగమ్మా పొరుగమ్మా పాసటానలావున్నా బాబునుగూర్చి ఎంత ముచ్చటపడ్డా, అసలే కన్నతండ్రి అదింపూ ఆదరింపూ లేకపోయాక ఏం ప్రయోజనమనుకొనేది. కొడుకుమీద ద్వేషం అయిష్టం ఎందుకో అర్థం అయేదికాదు. తనవల్ల తప్పేమన్నా వున్నదంటే అదీ కన్పడదు. బాబును కనడమే తప్పనుకుంటే తనేం చేయగలదు? ఒంటరిగా తనతో గంటలతరబడి కబుర్లు చెప్పుకుపోయే మనిషి బాబు చంకలో వుంటే చాలు తప్పించుకుపోతాడు. ఆ పసికందుచేసిన పాపమేమిటో! ఆయన కంత పలకరించరాని అపకారం చేశాడావాడు. ఇలా ఆలోచనల్లో వేగిపోయేది మాలతి.

రోజులు గడుస్తున్నాయి. ఆగర్భ శత్రువుల్లావున్న ఆ తండ్రీ కొడుకుల మధ్య అడకత్తెరలో పోకచెక్కలా వున్నది మాలతి పని: నోరులేని ఆ కన్నవాణ్ణి నీళ్ళూ పాలూ చూడకుండా విడిచిపెట్టి వూరుకోనూలేదు. తనంటే ప్రాణమిస్తున్న పెనిమిటిని ఒప్పించనూలేదు, నొప్పించనూ లేదు. 'ఆయన మనస్తత్వం అంతే' అని సరిపుచ్చుకున్నా కన్నపుత్రుని ఎత్తుకుని ముద్దులాడి మురిసిపోయే ఏ జనకుని చూచినా, కొడుకు చెయ్యి పుచ్చుకుని తప్పటడుగులు వేయిస్తూ తన్మయుడై పోయే ఏ కన్నతండ్రి కనిపించినా, పసిబిడ్డల్ని ప్రక్కనే పడుకోబెట్టుకుని 'చేతిలో వెన్నముద్ద చెంగల్వ పూదండ' చెప్పి అనిపిస్తూ ఆ తొక్కు పలుకులకానందించే ఏ అయ్యను చూచినా తన కొడుక్కు అటువంటి అదృష్టం లేదుకదా అని ఆ తల్లి ప్రాణం ఆక్రోశించిపోయేది.

'బాబును మీ అమ్మదగ్గిర వదిలి రాకూడదు' అన్న మహేంద్ర ప్రతిపాదన 'నేను వాణ్ణి వదిలి వుండలేనండి' అంటూ మాలతి కన్నీళ్లు పెట్టుకోవడంతో వీగిపోయింది. తను వచ్చే వేళకు గదిలో పడుకుని కేరింతలు కొడుతూ వున్న కొడుకుని చూచి మురిసిపోతూవున్నా, చిన్ని గులాబీ రేకుల్లాంటి చేతివ్రేళ్లతో రొమ్ములు తడుముకుంటూ లక్కపిడతలాంటి ఆ నోటితో వెచ్చగా పాలుతాగే పసివాణ్ణి వదిలిపెట్టి పిలవగానే రాలేకపోయినా, మహేంద్ర తన హక్కునీ అధికారాన్ని ఎవరో లాక్కున్నట్టు నీళ్లుకారిపోయేవాడు. 'పాము చుట్టం పడని విరోధి' అన్నట్టుందతని వ్యవహారం.

బాబును ప్రక్కనే పడుకోబెట్టుకుని మాలతి సాయంత్రం కాఫీకి స్టవ్ వెలిగించి నీళ్లు పెట్టింది. ఇంతలో ప్రక్కింటి పిన్నిగారు పిలిస్తే వెళ్ళింది. ఇప్పుడిప్పుడే ప్రాకడం నేర్చుకుంటున్న బాబు స్టవ్ మోతా పువ్వులావిరిసిన మంటా వింతగా చూస్తూ అటు నెమ్మదిగా స్టవ్ దగ్గిరకు ప్రాకి చెయి చాస్తున్నాడు. అందడం తరువాయిగా వుంది. అప్పుడే వచ్చిన దాసీ దడి చూచి గాభరాగా, 'బాబులోయ్ బాబులో' యంటూ పరిగెత్తి, బాబును చంకనెత్తుకుని 'ఏటి బాబా! బుడత డల్లా అగ్గిదగ్గిర పొరాడుతుంటే తమాషా చూస్తరా? ఇయ్యాళ లేచివేళ మంచిది. మాలతమ్మ కడుపు సల్లగా బిడ్డను సంపాయించుకున్నట్టే!' అంటూ గుమ్మం దగ్గిర నిల్చుని అపాయాని కందుబాటులో వున్న బాబును తియ్యాలన్న భావమే లేని మహేంద్రను చీదరించుకుంటూ మాలతికి విశేషణాల్తో వినిపించింది.

బాబుకు జ్వరం, విరోచనాలు. ఏ పూట కా పూట తగ్గిపోతాయంటూ వాళ్ళూ వీళ్ళు చెప్పిన గచ్చాకు పుచ్చాకు వైద్యాలేవో చేస్తూవచ్చింది. మూడు రోజుల్లో బాబు నీరసించిపోయాడు నీళ్ళవిరోచనాల్తో. మహేంద్రతో మందు తెమ్మనీ — డక్టర్ని పిలవమనీ — రోజూ చెపుతూనే వున్నా ఔననకా కాదనకా వినిపించుకోకుండా వుంటే మరో మూడు రోజులయేటప్పటికి బాబు మరీ డీలాపడిపోయాడు. 'ఎంత యిష్టం లేకపోయినా బిడ్డకు మందన్నా యిప్పించరా!' అనుకుంది. ఆ నిర్దాక్షిణ్యాన్ని చూచి వీధి గుమ్మం దాటి యెరగని తనే బాబును డాక్టరింటికి తీసుకువెళ్లి చూపించి మందు తెచ్చుకుంది.

ఇటువంటి భర్తచేష్టలు చూస్తూ 'బాబుకు కీడు కోరుకుంటున్నారేమో' అనుకొన్న మాలతి మహేంద్ర మానవత్వాన్నే అనుమానించింది

ఏ ముద్దూముచ్చటకు నోచుకోని బాబుకు మంచి రోజు చూచి తనే మామగారి పేరు పెట్టి పిలుచుకుంది మాలతి. ఇంటా బయటా అదే పేరయింది. అదీ మహేంద్ర కిష్టంలేదు. పుణ్యాత్ముడైన తన తండ్రి పేరుకు వీడు తగడని. ఆ తాత చేసిన పుణ్యం ఈ మనుమడు చేసిన పాపం తూయదాని కతని వివేకాన్నే తాసేనాడో చెడిపోయింది

తన అంచనాలు తలక్రిందులై, పడిన అనుమానాలు నిరాధారాలని తేలిపోయాయి మహేంద్రకు. మాలతి కాన్పు కష్టం కాలేదు. ఆ అందంలో మార్పు రాలేదు. ఆదనపు ఆకర్షణే వచ్చింది. తనంటే వున్న శ్రద్ధా భక్తి తగ్గలేదు. తనసేవలో లోటు చేయలేదు అయినా, బాబంటే అయిష్టత అలానే వుంది. దేనికైనా రోజు రావాలి

ఆ యింటికప్పక్రిందనే అలానే ఒకరి నీడ ఒకరిపై పడకుండా ఒకటి తరువాత ఒకటిగా ఋతువులు మారిపోయాయి. వచ్చినవే మళ్ళీ వచ్చాయి. మనిషి పెరి

గాడు. మనస్సు పెరగలేదు.

* * *

మహేంద్ర వస్తూనే ఒళ్లంతా నల కొట్టినట్టుందని మంచంమీద వాలిపోయాడు. మాలతి నుదురుమీద చెయి వేసి చూస్తే పెనంలా కాలిపోతూవుంది కళ్ళు జోతుల్లా వున్నాయి. మాలతి కంగారు పడుతూ డాక్టర్‌కు కబురుచేసింది డాక్టర్ వచ్చి యింజెక్షనిచ్చి 'రేపటికి తగ్గిపోతుందమ్మా' అంటూ ధైర్యం చెప్పి వెళ్ళాడు. ఆ రాత్రి మాలతి కంటిమీద కునుకు లేదు. ఇక్కడ భర్తను చూస్తూవుంటే అక్కడ బాబు లేచేవాడు. అక్కడ బాబును జోకొడుతూ వుంటే ఆయన కెలా వుందో అని ప్రాణాలు పీకేవి. అటూ యిటూ తిరగడంలోనే కోడికీ మాలతికీ తెల్లవారింది.

ఆ మర్నాటికే మరీ నీరసించిపోయాడు మహేంద్ర. మూడు నాలుగు రోజులా మందనీ యీ మందనీ మార్చి చూశాడు డాక్టర్. మందుబలంకన్నా రోగబలం ఎక్కువయింది. మహేంద్ర మగత మగతగా జ్వర తీవ్రతలో మూలగడం తప్ప మరోమాటా పలుకులేకుండా పడున్నాడు. ఆ మూలుగు వింటుంటే మాలతి గుండె గుబగుబలాడి పోయేది. ఏ పూట కాపూట రోగం ఒక మెట్టు పైకెక్కుతూవుంటే, మాలతి ధైర్యం ఒక మెట్టు దిగజారుతూవుంది. అటు పిల్లణ్ణీ ఇటు పెనిమిటినీ సంబాళించుకోలేక ఆసరాగా వుంటారని తల్లికీ, అత్తవారింటికి వెళ్లిన సుభద్ర వదిన గారికీ అర్జంటుగా రమ్మని ఉత్తరాలు వ్రాసింది.

డాక్టర్ చివరకు టైఫాయిడని తేల్చి క్లోరాం ఫెనికాల్ వాడుతూవున్నాడు. తల్లీ వదినగార్లు వచ్చాక పిల్లాణ్ణి ఒడిలో వేసుకుని టయింప్రకారం మందూ బార్లీ నీళ్లూ బత్తాయిరసం భర్త కందిస్తూ ఆ మంచం వదిలిపెట్టలేదు మాలతి. తల్లి బలవంతాన వెళ్లి కంచందగ్గర కూర్చుని ప్రమొక్కు చెల్లించుకునివచ్చేది. బాబు తండ్రివంకే చూస్తూ, వచ్చీరాని మాటల్తో 'నా—న్న—ఆ—యి' అంటూ జాలిగా మొగంపెట్టి చెబుతూవుంటే తల్లి ప్రాణం తరుక్కుపోయేది అమ్మ కాళ్ళు రాస్తూవుంటే లేత చేతుల్తో తనూ రాయ బోయేవాడు. మందు త్రాగిస్తూవుంటే చూస్తూ నిలబడేవాడు. మేనల్లుణ్ణి చూస్తూవుంటే సుభద్రకు ప్రాత జ్ఞాపకాల్తో కన్నీళ్లు తిరిగేవి. కన్నే తెరవని ఆ తండ్రికి కన్నకొడుకు సేవలు తెలియవు. ఆ భార్యా బిడ్డల అదృష్టం బాగుండి ఆతని సుస్తీ త్వరగా తగ్గాలనేవారు పరామర్శలకు వచ్చిన బంధువులు. అదీ నిజమే! చెట్టు నాధారంగా గూళ్లు కట్టుకొన్న పక్షుల అదృష్టం తిన్నగా వున్నప్పుడే తుఫానూ ఆ చెట్టు నేమీ చెయ్యలేదు.

'నాన్నకు ఆయి నయంకావాలని దణ్ణం పెట్టు బాబూ!' అని మేనత్త పెట్టిస్తూ వుంటే హాల్లో వెంకటేశ్వరస్వామిపటానికి చిన్ని చేతులు జోడించేవాడు. ఆ పటం కనిపిస్తే చాలు ఆ పసిచేతులు రెండొకటయ్యేవి. కల్మషం అంటని ఆ పసివాడి ప్రార్థనలు ఫలించాయి. మహేంద్రరోగం మందులకే తల వంచిందో, మాలతి సేవా శుశ్రూషలకే లొంగిపోయిందో తిరుగు ముఖం పెట్టింది.

మనిషికి కలిమిలోకన్నా లేమిలో, సుఖంలో కన్నా కష్టంలో ఆరోగ్యంలోకన్నా వ్యాధిలో ఆత్మవికాసం ఏర్పడుతుంది. చేసిన దుష్కృతాలు మనస్సును పీడిస్తాయి. మంచితనం చోటు చేసుకుంటూంటుంది. తనకన్నా పైనొక భగవంతుడున్నాడన్న విశ్వాసం అంకురిస్తుంది. అప్పుడే పశ్చాత్తాపాగ్నిలో పరిశుద్ధమైన మనస్సులో సత్యస్వరూపం గోచరిస్తుంది.




రేపు పథ్యం పెడతారన్న మాటతో అందరి హృదయాల్లో బరువూ దించుకొన్నట్లయింది. గదిలో మహేంద్ర కనుమూసీ మూయనట్లు గది బయట అత్తగారితో సుభద్రక్కయ్యచెపుతున్న మాటలు వింటున్నాడు.

'అమ్మా నాన్నా వేవేడంత మగ నలుసు కోసం కలవరించి కలవరించి పిరాశలు చేసుకున్నాక నా తరువాత పదేళ్లకు పుట్టాడు మహేంద్ర. కుల ముద్ధరించే కొడుకు పుట్టాడని ఆనందపడుతూ అరచేతిలో పెట్టుకుని పెంచుతూవున్న అమ్మను చూచి కాలానికి కన్ను కుట్టింది. అమ్మ పోయినప్పుడు మహీ ఈ బాబంత వయసు లోనేవున్నాడు. అమ్మపెయిన విచారంతో నాన్నకు చాలా పెద్ద సుస్తీయే చేసింది. మళ్లీ బతికి బట్టకడతాడనుకోలేదు. మహీ ఇప్పుడు మన బాబు మాదిరే మంచం పక్కనే నా వగైరా పెట్టుకుని నాన్నను చూస్తూ లక్ష్మి ఆగలో' అనే వాడు. ఏ పటాన్ని చూసినా బాబులాగే 'నాన్న అప్‌పోయ్' అంటూ దణ్ణం పెట్టేవాడు. ఇప్పుడీ బాబును చూస్తుంటే అంతా ఆ తండ్రి పోలికే కనిపిస్తూవుంది. నాన్న నన్నూ మహీని చూస్తూ కన్నీళ్లు పెట్టుకొనేవాడు నా పెళ్లి చెయ్యలేకపోయానని కొడుకు మంచి చెడ్డా చూడకుండానే చచ్చిపోతానేమో అప్పుడే ఆయన భయం. మా మేనమామ ఎంతో ధైర్యం చెబుతున్నా అసలే దెబ్బతిని వున్నవాడేమో మరీ దిగులు పడిపోయేవాడు అత్తయ్యగారూ! అంత మంచిమనిషిని చూడలేదు అప్పటిని చూసే అనుకోండి. అమ్మ చిన్నవారాలన్నా కాక మునుపే 'మా పిల్లనిస్తాం మా పిల్లనిస్తాం' అంటూ వాకిట్లో మూగేవాళ్లు. ఎన్ని సంబంధాలు వచ్చినా ఎందరయినా వాళ్లూ వీళ్లూ బలవంతం చేసినా నాన్న పెత్తనం లేదు 'నా పిల్లలే నా రెండు కళ్లను. నా సుఖంకోసం ఆ కళ్లను పొడుచుకోలేను. లోకంలో సవతి తల్లుల్ని ఎంతమందిని చూడ్డంలేదు. నా బిడ్డలకే

నవనీతచోరా హేకృష్ణా వద్దండి బాబుగా! అంటూ అందర్నీ కాదని ప్రాణమొకెత్తుగా మమ్మల్ని పెంచుకొచ్చాడా మహానుభావుడు ఏ లోకానున్నాడో!

ఇప్పటివాళ్ళవే చెప్పాలి. చంకలో పిల్లాణ్ణిలా పడేసి షర్టుకు గుండీలు పెట్టమంటూ పెళ్ళాన్ని అమల్ దుముల్ చేయమంటే చేస్తారు. ఉచ్చులూ పీతులూ ఏ వంతు, ముద్దూ ముచ్చటా నా వంతు అనేవాళ్ళే యిప్పుడందరూ...

సుభద్ర యింకా చెపుతూనేవుంది. పాత విషయాలు వింటూవున్న మహేంద్రకు క్రొత్త కన్నేదో తెరుచుకున్నట్టయింది. అలల్లాగా ఆలోచనలేవో వస్తున్నాయి. తన తప్పులేవో పుస్తకం పుటలు తెరిచినట్లు గోచరిస్తున్నాయి తన అహాన్ని భయాల్ని వట్టి భ్రమలంటూ కాలం మేలుకొల్పినా తనింకా ముసుగు తన్ని నిద్రపోతున్నాడు. కళ్ళముందు తండ్రే కనిపిస్తున్నాడు. తన తల్లిదండ్రులు 'వంశం ఎలా నిలుస్తుందా' అని తను పుట్టేదాకా తపించిపోయారట. తనలాగా వంశాంకురమే వద్దు అనుకోలేదు. తన మేలుకోరి తన బరువూ బాధ్యతలు స్వీకరించడంకోసం శారీరక సుఖాన్ని తుచ్ఛంగా భావించి మళ్ళీ పెళ్ళి తలపెట్టకుండా శేషించాడు తన తండ్రి. తనో తన కొడుకుని తన సుఖం కొల్లగొట్టటానికి వచ్చిన పగవాణ్ణిగా చూశాడు. ఆ అమృతోపమానమైన వాత్సల్యాన్ని త్రాగి పెరిగిన తాను బాబంటే ద్వేషాన్ని వెళ్ళగక్కాడు. అతి పవిత్రము, భగవత్ప్రసాదితమైన పుత్రప్రేమను అల్ప వాంఛలకు బలిచేసుకుంటూవున్న బలహీనుడు తాను. ప్రక్కనున్న చల్లని కోనేటిని కాదని ఎండమావుల్లో దప్పిక తీర్చుకోవాలని యిన్నాళ్ళూ పరిగెత్తుతున్న అవివేకి తను.

మనిషి మనస్సు విచిత్రమయింది. తన సంకల్పాన్ని బుద్ధిబలంతో వాదించి అవుననిపించనూ కలదు. ఆ సంకల్పాన్ని అదే బుద్ధిబలంతో ప్రతికూల సాక్ష్యాలు సమకూర్చి కాదనిపించనూ కలదు. రెండు వేపులా పదునున్న ఆ కత్తిని కన్ను చెదరకుండా కాలుజారకుండా వాడుకోగలవాళ్ళు ఏ కొద్దిమందో.

# పన్నీటి ఊట...

అనుమానపు పాషాణాల డ్డుకున్న మహేంద్ర వాత్సల్యవాహిని రెట్టించిన వేగంతో నిరాటంకంగా ఎగచిమ్మింది. మబ్బు విడిచిన ఎండలా అతని మనస్సు తేజస్సుతో అతిస్వచ్ఛంగా వెలుగుతూంది

'మాలతీ!' అన్న పిలుపుకు 'ఏమండీ' అంటూ గదిలో కాలుపెట్టి 'బత్తాయి రసం తెమ్మంటారా?' అన్న భార్యమాట వినిపించుకోకుండానే 'బాబేం చేస్తున్నాడు' అన్న భర్త ప్రశ్న వినడం విన్నా అర్థం స్ఫురించనట్టు అతనికేసి చూస్తూ వుండిపోయింది. పుట్టిన యిన్నాళ్ళకు ఆయన నోట 'బాబు' అన్న ఆ రెండక్షరాల మాట వింటుంటే ఏమర్థమవుతుంది? 'మన బాబేం చేస్తున్నాడు మాలతీ' అన్నాడు మళ్ళీ, మహేంద్ర.

అప్పుడే వచ్చిన సుభద్ర 'బాబిప్పుడే నిద్రలేచాడు. ప్రక్కింటి పార్వతి తీసుకు వెళ్ళినట్టుంది' అంటే అక్కయ్యను వెళ్ళి తీసుకురమ్మని ఆ అక్క వెళ్ళి తీసుకువచ్చేలోగానే మహేంద్ర తహతహలాడిపోయాడు క్షణం యుగంలాగా.

సుభద్ర గగ్గోలుగా ఏడుస్తూ వచ్చింది; చేతుల్లో చంటివాణ్ణెత్తుకుని. మాంసం ముద్దలా వున్నాడు బాబు. ఒళ్ళూ ముఖం అంతా నెత్తురుమయంగావుంది. బాబును చూస్తూ 'ఏమయిందిరా తండ్రీ!' అంటూ అరుస్తూ మొదలు నరికిన చెట్టులా మాలతి స్పృహలేకుండా పడిపోయింది. మాలతి తల్లి పరిగెత్తుకుంటూవచ్చి కూతురు తల ఒళ్ళో పెట్టుకుని దాసీది తెచ్చిన నీళ్ళు ముఖం మీద చిలకరిస్తూవుంది.

దాసీది చెప్పింది. బాబును తీసుకు వెళ్ళిన పార్వతి వాళ్ళ మేడమెట్లెక్కుతూ పై మెట్టుమీద కాలు మెలికపడి బాబుతో సహా పైనించి దొర్లుకుంటూ క్రిందకు పడిపోయింది. ఆ పడటంలో బాబు తల మెట్లప్రక్క స్తంభానికి తగిలి పచ్చడయింది. అక్కడంతా రక్తకొల్లేరయింది. పార్వతమ్మ కాలు ఎముక విరిగిందనుకుంటున్నారు.

బాబు శరీరం చన్నీళ్ళ కడవలావుంది. ఆ పసివాడి బొందెలో చిలకెప్పుడో ఎగిరిపోయింది. సుభద్ర మతిపోయి ఏం చేస్తూవుందో తెలియకుండానే ఆ ప్రాణంలేని కట్టెను మహేంద్ర ప్రక్కలోవేసింది.

మహేంద్ర అలా విలువ్రగుడ్లతో మాట పలుకులేకుండా చూస్తుండిపోయాడు. గట్టిగా ఏడ్చే ఓపిక కూడా లేదు. చేతికందినపండు జారిపడి చితికిపోయింది. నోటిదగ్గరకు వచ్చిన ముద్దను గ్రద్ద తన్నుకుపోయింది. చలనంలేని బాబును చిక్కిపోయిన చేతుల్లోకి తీసుకుని అక్కున చేర్చుకున్నాడు. అదుముకున్నాడు. నిర్జీవమైన ఆ శరీరాన్ని ఆపాదమస్తకం ముద్దుల్తో నింపివేశాడు. వాడిన తామర తూళ్ళలా వ్రేలాడిపోతున్న ఆ చిన్ని చేతుల్తో మొగం కప్పుకుని లోలోన కుమిలిపోయాడు. మంచుముక్కలావున్న బాబు దేహాన్ని భుజాన వేసుకుని వీపుమీద చిచ్చికొడుతూ మహానందాన్ననుభవిస్తున్నాడు. అణచుకోలేని శోకభారమతణ్ణి పిచ్చివాణ్ణి చేస్తూవుంది. ఆ మృత శిశుస్పర్శకే అతని సర్వశరీరం పులకించి పోతూవుంది. అది సుఖమో దుఃఖమో తెలియలేని మనస్థితిలో వున్నాడతను. ఏ స్వార్థపంకం, వాంఛామాలిన్యం, వ్యామోహబంధంలేని శరావ్యాకాశంలాగా వుందతని మనస్సు. కన్నీళ్ళు కారిపోతున్నాయి అనుమానాలు ఆక్రోశాలు కోపాలు, తాపాలు, ఆశలు అనుబంధాలు అన్నీ కరిగి ప్రవహిస్తున్నాయి. సమస్త మలినక్షాళితమైన మహేంద్ర మనస్సులో నిక్షిప్తంగావున్న వాత్సల్య సింధువులు అశ్రుబిందువులుగా ఆ పాలిపోయిన చెక్కిళ్ళ మీద పులుకడిగిన ముత్యాల్లా మిలమిలా మెరిసిపోతూ జారి బాబు తలమీదపడి చిట్లిపోతున్నాయి.

కాలమల్లే సాలిగూటిలో చిక్కుబడక తప్పదే పాణికైనా! ఎంత గింజుకున్నా గిజగిజలాడినా ప్రయోజనం శూన్యం. తలుపు తెరిచిన కథ మలుపు తిరిగింది. పాపం! మహేంద్రలో అనురాగం తొలకరించింది. కాని అతణ్ణి అదృష్టం కనికరించలేదు. మనసు పన్నీటి ఊట అయిన మరు క్షణంలో బ్రతుకు కన్నీటిబాట అయింది ●

# వారఫలం

**26-4-68 శుక్రవారం మొదలు**
**2-5-68 గురువారం వరకు**

**మేషం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారంమధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణిస్తుంది సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం** అన్నివ్యవహారాల్లోను ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిథునం:** భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అనుకోని చికాకులకు గురికాగలరు. మీ తాలూకు వస్తువులు పోయేప్రమాదం ఉంది

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది అధిక వ్యయం జరుగుతుంది.

**కర్కాటకం** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం ఆఖరులో బాగా ఉంటాయి స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**సింహం:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాహిత్యకళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు శ్రమ మీద నెరవేరుతాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**కన్య.** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతోకూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. అనుకూలమైన వార్తలను వింటారు.

**తుల:** ఫలితంమాట యెలాగఉన్నా, ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు బాగా ఉంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**వృశ్చికం.** మీకు మున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు వృత్తిలో పోటీ వారితో పోటీ పెరుగుతుంది. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలసంచలనం పెరుగుతుంది. పోటీవారితో మాట పట్టింపులు తగవు.

స్త్రీలకు— సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**మకరం.** కొన్నివ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడం వలన శ్రమ కలుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణించగలదు.

స్త్రీలకు— బంధువులకు సహాయం చేస్తారు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కుంభం:** వ్యాపారంలో పోటీవారితో పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. వృత్తిలో అనుకూలవార్తలను వింటారు. ఆర్థికవ్యవహారాల్లో మొగమాటాలు తగవు. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**మీనం** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణం ద్వారా కార్యసాధనచేయగలరు. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు

—మహేష్



సీరియల్





సి. ఆనందారామం

**జ రి గి న క థ**

రామచంద్రమీద అభిమానం పెంచుకుంటుంది వారిజ. రామచంద్ర కూడా వారిజని ప్రేమిస్తాడు. గతంలో ఆమె ఒక సినిమాతార అని తెలుసుకున్న తర్వాత అతను గుండెరాయి చేసుకుంటాడు. వారిజ వృత్తిని విరమించుకుని తన కుటుంబానికి పాటు పడుతూవుంటుంది. అయినా ఆమెమీద అందరికీ దురభిమానమే. వారిజ చెల్లెలు లత. రామచంద్రానికి లతతో వివాహం జరిగిపోతుంది. లతలో వారిజని వూహించుకున్న రామచంద్ర ఆశలు ఫలించవు. వారిజ రామచంద్ర నామస్మరణంతో అదే వూళ్ళో టీచరుగా ఉద్యోగం సంపాదించుకుంటుంది.

# 8

'మీకుందికదూ, నా మీద ప్రేమ!' తెలిసోతెలియకో లత నోటవచ్చిన ఆ ఎత్తిపొడుపు అతనిని తిరిగి తిరిగి గుచ్చపొగింది. —ఎంత నిజం! లతకు తనమీద ప్రేమ లేదని ఆమెమీద అభియోగం మోపేముందు ఆ ప్రశ్న తనను తను వేసుకుంటే?

లత ఇంకా పసిదయం కదూ! ఎవర్నీ ప్రేమించటంలేదు. తను...

ఒక్కసారి లేచినిలబడ్డాడు రామచంద్ర —ఉబికి ఉబికి వస్తోన్న ఆలోచనలను ప్రయత్నపూర్వకంగా వెనక్కు నెట్టాడు— లేదు—తనెవర్నీ ప్రేమించటంలేదు—లతినే ప్రేమిస్తున్నాడు—ప్రేమిస్తాడు.

టీ కప్పు అందించిన చేతిని లాలనగా పట్టుకున్నాడు రామచంద్ర.

'లతా! నా మీద కోపం వచ్చిందా? ఇవాళ తల నొప్పిగా ఉంది లతా?'

లత నవ్వింది.

'ఊహు! కోపం లేదులెండి—' అనేసి లోపలకు వెళ్ళిపోయింది.

తనకు తలనొప్పి అని విని వెళ్ళిపోయింది.

'తల నొప్పా' అని కంగారుగా తలమీద చెయ్యివేసి చూడలేదు—'మనసు ఎందుకు చికాగ్గా ఉంది?' అని అడగలేదు. 'ఉండండి —మందు వేసుకుని మరీ టీ త్రాగండి— తలనొప్పితో ఎలా బాధపడగలరు?' అని అనునయించలేదు.

'కాస్త మందు రాయనా' అని ఆప్యాయత చూపలేదు.

'ఇంకా తాగలేదూ! చల్లగా అయిపోతుంది — ఏవిటాలోచిస్తారు అస్తమానూ?' లోపలినుండి వచ్చిన లత అడిగింది.

రామచంద్ర తలెత్తి లత ముఖంలోకి చూసాడు—లత నవ్వింది — స్వచ్ఛంగా—పసిపిల్లలా.

'తెలీదు—ఏం తెలీదు—' గబగబ టీ తాగేసాడు.

లత వంటపని ప్రారంభించింది.

రామచంద్ర అనాలోచితంగా మళ్ళీ వీధిలోకి నడిచాడు.

ఎదురుగా మల్లెపూల మాలలు అమ్ముతోంది రత్తి.

రెండు మాలలు కొన్నాడు.

వంట పూర్తిచేసి మళ్ళీ పుస్తకం తీసుకోబోయింది లత.

'మళ్ళీ పుస్తకమా!' అన్నాడు మృదువుగా—మందలింపుగా.

'మీరేమో ఆలోచిస్తూ ఉంటారు. నేనేం చెయ్యనేవిటి?' బుంగ మూతితో అంది లత.

రామచంద్ర చటుక్కున ముందుకు వంగి ఆ బుంగమూతిమీద ముద్దు పెట్టుకున్నాడు.

కిలకిల నవ్వింది లత — పులకించిపోయాడు రామచంద్ర.

'ఆ పుస్తకం మూసి ముఖం కడుక్కుని చీర మార్చుకో!'

'ఎందుకు?' ఆశ్చర్యంగా అడిగింది—

'చెప్తాగా!'

లత గబగబ తయారయింది ఉత్సాహంగా—లత భుజాలు పట్టుకుని వెనక్కు తిప్పి పువ్వులు లత జడలో తురిమి తనివి తీరా ఆఘ్రాణించాడు రామచంద్ర—

లత చెయ్యిపట్టుకుని ప్రేమగా నొక్కుతూ 'పద కాస్సేపు డాబాపైన కూచుందాం' అన్నాడు—

వెలవెలపోయింది లత—

'సినిమాకు కాదా!'

చివుక్కుమంది రామచంద్రకి—

'ఇవాళ నా వంట్లో బాగులేదు లతా! రేపెళ్దాం సినిమాకి రా! డాబామీద కూర్చుందాం...'

'సినిమాకు తీసికెళ్ళనికాడికి ఈ పూలు కొనటం దేనికి?'

ఉక్రోషంగా ఉంది లత—

'సినిమాకి వెళ్ళకపోతే ఈ పూలు దేనికి?' దీనికి సమాధానం ఎవరు చెప్పగలరు?

ఇదే వారిజయితే—

భగవంతుడా! వద్దు! వద్దు! ఆ పోలిక వద్దు—ఇదెక్కడి విపరీతం? ఈ వారిజ తన మనసులోంచి పోదేం? అనుక్షణమూ తన మనసులోని వారిజతో లతను పోల్చుకుంటూ లతకు అన్యాయం చేస్తున్నానా? ఎలా ఈ లత మనసు వికసింపజేసి అందులో స్థానం సంపాదించుకోవటం?

'సరే పద! సినిమాకే వెళ్దాం—' అన్నాడు—

'వంట్లో బాగుండనప్పుడు ఎందుకు లెండి—' అంటుందని ఆశపడుతూనే—

'నిజంగానా? మీరెంత మంచివారూ!' అంటూ బయలుదేరింది లత—ఆవిడ ముఖంలో స్పష్టంగా ప్రతిఫలిస్తోన్న సంతోషోత్సాహాలను గమనించి దీర్ఘంగా నిట్టూర్పు విడుచుకున్నాడు రామచంద్ర.

*　　*　　*

సంధ్య అప్పుడప్పుడే అంతరిస్తోంది—అరుణ కిరణాలు పలుచని వెన్నెల రేఖలలో మిళితమై, ప్రకృతి వింతశోభతో మెరుస్తోంది — ఇంటిముందు పూలమొక్కల మధ్య పచారులు చేస్తోన్న రామచంద్ర మెట్లమీద నిలుచున్న లతను చూసి ఆగిపోయాడు.

తలంటుపోసుకున్న ముంగురులు గాలిలో ఎగిరెగిరిపోతుండగా, తెల్లని జరీచీర కట్టుకుని దూమెరుగ్గా పసుపు రాసుకున్న ముఖానికి గులాబిరంగు పౌడర్ మెరుగులు పెడ్తూండగా తలలో మల్లెలు ముడుచుకోబోతున్న లత తానే ఒక తెల్ల గులాబీలా అనిపించింది రామచంద్రకి—మెల్లగా లతను సమీపించి చెయ్యి పట్టుకుని తనమీదికి లాక్కున్నాడు — పరధ్యానంగా ఉన్న లత ఉలిక్కిపడింది— విసుగ్గా ముఖం చిట్లించి దూరంగా జరిగి 'ఏమిటిది బాబూ! వేళా పాళా లేకుండా!' అంది.

చివుక్కుమంది రామచంద్రకు—

తను చిలిపితనం చెయ్యబోయినపుడు వారిజ సహితం వారించేది—కానీ ఆ మాటలలో ఎంత మృదుత్వం? ఆ మొహంలో కనిపించేది విసుగు కాదు—ఒక రకమైన పారవశ్యం—పెదవులు వద్దంటోన్న సమయంలోనే కళ్ళు మరింత చిలిపిగా కవ్వించేవి—చెక్కిళ్ళలో అరుణిమ మరింత బలంగా ఆహ్వానించేది—చిరునవ్వులో తొణికిసలాడే చైతన్యం నిలువునా కుదిపేసేది—వారిజ వారింపు తన ఉద్రేకాలను ఇంకా రెచ్చగొట్టేది — పెదవులతో వద్దంటూ వయ్యారంగా హేలగా కదలిన ఆమె తనువు కోటి గొంతులతో తనను పిలిచేది—



## చీకటి కడుపున ...

తనలో అణువణువూ జ్వలించేది—

కానీ లత విసుగుదల తన పొందే ఉద్రేకాలమీద చల్లని నీళ్ళు జల్లుతోంది—

'ఏమిటిది లతా? హాయిగా చిలిపిగా కవ్విస్తూ నవ్విస్తూ ఉండాలి దాని ఆలా విసుక్కువచ్చా?'

విసుగ్గా చూసింది లత—

'నేనేమైనా భోగందాన్నా! ఆ వగలన్నీ నాకు తెలిసేందుకు?'

చురుక్కున తగిలింది రామచంద్రకు—

వారిజ సమక్షంలో ప్రతిక్షణమూ ఒక అమృతపు గుళిక—తన కదలికలో, మాటలో, నవ్వులో, బెదిరింపులో, లాలనలో. మాధుర్యపు పరమావధిని దర్శింపచేయగలదు వారిజ — ఈ జగత్తునే మరపింపచేయగల రసమయి లోకాలలో తేల్చివేయగలదు — అందుకు కారణం వారిజ —

అయ్యో! అంతేనా! ఇది నిజమా!

అకస్మాత్తుగా రామచంద్రకు రెండు రోజుల క్రిందట పొలంలో తను చూసిన దృశ్యం గుర్తుకొచ్చింది — వీరన్న ఎవరూ లేకుండా చూసి రంగనాయకి పైటకొంగు పట్టి లాగాడు—

'ఏటి మావా?' అంది కనుబొమలు ముడిచి — అంటూనే పకాలున నవ్వింది—

'ఏమిటో నువ్వే చెప్పాలు కదే!' అన్నాడు వీరన్న—

'ఆ! చెప్తాను — ఇంకా చెప్తాను—రా!' అంది కళ్ళెగరేసి— కళ్ళెగరేసిందే కాని పెదవులు నవ్వకుండా జాగ్రత్త పడటం మరిచిపోయింది—

వీరన్న సమీపించాడు రంగనాయికిని—

'చెప్పవే! చెప్పు—గట్టిగా అరవకు — చెవులో చెప్పు' — అంటూ దాని చెక్కిలి ముద్దుపెట్టుకున్నాడు—

'ఛీ! ఛీ!' అంటూనే అది హేలగా ముందుకు కదిలింది—ఆ కదలికలోనే రమ్మన్న పిలుపు ఉంది—దానిని అందుకున్నాడు వీరన్న—

మరి, రంగనాయకి?— ,

అశాంతిలో వేగిపోతోన్న మనసుని ఏ విధంగా ఓదార్చుకోవాలో. అర్థం కావటంలేదు రామచంద్రకు—అసలు వారిజతో తనకు పరిచయంలేకుండా ఉంటే ఇంత అశాంతి ఉండేది కాదేమో? లత్ప్రవర్తన సహజంగా తోచి ఉండేదేమో?

తన కిది న్యాయంకాదు — లతను ప్రేమించాలి — ఇంకా గాఢంగా ప్రేమించాలి — ఆ ప్రేమలో ఇప్పుడు లోపాలుగా కనిపించేవన్నీ కొట్టుకుపోతాయి — తన ప్రేమ పొంగు లతలోనూ ప్రేమను అంకురింపజేస్తుంది —

లత కాపురానికి రాకముందు వీరన కూడా రామచంద్రతో రామచంద్ర ఇంట్లోనే ఉండేవాడు— కానీ లత వచ్చాక వీరన్న వేరే ఇల్లు తీసుకుని ఉంటున్నాడు— పొలంలో కలుసుకోవటమే తప్ప అంత తరచుగా రామచంద్ర ఇంటికి కూడా రావటంలేదు—

చాలా రోజుల తరువాత తన ఇంటికి వచ్చిన వీరన్నను ఆప్యాయంగా ఆహ్వానించాడు రామచంద్ర.

'ఏమిటి వీరన్నా! ఏం విశేషం ఇలా వచ్చావు?' అన్నాడు—వీరన్న కొంచెంసేపు ముసిముసిగా నవ్వాడు.

'ఏమిటి పెళ్ళికొడుకులా సిగ్గుపడుతున్నావ్?' అన్నాడు రామచంద్ర నవ్వుతూ.

అదే! అదే బాబూ! నేనూ రంగనాయకీ పెళ్లిచేసుకోబోతున్నాం — దానికీ ఎవరూ లేరు—నాకూ ఎవరూ లేరు—శాస్త్రులుగారు గుళ్లో పెళ్లి చేయిస్తానన్నారు—మీ చేతుల మీదుగానే జరగాలి మా పెళ్లి—' సిగ్గుపడుతూ అన్నాడు వీరన్న.

పట్టరాని సంతోషంతో వీరన్నను కౌగిలించుకున్నాడు రామచంద్ర.

'ఎంత మంచి కబురు తెచ్చావు వీరన్నా! నేనులేకుండా నీ పెళ్లి ఎలా జరుగుతుందీ? పెళ్లికొడుకు తరపు పెద్దను నేనే! వియ్యంకుడి హోదా అనుభవిస్తాను—'

వీరన్న ముఖం సంతోషంతో కృతజ్ఞతతో మెరిసింది.

'ఈ నెల 20 వ తేదీ ముహూర్తం నిర్ణయించారు శాస్త్రులుగారు—'

'ఇంకా పదిహేను రోజులుంది గదా! కావలసినంత గ్రేండ్‌గా ఏర్పాట్లు చేసుకోవచ్చు.'

'మీరు నా పక్కన నిలబడటం కంటె 'గ్రేండ్' ఏంకావాలి బాబూ!'

'పోరా! నేను నీ పక్కనుండక ఏమవుతాను? రంగనాయకికి ఏరంగు ఇష్టమో

# బలము మరియు శక్తి కోసం—బోర్న్‌విటా!

## బోర్న్‌విటా రుచి సాటిలేనిది..

## ఇందుకు కిటుకు—కోకో!

కోకో, పాలు, పంచదార మరియు మాల్ట్‌తో నిర్దేశితమైన పద్ధతి ప్రకారం మిశ్రణము చేసిన ఫలితము. అధిక శక్తి నిచ్చే పానీయము—బోర్న్‌విటా! బోర్న్‌విటాను వేడి పాలలో కలపండి. ఈ రుచికరమైన పానీయము వలన శక్తి మరియు బలము పొందండి.




**బలము, శక్తి మరియు రుచి కోసం**

**క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా**

ఇక్కా! ఆ రంగనాయకికి పెట్టే చీర కొందాం.'

ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ వెళ్ళిపోయాడు వీరన్న.

వీరన్నా రంగనాయకిల వివాహవార్త రామచంద్రకు కలిగించినంత సంతోషం లతకు కలిగించలేదు.

'ఆ! ఏముంది ఇందులో? పాలేరు, కాపుదాన్ని చేసుకుంటున్నాడు మామూలేగా!' అంది.

'అలాకాదు లతా! వాడికి నేను తప్ప ఎవరూలేరు — వాడు నా దగ్గిర పాలేరన్న మాటేగాని, ఒక రకంగా మేం స్నేహితులం — అన్నదమ్ముల్లా మసలుకొంటున్నాం — మనం దగ్గిరుండి వాడి పెళ్ళి జరిగించాలి.'

'ఛీ! ఛీ! పాలేరు వాడి పెళ్ళికి నన్ను రమ్మంటారా? నా కర్మకాలింది — నేను రాను.'

'లతా! నాకోసం...'

'మీరూ, మీ స్నేహాలూ—ఇలాంటి కూలి వాళ్ళు తప్ప మీకింకెవరూ స్నేహితులు దొరకరు కాబోలు!'

'అలా మాట్లాడకు లతా! పోనీలే! ఈ పక్క షాపుకి రా!'

'ఎందుకు? తహసీల్దారుగారి భార్య ... స్వయంగా వచ్చి వాళ్ళబ్బాయి ... రోజుకి రమ్మంది—నేను ఎంత ప్రతి... ఆనాడు మీరు వచ్చారా?'

'... వాళ్ళ పేరంటానికి నేనెందుకు?'

'... పొలంలో పాలేరు పెళ్ళికి ... ఎందుకు?'

# చీకటి కడుపున...

ఉసూరుమన్నాడు రామచంద్ర — ఇంక లతతో వాదించే ఓపిక లేకపోయింది—

అసలు యుద్ధం రామచంద్ర రంగనాయకికి నూటయాభై రూపాయల పట్టు చీర కొనటంతో ప్రారంభమయింది—

'కూలిదానికి ఇంత ఖరీదైన చీరా?' అంది ఉక్రోషంగా లత—

రామచంద్రకు కూడా చాలా కోపం వచ్చింది—

'కూలిదానికి కాదు — నా ఆత్మీయుడు వీరన్న భార్యకు.'

'మీరేం చేస్తే అది మీకు మంచి! నా స్నేహితురాలి కూతురు పుట్టినరోజుకి 20 రూపాయలిచ్చి నైలాన్ గౌను కొన్నానని ఆరోజంతా సాధించారు — 'తలకు మించిన ఖర్చులు పెట్టకూడదనీ—లేనిపోని డాబులకు పోకూడదనీ'—ఇంకా ఏవిచేవిటో —ఇవాళ మీరు నూటయాభై పెట్టి చీర కొన్నారు—పెళ్ళయ్యాక నాకయినా కొనలేదు అంత మంచి చీర—అంతంత ఖర్చు మీరు పెడితే పరవాలేదు కదూ!'

'నువ్వు నీ స్నేహితురాలి కూతురుమీద ప్రేమతో కొనలేదు ఆ గౌను—నలుగురిలో గొప్పకోసం కొన్నావు—అలాంటి గొప్పలకు పోవద్దన్నాను—నేనూ వీరన్నా అన్నదమ్ముల్లాంటి వాళ్ళమని చెప్పాను—అందుకు కొన్నాను—'

'అన్నదమ్ములు! ఎలా అవుతారు? ఈ కూలి వాళ్ళతో స్నేహాలేకాక బాంధవ్యాలు కూడానా? పాటి వాళ్ళలో చిన్నతనం కాకుండా ఉండటానికి నే నొక్కదాన్ని గౌను కొంటే అంత రాద్ధాంతం — ఛీ! వెధవ బ్రతుకు—20 రూపాయలు స్వతంత్రంగా ఖర్చుపెట్టుకోడానికి లేదు — పల్లెటూరు మురికి వీధులు—మురికి మనుష్యులు—మురికి బ్రతుకు—' నిర్ఘాంతపోయాడు రామచంద్ర.

'మురికి బ్రతుకు'—లతకు తన బ్రతుకు మురికి బ్రతుకులా ఉందా?

ఇంకొక్క మాట మాట్లాడలేదు రామచంద్ర — అతి ప్రయత్నంమీద ఎంతో ఓపికతో లత చుట్టూ రామచంద్ర అల్లుకోడానికి ప్రయత్నిస్తోన్న ప్రేమ పాశాలన్నీ ఎప్పటికప్పుడు తెగిపోతున్నాయి.

మళ్ళీ వీరన్న పెళ్ళికి లతను రమ్మని అడగలేదు రామచంద్ర.

క్రొత్త బట్టలు తీసుకుని ఒక్కడే గుళ్ళోకి వచ్చిన రామచంద్రను కొన్ని క్షణాలు ప్రశ్నార్థకంగా చూసాడు వీరన్న— రామచంద్ర తల వంచుకున్నాడు — వీరన్న ఇంకేమీ ప్రశ్నించలేదు.

పసుపు బట్టలతో తనకు నమస్కరించిన రంగనాయకి వీరన్నలకు మనసారా ఆశీర్వదించి తను తెచ్చిన బట్టలు వీరన్న చేతులో పెట్టాడు రామచంద్ర.

* * *

'ఈ చీకట్లో అటు వెళ్ళకండి— పురుగూ పుట్రా ఉంటాయి—'

చటుక్కున ఆగిపోయాడు కాలువగట్టు వైపుగా నడుస్తోన్న రామచంద్ర —

'ఎవరు? వారిజా!' అన్నాడు ఆశ్చర్యంగా—

'ఆ! అవును—నేనే!'

'ఇక్కడుంటున్నావా?'

'మీరు కనిపించటంలేదుగా! మీరే నాకు కనిపించారు ఈమారు మూల నిశ్శబ్దంలో కూర్చుని మిమ్మల్ని ధ్యానిస్తున్నాను—మీరు ప్రత్యక్షమయ్యారు—తపశ్శక్తి కల్పన అని ఎవరనగలరు?'

'ఈ చీకట్లో నన్ను గుర్తుపట్టగలిగావా?'

'సంపూర్ణమైన చీకటి ఎక్కడుంది అసలు? మిమ్మల్ని చూడాలని పరితపిస్తోన్న నాకళ్ళు ఈ చీకట్లో విలీనమైన కాంతి రేఖల సాయంతోనే మిమ్మల్ని చూడగలవు.'

'ఇంతసేపు నిలబెట్టి మాట్లాడుతున్నావు—లోపలికి రమ్మనకూడదూ!'

'అంత అదృష్టమా!... నా ఇంట్లో

శెభాష్! నా కొడుకని-
పించావ్! బ్రహ్మాండ
మైన నెక్లెస్ ఇది!!



అమ్మ దగ్గర కొట్టేసా
నాన్నా!



అడుగుపెట్టారా?'

చీకట్లో వారిజ ముఖభావాలు స్పష్టంగా తెలీకపోయినా వారిజ కంఠంలో ధ్వనించిన సంతోషం సూటిగా రామచంద్ర హృదయాన్ని తాకింది—

తనే వెళ్ళి లోపల కుర్చీలో కూర్చున్నాడు— విద్యుద్దీపకాంతిలో వారిజను చూసాడు—వెనుకటికంటె కూడా బాగా చిక్కిపోయింది- ముఖం వడిలిపోయింది— సాధారణమైన నేతచీర కట్టుకుంది—తలనిండా మల్లెలు—ఆ మల్లెలవంక చూస్తూ కూర్చున్నాడు రామచంద్ర—అతని చూపులను గమనించి నవ్వింది వారిజ

'నాకు మల్లెలు ఎందుకని—కదూ!'

'అహ!—అదేంకాదు...'

తడబడ్డాడు రామచంద్ర.

'నాకూ అనిపించింది—ఈ మల్లెల సౌరభాలు నాకెందుకని—కానీ, బలహీనురాల్ని—ఈ పరిమళాలను దూరంచేసుకోలేను—ఈ గుబాళింపులలో నా హృదయం చిత్రవధ పొందుతోన్నా ఆనరక యాతనను సహితం సహించగలను కాని, పువ్వులకే దూరమయిపోవటం నాతరం కావటంలేదు.'

దీర్ఘంగా నిట్టూర్చాడు రామచంద్ర.

వారిజ బెదురుగా అతనివంక చూస్తూ 'కాస్త కాఫీ తాగుతారా?' అంది దీనంగా.

'ఇది భోజనసమయం — కాఫీ ఇచ్చి పంపిస్తావా ?'

'ఏమిటీ?—మీరు—ఇక్కడ భోజనం చేస్తారా? నిజంగా? అబ్బా! ఆనందం పట్టలేక గుండెలు పగిలిపోతాయేమోనిపిస్తోంది -ఈ దౌర్భాగ్యురాలిమీద మీకెంత దయ? ఏ దేవుడు ప్రసాదించాడు మీకీ అమృత హృదయం ?'

భావోద్వేగంతో వారిజ కళ్ళలో నీళ్ళు తిరిగిపోయాయి. గబగబ వంటింట్లోకి నడిచింది వారిజ.

వీరన్న పెళ్ళి పూర్తయ్యాక ఇంటికి వచ్చాడు రామచంద్ర.

ఇల్లు తాళంపెట్టి ఉంది — తరువాత పక్కింటివాళ్ళ అమ్మాయి తాళంచెవి తెచ్చి ఇచ్చింది.

'అతగారు ఎన్నిగారూ వాళ్ళతో కలిసి సినిమాకు వెళ్ళారు—' అని చెప్పింది.

ఆ అమ్మాయి ఇచ్చిన తాళంచెవి తీసుకుని మూసిన తలుపులవంక కొన్ని

# చీకటి కడుపున ...

క్షణాలు చూస్తూ నిలుచుండిపోయాడు రామచంద్ర—తను ఎంతో సహనంతో తెరుస్తున్నా, లత మూర్ఖంగా మూసేస్తోన్న తన హృదయంద్వారా లలా అనిపించాయి ఆ మూసిన తలుపులు రామచంద్రకి.

తాళంతీసి ఆ శూన్యగృహంలోకి అడుగు పెట్టడానికి మనస్కరించలేదు — గమ్యం లేకుండా నడక ప్రారంభించాడు—తనకు తెలీకుండానే చాలాదూరం వచ్చాడు. కాలవ వైపు మళ్ళుతుండగా వారిజ ఆపింది—వారిజ ఇక్కడుందనే అతనికి తెలీదు.

'ఇప్పుడేం చేస్తున్నావు వారిజా! నువ్వు వండుకున్నదే పెట్టు—'

'భలేవారు—ఏ జన్మలోనో నేను చేసుకున్న పుణ్యం ఫలించి నా యింటికి భోజనానికి వచ్చారు—ఈ రోజు బద్ధకించనా? మళ్ళీ ఇలాంటి రోజుకి నోచుకుంటానో? లేదో? అయినా ఏం చేస్తున్నాను? బంగాళ దుంపలు వేయిస్తున్నాను — కొబ్బరికాయ పెరుగు పచ్చడి చేస్తున్నాను — అంతే! అమాత్రమైనా లేకుండా ఎలా తింటారు?' సంతోషంవల్ల ఒక వింత కాంతితో, సంతృప్తితో మెరిసిపోతోన్న వారిజ ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడు రామచంద్ర. ఈ యువతికి తాను చీరలు తేలేదు—నగలు తేలేదు—కేవలం తనకు వండి వడ్డించటంలో నిర్భరానందాన్ని పొందగలుగుతోంది.

'ఈ ఊరు ఎందుకొచ్చావు వారిజా మళ్ళీ! ఎన్నాళ్ళుంటావు?'

'ఎందు కొచ్చానో మీకు తెలుసు—చచ్చిపోయేవరకూ ఇక్కడే ఉండాలని నా ఆశ—మరి ఏమవుతుందో ?'

'నాకోసం వచ్చినదానివి నాకు కనబడకుండా ఇన్నాళ్ళు ఎలా ఉండగలిగావ్ ?'

బంగాళదుంపలు వేయిస్తోన్న వారిజ ఒక్కక్షణం రామచంద్ర ముఖంలోకి చూసి తల దించుకుంది.

'మీ కంటికి నేను కనబడకపోయినా, నాకు మీరు కనిపిస్తూనే ఉంటారు—బాహ్య దృష్టికి కాదు—మనో నేత్రానికి—ఆ భావనలతో బ్రతకటానికి అలవాటు పడిపోయాను — మీరు పెళ్ళి చేసుకున్నారని విన్నాను—' ఒక్క క్షణం ఆగి వారిజ సిగ్గుపడుతూ నవ్వింది మధురంగా.

'మీరు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా మీరు నన్ను ప్రేమిస్తున్నారని నాకు తెలుసు—నేను మీ కంటికి కనిపించటంవల్ల మీలో అశాంతిని రేపిన దాన్నవుతాను. చల్లని మీ సంసారంలో కలతలకు కారణభూతురాలినవుతాను—అందుకే కనిపించలేదు—మీరు తిట్టినందుకు కాదు—ఆ నిందకు కారణం నామీద ద్వేషంకాదని నాకు తెలుసు—నన్ను చూడగానే మీకు ఆపరాని ఆనందం కలిగింది. ఆ ఆనందాన్ని గుర్తించటానికి లజ్జ కలిగింది — ఆ లజ్జతో ఒక రకమైన చికాకు కలిగింది—ఆ చికాకు నామీద ప్రదర్శించారు—అంతే!'

'నేను నిన్ను అంతగా తిరస్కరించి మాట్లాడినా నీకు కోపం రాలేదా?'

ఆశ్చర్యంగా అడిగాడు రామచంద్ర.

'మీమీద కోపమా! కలలోకూడా రాదు—అయినా మీ మనసు నాకు తెలియకపోతేగా!—మీ పెదవులు నన్ను తిట్టినా మెచ్చుకున్నా, మీ మనసులో నా మీద మమత మాసిపోదుగా!'

చిరునవ్వు నవ్వాడు రామచంద్ర.

'ఏమిటా ధైర్యం నీకు ?'

'మీ వ్యక్తిత్వంలో నాకున్న విశ్వాసమే ఈ ధైర్యం — మీరు ఒకనాడు నన్ను నిజంగా ప్రేమించారు — తరువాత ఎంత ద్వేషం కలిగినా. ఆ ప్రేమను మింగెయ్యలేదు — ఈ సోదికేంలెండి — ఇంత రాత్రి వేళ షికారు బయలుదేరారేం?'

'వీరన్న పెళ్ళి జరిపించి వస్తున్నాను.'

'వీరన్న పెళ్ళి చేసుకున్నాడా? ఎంత మంచి వార్త? ఎవరిని?'

'రంగనాయకి అని ఒక కూలిమనిషిలే! ఇద్దరి మనసులూ కలిసాయి — సుఖంగా పెళ్ళిచేసుకున్నారు — అదృష్టవంతులు!'

'పెళ్ళికి నన్ను పిలవలేదు వీరన్న!'

'వాడికి తెలుసా, నువ్విక్కడున్నట్లు ?'

'ఏమో!, మీరు చెప్పలేదా?'

'ఉహుఁ! పిలిస్తే వచ్చేదానివా?'

'ఎందుకురానూ? పోనీయండి — అయిపోయిందిగా!'

'వీరన్న పెళ్ళిచూడాలని నిజంగా నీకుందా?'

'వీరన్న మీ కాత్మీయుడని నాకు తెలుసు — అందుకే అతనంటె నాకూ అభిమానం — నేను అభిమానించే వ్యక్తి సుఖంగా పెళ్ళిచేసుకొంటుంటే చూడాలని ఉండదా?'

దాబోయే నిట్టూర్పును అణచుకున్నాడు రామచంద్ర

'రండి — వడ్డిస్తాను.'

చాలా రోజులతర్వాత తిరిగి వారిజ వడ్డిస్తుండగా భోజనానికి కూర్చున్నాడు రామచంద్ర.

'ఆరోజు సగంలో వదిలి వెళ్ళిపోయాను కదూ!' బాధగా నవ్వుతూ అన్నాడు—

'మీ పుణ్యం ఉంటుంది — ఇవాళ మాత్రం అలా చెయ్యకండి—'

'చెయ్యమన్నా చెయ్యను—నా కెంత ఆకలిగా ఉందో నీకేం తెలుసు?'

'అన్నీ వట్టి కబుర్లు—నిజంగా ఆకలయితే తినండి మరి...'



'నిజంగానే ఆకలి వారిజా! తిండికోసం కాదు–ప్రేమ కోసం–స్వచ్ఛమయిన అనురాగం కోసం ఆకలితో దహించుకుపోతున్నాను–' మనసులో అనుకున్నాడు రామచంద్ర–

రామచంద్ర భోజనం ముగించి లేచాడు–

మళ్లీ పడక కుర్చీలో కూర్చోబోయాడు–వారిజ దగ్గిరగా వచ్చి మృదువుగా అంది–

'ఇప్పటికే పొద్దుబోయింది – ఇంక వెళ్లండి–'

'వెళ్తాలే!'

బద్ధకంగా అన్నాడు–

'అలా కాదు – లేవండి – అవతల మీ శ్రీమతి మీ కోసం కళ్లలో వత్తులేసుకుని చూస్తూ ఉంటుంది–'

'నీకెలా తెలుసు?'

'మిమ్మల్ని ప్రేమించేవాళ్లు మీకోసం ఎంత తహతహలాడ్తారో నాకుకాక ఇంకెవరికి తెలుస్తుంది?'

నోటి చివరకు రాబోయిన మాటల్ని ప్రయత్నం మీద వెనక్కు లాక్కుని లేచాడు రామచంద్ర–

'సరే! వెళ్తాను–'

వారిజ తన మెడలో ఉన్న సన్నని గొలుసు తీసింది – 'ఇది రంగనాయకికి ఇవ్వండి – వీరన్న వద్దంటే నేను ఊరుకోనని చెప్పండి–'

'ఎందుకు వారిజా ఇది?'

'ఇందాక చెప్పాను — మీ ఆత్మీయుడయినప్పుడే వీరన్న నాకూ కావలిసిన వాడయ్యాడని–ప్రస్తుతం నా దగ్గిరున్నది ఇదే! తీసికెళ్లి ఇవ్వండి–'

'ఇక్కడేం చేస్తున్నావు నువ్వు?'

'ఎంత సేపటికి అడిగారు? కొత్తగా పెట్టిన ప్రైమరీ స్కూల్లో టీచర్‌గా పని చేస్తున్నాను–'

'అంటే.... నువ్వు......'

'సినిమాల్లో నటించటం మానేసి చాలా రోజులయింది–' ఒక్కసారి వారిజ ముఖంలోకి చూసి ఇంకేమీ ప్రశ్నించకుండా గొలుసు అందుకుని చీకట్లోకి నడిచాడు రామచంద్ర–

(ఇంకా వుంది)




పూర్వకాలాల్లో నివసించి విశ్శేషమైన పులి ఇది. ప్రస్తుతం అమెరికాలో పులి జాతి లేదు. అయినా సుమారు లక్ష సంవత్సరాల క్రితం, ఈ నాటి పులుల్ని పోలిన జంతువు లుండేవి. అక్కడ దొరికిన ఎముకలవల్ల ఇది తెలుస్తోంది. వాటిరంగు ఎలా ఉండేదో చెప్పలేం. కాని పొట్టి, పొట్టిగా తోక, బలంగా కాళ్లు ఉండేవని మాత్రం గ్రహించగల్గుతున్నాం. అయితే అసలైన ప్రత్యేకత ఈ పులికి ఒకటి ఉంది. అది, పై దవడ కోరపళ్ల సైజు అవి విపరీతంగా ఎదిగాయి. కొన్నిటిలో సుమారు, 6–8 అంగుళాలు పొడవుతో వాడిగా ఉన్నాయి! అంత ఘోరమైన కోరల అవసరం ఏమయ్యుంటుందో!

దళసరి చర్మం జంతువులను వేటాడ్డానికి బహుశా అంత చాకుల్లాంటి దంతాల అవసరం వచ్చి ఉంటుంది. పాముకాటుకి కోరలుపయోగించి నట్టు, దాని వాడి పళ్లని ఉపయోగించి, చర్మాన్ని చీరిఉంటుంది. ఆ రోజుల్లో నివసించిన భూమిమీద స్లాత్‌లు, అప్పటినుండి ఇప్పటివరకూ ఉన్న గెనాకో అనే ఒంటెలాంటి జంతువుల్నీ, ఇది ఆహారంకోసం చంపేది.

—జమ్మి కోనేటిరావు

# పార్వతి

రాయప్రోలు శేషారత్నం




'పడుకున్నావేమి, కాంతం ?' అన్నారు మాతిదగ్గర కాళ్ళు కడుక్కోటానికి వచ్చిన రామనాథంగారు, బాదం చెట్టు క్రింద మలకమంచం మీద పడుకున్న భార్యను ఉద్దేశించి.

'అబ్బే, ఏమీ లేదు. పిల్ల పెళ్ళి బడలికవల్లనేమో నీరసంగా ఉంటేను, ఇప్పుడే పడుం వాల్చా' అని కాంతమ్మ లేచింది.

'లేస్తావెందుకు, పడుకో. ఇంక మనకి శ్రమపడి చేయవలసిన కార్యాలు లేవు. పిల్లవాడి పెళ్ళి అంటావా, దానికై మనము బెంగపెట్టుకొని కష్టపడ నక్కర లేదు' అని కూతుళ్ళకు పెళ్ళిళ్ళ చేసేసినందుకు సంబరపడిపోయాడు.

అప్పటికి రామనాథం గారి రెండవ అమ్మాయి జానకి పెళ్ళయి నెల రోజులయింది. రామనాథంగారికి ముగ్గురు కొడుకులు, ఇద్దరు కుమార్తెలు. స్కూలు మేష్టరు చేస్తున్న రామనాథం గారికి సంసారం మోయుట బరువుగానే ఉన్నది. ఉన్న పెంకుటిల్లు తప్ప వేరే ఆస్తి ఏమి లేదు. పెద్ద కుమార్తెకు, ఇద్దరు కొడుకులకు ఇదివరలోనే పెళ్ళిళ్ళు అయిపోయాయి. పెద్దమనిషి కాకుండా జానకికి కూడా పెళ్ళి చేయాలని పట్టుబట్టి, ఆమెకు పన్నెండవ సంవత్సరము పూర్తి కాకుండా పెళ్ళి చేసేశారు. ఈ పెళ్ళికి ఇల్లు తనఖా పెట్టి రెండు వేలు అప్పు చేయడమైనది. నోటి మంచితనంతో రోజులు వెళ్ళబుచ్చుతున్నారు. మూడవ కుమారుడు నారాయణ బి. ఎ. మొదటి సంవత్సరము చదువుతున్నాడు.

ఆ రాత్రి కాంతమ్మకు భోజనం సహించ లేదు. ఆ రోజే కాదు, ఆ మర్నాడు, మూడోనాడు కూడా అలాగే ఉంటే 'ఇదేమిటి, ఈ వయస్సులో ఇపుడు మళ్ళీ నాకు... తలచుకోటానికే భయంగా వుంది. పిల్లకు పన్నెండు ఏళ్ళు నిండుతాయి. కానుపు వెనుకపట్టిం దనుకున్నాను. కూతురు, కోడళ్ళు, పిల్లల తల్లులు అయ్యారు. వారితో సమానంగా మళ్ళీ నేను కూడానా ! భగవంతుడా ఏమిటి నాకు ఈ పరీక్ష. నేనెలా తలెత్తుకు తిరగను ? రెండవ ఆడపిల్లకి పెళ్ళి చేసి, పిల్లవాడి చదువుకూడా ఇంక రెండు సంవత్సరాలలో పూర్తవుతుందని సంబర పడినానే. ఇంక మూడు సంవత్సరాలలో ఆయన రిటైరు అవుతారు కూడాను' అనుకుంటూ ఇంక మీదట ఆలోచించలేక కుళ్ళి కుళ్ళి ఏడ్చింది.

వంట ఇంట్లో ఏడుపు విని రామనాథంగారు వచ్చారు. 'ఏమిటే, కాంతం, ఏమయింది ?' అంటూ కంగారు పడిపోయారు. భర్తతో తనకి కలిగిన అనుమానము చెప్పకోలేకపోయింది అలా అని మనస్సులో ఇముడ్చుకోలేక బావురుమంది ఎంతగా ప్రశ్నించినా అసలు సంగతి రామనాథం గారికి చెప్పలేక పోయింది. ఇదంతా తన అనుమానమే కావచ్చు, పిల్ల పెళ్ళితో తన ఆరోగ్యం డెబ్బ తిని ఉండవచ్చు, అనవసరంగా భయపడుతున్నానేమోనని తనకి తానే ధైర్యం తెచ్చుకొంది. 'అబ్బే, ఏమీ

లేదు, ఎంతకాలం పెంచినా ఆడపిల్లలు పరాయివాళ్లేను. ఆ అడ్డు కాస్తా తీరితే జానకినికూడా వాళ్ల అత్తవారు తీసుకు పోతారు. తలుచుకుంటే బాధ అనిపించింది' అని భర్తకి సమాధానం చెప్పింది. ఆ మాట రామనాథం గారికి నమ్మకం కలిగించకపోయినా, మరేమీ అడగలేక ఊరుకున్నారు.

జానకి సహాయంతో వంట యిల్లు సర్దుకువచ్చి పడుకున్న కాంతమ్మకు మనస్సులో బెంగగానే ఉంది. తిరిగి లేచి వెంకటేశ్వరస్వామివారి పటానికి దండం పెట్టుకుంది. 'నాకీ వయస్సులో ఇంక సంతానం వద్దు, తండ్రీ. ఇది అనారోగ్యానికి దారితీసినా, నా ప్రాణానికే ముప్పు తెచ్చినా కూడా సంతోషమే, భగవంతుడా' అని వాపోయింది.

మరి రెండు నెలలు గడిచేసరికి తను ఏ విషయంలో భయపడుతోందో, అదే జరిగిందని నిర్ధారణగా కాంతమ్మకు తెలిసిపోయింది. మనసులోని బెంగ ఎవరికీ చెప్పుకోలేక, ఆ వయస్సులో వచ్చినదాన్ని ఆనందంగా అనుభవించలేక సిగ్గుతో కృంగిపోయింది. క్రమంగా ఈ సంగతి రామనాథం గారికికూడా తెలిసింది. ఇంతకాలం భార్య అనారోగ్యంగా వున్న కారణం తెలుసుకొన్న మీదట చాల సిగ్గుపడి పోయారు. చేయవలసిన కార్యాలు అన్నీ అయినట్టే, ఇంక నడుం విరుచుకోవచ్చు అని అనుకున్న ఈ రోజులలో మళ్లీ పుట్టనున్న పసికందుని ఎప్పటికి పెంచి పెద్దచేయగలను అని బాధపడ్డారు. కాని మగవాడు కనుక అంతలోనే తేరుకొని 'మనకేమి లోటే, కాంతం, అన్నీ పనులూ అయిపోయినట్టేగదా. ఈ పుట్టే పసికందుని పెంచలేకపోతామా ఏమిటి? అబ్బాయిలు ఇద్దరు ఉద్యోగాలు చేస్తున్నారుగా, ఎవరయినా సహాయపడగలరు' అంటూ భార్యను ఓదార్చారు.

ఎవరు ఎన్ని చెప్పినా, కాంతమ్మ మనస్సులో బెంగ మాత్రం పోలేదు, ఆరోగ్యం బాగా దెబ్బతింది పురిటిరోజులు దగ్గరపడేసరికి మనిషి బాగా నీరసపడింది. పెద్ద కోడలూ, పెద్ద కూతురూ సహాయానికి వచ్చారు. వాళ్లకు పురుళ్లుపోసి, మనుమలతో కాలక్షేపం చేయవలసిన వయస్సులో తన పురిటికై వాళ్లు రావలసి వచ్చిందని కాంతమ్మ ఇంకా బాధపడసాగింది.

ఎవరు ఎన్నిరకాలుగా అనుకున్నా జరిగేది జరగక మానదు. ఏదయితే వద్దని గట్టిగా కోరుతామో అది జరిగితీరుతుంది. కావాలనుకున్నది జరిగినా, జరిగినట్లు అనిపించదు.

వండుకున్న అమ్మ తినక మానుతుందా, కడుపుతో ఉన్న అమ్మ కనక మానుతుందా అనినట్లు ఒకరోజు రాత్రి రెండు గంటలకు కాంతమ్మకు నొప్పులు ప్రారంభమయినాయి. కాంతమ్మ మూలుగులకు లేచిన కోడలు, కూతురు కంగారుపడి రామనాథంగారినీ, నారాయణనూ లేపారు. రామనాథంగారికి కాలూ, చెయ్యీ ఆడలేదు. 'అబ్బాయి, నారాయణా, సైకిలు మీద త్వరగా వెళ్లి రత్తాలుని పిలుచుకురారా' అని పెద్ద అమ్మాయి చెప్పింది. రత్తాలు అంతవరకూ వారి ఇంట పురుళ్లుపోస్తున్న ఎరకల మనిషి.

రత్తాలు గుమ్మంలోకి వచ్చేసరికే పురుడు వచ్చేసింది. 'ఆడపిల్ల'అని తెలియజేసి, పిల్లకి నీళ్లుపోసి ప్రక్క మార్చి కాంతమ్మని పడుకోబెట్టి, తన పని చూసుకుంది. 'అమ్మగారు బాగా నీరసంగా ఉన్నారు. తెల్లవారిన తర్వాత కాస్త కాఫీ ఇవ్వండి. నేను మళ్లీ రేపు వస్తాను. శాస్త్రుల్లగారి అమ్మాయి పురిటికి వచ్చింది. నిన్నటినుండీ నొప్పులు పడతా ఉంది. ఇదే తొల్చూలు గనుక ఆ మాత్రం అవస్త అవుతాది' అని సణుక్కుంటూ పోయింది.

కాంతమ్మకి అతి నిస్త్రాణగా ఉంది. అందరూ వచ్చి చంటిదాన్నీ, కాంతమ్మనూ పలకరించారు. కాని, ఆమె మాత్రం పెదవి విప్పి ఎవరినీ పలకరించలేదు. కంటితో చూసి నీరసంగా కళ్లుమూసుకునేది. అతి నీరసంగా ఉండి ఒళ్లంతా తిమ్మిరి ఎక్కుతున్నట్లు, మగతగానూ అనిపించింది. కాని నోరు విప్పి ఇలా ఉందని ఎవరికీ చెప్పలేకపోయింది. క్రమ క్రమంగా ఏదో మత్తుగా ఉండి ఇంట్లో వాళ్ల మాటలు కూడా చెవినిబడలేదు. కాఫీ కలిపి తీసుకు వచ్చిన పెద్దకూతురు 'అమ్మా, అమ్మా' అని ఎంత పిలిచినా పలకలేదు. ఆమె కంగారు పడి తండ్రిని పిలచింది. పురిటి గదిలోకి వెళ్లి తల్లిని ముట్టుకొని కుదిపింది. కాని మనిషిలో కదలికలేదు. కాళ్లూ, చేతులూ వేలబడినట్లు అనిపించింది. ఈ పరిస్థితి చూచిన రామనాథంగారు కంగారు పడిపోయారు. 'నారాయణా, డాక్టరు శర్మగారిని త్వరగా పిల్చుకురా' అన్నారు.

ఆ శర్మగారు వచ్చి చేసినదేమీలేదు. ఆమె చనిపోయిందని మాత్రం చెప్పవలసి వచ్చింది.

కాంతమ్మ ఏనాడో దేముడికి మొక్కుకున్న మొక్కు ఈ విధంగా తీరింది కాబోలు. కొడుకులు వచ్చారు, తల్లికి చెయ్యవలసిన కర్మకాండ జరిపారు. ఇంత బాధలో చంటిదానిని చూసే వారేలేరు. 'ఇది పుట్టి అమ్మని చంపింది' అని తిట్టిపోశారు. ఈ మాట రామనాథంగారి చెవిని బడినా, ఆయన ఏమీ అనలేకపోయారు. పెద్ద వయస్సు వచ్చి మీదపడుతోంది. బండి చక్రాలలో ఒకటి విరిగిపోయింది. ఈ చంటిదాన్ని ఎలాగ పెంచటమా అనే ఆయన బెంగ. 'నా ఎదురుగానే దాన్ని తిట్టిపోస్తున్నారు. పుట్టి ఇంకా మూడురోజులు కాలేదు. ఇపుడే ఇది అందరికీ బరువుగా ఉంది ముందురోజులు ఎలాగ వెడతాయి? కోడళ్లు, అమ్మాయి కూడా పిల్లల తల్లులే. ఈ నెత్తురు గుడ్డుని ఎలా పెంచను?' అని మథనపడ్డారు.

పదిరోజులు గడిచేసరికి రామనాథంగారు పది సంవత్సరాల వయస్సు పెరిగినంత శుష్కించిపోయారు. ఇంటినిండా పిల్లలు, మనుమలు, బంధువులూ ఉన్నా ఏమిటో శూన్యంగా ఉన్నట్లే తోచింది.

చంటిదాన్ని ఆవుపాలుపోసి పెంచుతున్నారు. ఒక నెల గడిచేసరికి ఎక్కడి వాళ్లు అక్కడ సర్దుకున్నారు. పెద్ద కొడుకు మాత్రం భార్యని, పిల్లలని అక్కడ వదలి వెళ్లాడు, తండ్రికి ఆసరాగా ఉంటారని. తనకు ఆదరించే అమ్మ కరువయిందని ఆ చంటిదానికే తెలిసింది కాబోలు, పడనికి తీరుబడి అయి పాలుపడితే త్రాగేది. లేకపోతే నోట్లో వేలు వేసుకునేది. క్రమంగా బోర్లాపడటం, ప్రాకడం, నడవ నేర్చింది.

పెద్ద కోడలు విశాలాక్షి ఇంటికి దిక్కయింది. పెద్ద కొడుకు నరసింహం

## పార్వతి

ఆ వూరికి బదిలీ చేయించుకొన్నాడు చంటి దాని ఏడుపు వింటే మాత్రం రామనాథం గారి గుండె తరుక్కుపోయేది. దాన్ని 'పార్వతి' అని పిలుచుకునేవారు. ఇంట్లో మిగతా అందరూ 'చంటి' అని పిలిచేవారు.

ఎవరైనా తెలిసినవారు రామనాథంగారిని 'అలాగ అయిపోతున్నారేమిటండీ' అని పలకరిస్తే, 'ఇంకా మా పార్వతిని పెంచి పెద్దచేసి ఒక అయ్యచేతిలో పెట్టాలి, అందుకే బ్రతుకుతున్నాను' అని కళ్ళు ఒత్తుకునేవారు. 'కాంతానికేమి, అదృష్టవంతురాలు. ఇంకా నేను ఉన్నాను' అని బాధపడేవారు.

కాలచక్రం మామూలుగా తిరిగిపోతోంది. ఒకరోజు రామనాథంగారు 'పెద్ద కోడలు బుద్ధిమంతురాలు. వాళ్ళిద్దరూ ఆదుకుని చూస్తున్నారు కనుకనే ఇంకా బ్రతికి ఉన్నాను. జానకిని అత్తవారింటికి పంపించాను. మూడవవాడు కూడా ఉద్యోగం చేస్తున్నాడు, వివాహమయింది. నేను రిటైరయి అప్పుడే రెండు ఏళ్ళు అయింది. పార్వతికి అయిదో సంవత్సరం. బడిలో వెయ్యాలి' నేను చెప్పే ట్యూషన్లతో నెలకు నలభయి రూపాయలు వస్తున్నాయి. జానకి పెళ్ళికిచేసిన అప్పు తీరలేదుగదా, తర్వాతవచ్చిన చిక్కులతో, ఖర్చులతో అప్పు ఇంకాపెరిగింది. నేనెంత, నా సంపాదన ఎంత? అందుకనేగా, ఒక్క పదిరూపాయలు మాత్రం ఖర్చుకు ఉంచుకొని మిగతాది కోడలికే ఇస్తున్నాను. ఈ విధంగాచూస్తే పార్వతి పెళ్ళికి ఏమి నిలవచేయగలను? మిగతా కొడుకులిద్దరినీ డబ్బు పంపమనటానికి నాకేమొహమాటంగా ఉంది. నాకన్న కూతురుబరువు నేను బ్రతికిఉండగా ఇంకొకరినెత్తిన పెట్టను. ప్రావిడెంటు ఫండు బాపతుది పద్దెనిమిదివందలు వచ్చింది. అది పార్వతిపేర బ్యాంకులోవేస్తాను. మరి ఇంటిమీద అప్పో? బేరంచూసి ఇల్లు అమ్మేస్తే, అది బహుశః అప్పుకి సరిపోవచ్చు. ఏదయినా, పెద్దవాడికి ఈసంగతులు చెప్పాలి' అని ఆలోచనచేసారు.

పెద్దకొడుకుతో సంప్రదిస్తే, అతను తండ్రి ఆలోచనని బలపరిచాడు. ఇంతగా మనస్సు విప్పి మాట్లాడుకొనుటవలన రామనాథంగారికి ఏదో పెద్ద బెంగతీరినట్లు అనిపించింది. ఆయన మనస్సు అంత విశ్రాంతిని సహించలేకపోయింది. హఠాత్తుగా గుండెల్లో నొప్పివచ్చి తట్టుకోలేకపోయారు.

పుట్టి తల్లినీ, పెరిగి తండ్రినీ పోగొట్టుకున్న పార్వతికి ఏ ఎండకి ఆ గొడుగుపట్టి రోజులు గడుపుకోవటం అయాచితంగా అలవాటయింది. పెద్ద అన్నయ్యే తండ్రి, పెద్ద వదినే తల్లిగా భావించేది. మిగతావారి దగ్గర చనువు తక్కువ. అక్కయ్యలయినా చుట్టపుచూపుగా వచ్చి వెళ్ళేవారేగాని ఎక్కువగా ఆపేక్ష చూపినదిలేదు — తల్లి, తండ్రి అంత త్వరగా పోవటానికి పార్వతే కారణమయినట్లుగా మాట్లాడేవారు. అందువలన పార్వతికి పెద్ద వదినే ప్రాణం. అన్నయ్య పిల్లలతో ఒకతెగా పెరిగింది. నెత్తురుగుడ్డుగా ఉన్నప్పటి నుండీ పెంచిన మమకారంతోనయితేనేమి, సహజంగా జాలిగుండె గలది గనుకనయితేనేమి, విశాలాక్షి పార్వతి అంటే చాల ఆపేక్షగా ఉండేది, చనువుగా విసుక్కునేది కూడా.

ఏవిధమయిన మార్పూలేకుండనే మరొక పది సంవత్సరాలు గడచిపోయాయి. పెద్దదయిన పార్వతికి ముందు పెండ్లిచేసి ఆవిదట తనకు కుమార్తెకు చేద్దామని, నరసింహం సంబంధాలు చూడటం మొదలు పెట్టాడు. ఎంతటి గడ్డుపరిస్థితులు వచ్చినా, తండ్రిదాచిన పద్దెనిమిదివందలూ వాడుకోలేదు. కాని అది కట్నానికయినా సరిపోదని త్వరలోనే తెలిసిపోయింది.

'మానాన్న అడిగిన రెండువేల అయిదు వందలూ ఆయనకు ఇచ్చి, అదిగాక నాకు ఒకవేయిరూపాయిలు కావాలి. నేను చదువుకునే రోజులలో డబ్బుచాలక స్నేహితుని వద్ద అప్పుచేశాను. అందుచేత మొత్తం మూడువేల అయిదువందలు ఇస్తే మాకేమీ అభ్యంతరంలేద'ని ఒక పెండ్లికొడుకు ఖచ్చితంగా తెలియజేశాడు.

వ్యవసాయమే వృత్తిగానున్న మరొక పెండ్లికొడుకు అధమం మూడువేలయినా ఉంటే పొలానికి రిపేర్లుచేయించి, సాగు చెయ్యాలని మనస్సులో అనుకొని, పైకి 'మూడువేలయినా కట్నం తీసుకోకపోతే

'చిన్నతనంగా ఉంటుందని' అన్నట్లు చెప్పాడు.

ఇంకొక పెండ్లికుమారుని తండ్రి 'అధమం నాలుగువేలయినా ఇచ్చేటట్లయితే వచ్చి పిల్లని చూసుకుంటాము. మాకు పిల్ల అందచందాలతో నిమిత్తంలేదు. కన్నుగ్రుడ్డి, కాలుకుంటి కాకుంటేచాలు' అని వ్రాశాడు. ఈవిధంగా ఒక ఏడాదిలో అయిదారు సంబంధాలు దాటిపోయాయి.

ఈ సంగతులన్నీ చూస్తున్న పార్వతి 'అమ్మ ప్రేమ ఏమిటో తెలియదు. కాని, వదిన ఆదరంమాత్రం ఎరుగుదును. నా కోసం అన్నయ్య ఎంత బెంగపడిపోతున్నాడో. వాళ్ల సంసారమూ, కష్టాలే కాకుండా నేను కూడా ఉన్నాను. మిగతా అన్నలుగాని, అక్కలుగాని నా గురించి ప్రేమతో ఒక్క మాట అయినా ఉత్తరంలో వ్రాయరు. పైగా, నాన్న దాచిన డబ్బు కట్నానికి సరిపోదని, మిగతా అన్నలను ఇద్దరిని చెరొక వెయ్యిరూపాయిలు సర్దమని పెద్ద అన్నయ్య వ్రాశాడట. దానికి సమాధానంగా వారు, మనము తూగలేని సంబంధం చూడటంకంటె, తక్కువ కట్నానికి ఏదో ఒక సంబంధం చూడమని వ్రాశారట. ఆ ఉత్తరం చూచి కొని పెద్ద అన్నయ్య, పాపము, ఎంత బాధపడ్డాడో ఆ రోజున వాళ్ల మన స్తత్వాలు అర్థముగాక. అంతా ఒక తల్లి

# పార్వతి

పిల్లలమే అయినా, మిగతావారికి పెద్ద అన్నయ్యకు ఎంత తేడాఉంది? ఏమైనా, నేను వీళ్ల ఋణం తీర్చుకోలేను' అని అనుకోసాగింది అప్పుడప్పుడే జ్ఞానం తెలుస్తున్న పార్వతి. అన్న, వదినెల ఆదరానికి సంతోషించకుండా ఉండలేకపోయింది. నాలుగవఫారంతో స్కూలు మాని, వదినెగారికి పనిపాటలలో సహాయపడేది. అన్నగారి పిల్లలకు బట్టలు కుట్టేది. తీరికవేళలలో ఇంటివద్దనే చదివి మెట్రిక్ పరీక్ష ప్యాసయింది.

ఆ రోజు సాయంత్రం వారి పౌరోహిత్య బ్రాహ్మణుడు అవధాన్లుగారు వచ్చి 'అమ్మాయి, పార్వతీ, వదినె నొకసారి పిలు అమ్మా' అన్నాడు ఎదురుగా కనబడిన పార్వతితో. 'వదినా, అవధాన్లుగారు వచ్చారు, నిన్ను పిలుస్తున్నారు' అని చెప్పి, వదినెగారు ముందరి అరుగు మీదకు రాగానే, పార్వతిలోని గదిలోకి వెళ్లిపోయింది.

అవధాన్లుగారు 'మరేమీలేదమ్మా, మన పార్వతికి భేషయిన సంబంధం తెచ్చాను. మంచి ఆస్తిపరుడు. కట్నం అక్కరలేదుట. కాని, నువ్వు కోపడనంటే ఒక్క మాట చెబుతాను. రెండో పెళ్లిసంబంధం. మొదటి భార్యకి నలుగురు పిల్లలు. కాని అతనికి ఏమంత పెద్ద వయస్సు కాదు: నలభైఏళ్లు ఉంటాయి' అంటూ చావు కబురు చల్లగా చెప్పమన్నట్లు ఒక్కసారే బయట పెట్టాడు.

ప్రక్క గదిలో నున్న పార్వతికి ఈ సంభాషణ వినబడింది. అంత కట్నం అక్కర లేకుండా చేసుకునే ఉదార పురుషుడు ఎవరా అని ఆశ్చర్యపోయింది. కాని వదినెగారు ఏ మంటుందో? పిల్లలున్నా, తన కంటె రెట్టింపు వయస్సు అయితే మాత్రమేమి? ఇంతకన్న ఈడుజోడు అయిన సంబంధం తెచ్చి చెయ్యాలని అన్నయ్యకు ఉండవచ్చునుగాని, ఎలాగ సాధ్యమవుతుంది? వాళ్లకే మొగపిల్లల చదువులు: ఆడపిల్లల చదువులు, ఆమీట ఆడపిల్లలకు కట్నాలు, ఎన్ని బాధలు లేవు గనక. ఇంతకాలం తనను ఎంతో ప్రేమతో పెంచారు, ఇకమీదట తను వారికి ఏ మాత్రం బరువు కాగూడదనుకొన్నది. అన్న, వదినె వారంతట వారు ఈ సంబంధానికి ఒప్పుకోలేకపోతే, తానే వారిని ఎలాగయినా అంగీకరింపచేయాలని నిశ్చయించింది. అరుగుమీద వదినెగారి మాట వినవస్తున్నది.

'ఎంత డబ్బు లేనివాళ్లమయినా, అంత మంది పిల్లలున్న రెండో పెళ్లి వాడికి ఇస్తామనుకున్నారా? తల్లీ, తండ్రిలేని పిల్లని చూచి ఈ మాట అనటానికి మీకు నోరేలావచ్చింది' అంటూ దులిపేస్తోంది విశాలాక్షి అవధాన్లుగారిని

'అందుకనే ముందరే చెప్పానమ్మా, కోపడవద్దని అతనికేమి, డబ్బులేదా? కాదా అంటె ఇల్లు దిద్దుకోటానికి ఆడదిక్కు ఎవరూ లేరు వంటమనిషిని పెట్టుకుంటె ఇల్లు గుల్లచేస్తుంది అని గాని, అతనికేమి తక్కువ? కో అంటే కొండమీద కోతి దిగివస్తుంది. అసలు కట్నంతో పిల్లని ఇస్తామని వస్తున్నారు. మనము అడిగితే కట్నం తీసుకోకుండా చేసుకుంటాడని నేను చెప్పాను, అంతేగాని' అంటూ సమర్థించాడు అవధాన్లుగారు.

ఇంతలో ఆఫీసునుండి నరసింహం వచ్చాడు. అవధాన్లు తిరిగి తన పురాణం మొదలు పెట్టాడు. సంగతి అంతా విన్న నరసింహం 'ఇంతకాలం పెంచి, దాన్ని



ఉండగా పెళ్లి పాడిక ఇచ్చి పెళ్లిచెయ్యనా? ఎంతగా దిగజారిపోయింది నా బ్రతుకు' అని బాధపడ్డాడు.

'పెద్ద బాబూ! నేను ఒక మాట చెబుతున్నాను, విను. పిల్లలుగలవాడన్న మాటేగాని, చూడటానికి అంత వయస్సు తేడా తెలియదు. సిరిసంపదలకు లోటు లేదు. ఆ పిల్లలంటావా, అయిన వారి ఆదరణకు మొహం వాచిఉన్నారు. మన అమ్మాయివారింట మహాలక్ష్మిలాగఉంటుంది నీ శక్తి అంతా ధారపోసినా ఇటువంటి సంబంధం తేలేవు' అంటూ అంగీకారం కుదర్చాలని అవధాన్లుగారు తాపత్రయ పడ్డాడు.

'వీల్లేదండీ, ఇటువంటి పెళ్లి చేసే కన్న, పార్వతి మెట్రిక్ ప్యాసయింది గనుక దాని బ్రతుకు అది బ్రతకగలదు. నేను బ్రతికుండగా ఇటువంటి పెళ్లి చెయ్యను' అని ఆవేశంతో అన్నాడు నరసింహం.

గంపంత ఆశతో వచ్చిన అవధాన్ల మొహం వాడిపోయింది. ఎలాగయినా ఈ సంబంధం కుదిరిస్తే ఏదోకొంత ముట్టక పోతుందా అని ఆశపడ్డాడు.

అంతా వింటున్న పార్వతి అన్నయ్య అభిప్రాయంతో ఏకీభవించలేకపోయింది. 'అన్నాడే గాని, అన్నయ్య తనను ఉద్యోగము చేయ నీయడు. ఈ కట్నాలకు తట్టుకొని పెళ్లి కుదరదు. ఇప్పటికే, పాపం, వదినెను అందరూ తలోకవిధంగా ఆడిపోసుకుంటున్నారు. అడిగేవాళ్లులేరని ఆడబడుచుకు పెళ్లిచేయటం లేదంటున్నారు. నేను పెళ్లి అయి అత్తవారి ఇంటికి వెడితే ఇంటిలో చాకిరీచేసేందుకు ఎవరూ ఉండరనే కారణంతో నాపెళ్లికి వదినె గట్టిగా ప్రయత్నం చేయటంలేదని కొందరి దురభిప్రాయం. నానారకాలుగా వదినెను ఆడిపోసుకుంటారు' అని ఆలోచించుకొని, మనస్సు సమాధానపరచుకొని, దృఢనిశ్చయంతో గదిలోనుండి బయటకు వచ్చింది పార్వతి.

'నేనంతా విన్నాను అన్నయ్యా. నాకు ఈ సంబంధం ఇష్టమే. మీరు ఇంతగా ఆలోచించి బాధపడటం దేనికో నాకు అర్థంకావటములేదు. తల్లిలేని పిల్లలకు తల్లిగా ఉపయోగపడటంకన్న నాకు మంచి మార్గం ఏముంది? ఇంక ఆలోచించిక ఒప్పుకో అన్నయ్య. నేనేవిగా బాధపడటం లేదు. మనస్ఫూర్తిగా చెబుతున్నాను' అంది పార్వతి. ఈ మాటలతో అవధాన్లుగారికి సత్తువ వచ్చింది. ఎలాగయితే నేమి, విశాలాక్షి, నరసింహములును ఒప్పించాడు.

తర్వాత, లాంఛనముగా పెళ్లిచూపులు ఆ వెంటనే పెళ్లికూడ అయిపోయింది పార్వతి సిరిసంపదలను చూసి అక్కలు అసూయపడ్డారు. ఇంతకంటె మంచి సంబంధం దొరికి ఉండదని చెప్పారు.

కాపురానికి వెళ్లిన పార్వతి, తాను నలుగురు పిల్లలు పుట్టిన తర్వాత, ఇంక పిల్లలు కలుగకుండా ఆపరేషను చేయించుకొన్నట్లు భర్తచెప్పినపుడు బాధపడలేదు. ఆ మనస్సు ఎపుడో రాయి అయిపోయింది. ఆపిల్లలే తనపిల్లలని సరిపెట్టుకుంది. ●

# అమెరికాలో డేటింగ పద్ధతులు

వేమూరి ఉమ

ఎన్నోవిధాల అభివృద్ధి చెందిన అమెరికాలో పెళ్ళిళ్ళు ఎలాగ జరుగుతాయి, వధూవరులు ఒకరి నొకరు ఎలా ఎంచుకుంటారు అనే విషయాలు తెలిసి కోవాలనే కుతూహలంవుండడం సహజం. వివాహం పెద్దల నిర్ణయంపై జరగడం మన సాంప్రదాయం. కాని పాశ్చాత్యదేశాలలో పిల్లల పెళ్ళిళ్ళ విషయంలో పెద్దల యిష్టాయిష్టాలకన్నా పిల్లల అభిప్రాయాలకే ప్రాముఖ్యత ఎక్కువ తల్లిదండ్రులు కలుగజేసికోక పోవడంవల్ల తమకు నచ్చిన జీవితభాగస్వామిని వెతుక్కోవలసిన బాధ్యత పిల్లలదే! అందుచేతనే 'డేటింగు పద్ధతి ప్రవేశపెట్టబడింది కాని మనదేశంలో, మిడిమిడి జ్ఞానంతో పాశ్చాత్యానుకరణ చేసే'బాంబాయి వాలా'లు డేటింగు గూర్చి ప్రజలలో తప్పు అభిప్రాయం కలుగజేస్తున్నారు. డేటింగుయొక్క ముఖ్యోద్దేశాలు, గుట్టూమట్టూ తెలిసికొన్న వాడు, దానిమంచి చెడ్డలేవో ఎవరికి వారు నిశ్చయించు కొనే అవకాశం వుంటుంది. అదే యీ వ్యాసంయొక్క వుద్దేశం.

సూక్ష్మంగా చెప్పాలంటే, "డేటింగు"అనేది అబ్బాయిలూ, అమ్మాయిలూ తమ జీవిత భాగ స్వాముల నెన్నుకునేందుకు వుపయోగపడే ఒకసాంఘిక ఆచారం. బహుళంగా చెప్పాలంటే, శని, ఆదివారాలు సాయంకాలం వంటరిగా గడపనక్కరలేకుండా, కాల క్షేపానికి యిది ఒక సాధనం. ఒక పార్టీకిగాని, సినిమాకిగాని, డ్యాన్సుకిగాని తనతో రమ్మని అబ్బాయి అమ్మాయిని ఆహ్వానించడంతో డేటింగు ప్రారంభ మవుతుందని చెప్పవచ్చు. సాయంకాలం అమ్మాయి యింటికి వచ్చి, ఆమెను తనతో తీసికొనివెళ్ళి, తిరిగి క్షేమంగా ఇంటికి దిగబెట్టేవరకూ బాధ్యత, అయ్యే ఖర్చు, అంతా అబ్బాయిదే. అతనిదగ్గర దీనికంతకూ అవసరమైన డబ్బులేకపోయినప్పుడు, ఎవరి ఖర్చులు వారు భరిస్తూ వెళ్లే 'డేటింగు'ని "డచ్చిపద్ధతి" అంటారు. డేట్‌కి రమ్మని పిలిచినంత మాత్రాన అమ్మాయిలు ఒప్పుకోవాలనేమీలేదు ఇష్టంలేకపోతే ఆమె మర్యాదగానే తిరస్కరిస్తుంది డేట్‌కి ఒప్పుకున్నంత మాత్రాన పెళ్ళిచేసికోవాలన్న నిబంధన అంతకన్నా లేదు

డేటింగు చేసే పిల్లలందరికీ అందంతోపాటు చొరవ, గడుసుతనం, చాకచక్యం ముఖ్యంగా వుండాలి. ఇలాటి వారే తగిన 'డేటు'ని సంపాదించ గలుగుతారు. ( అమ్మాయి అబ్బాయినీ, అబ్బాయి అమ్మాయినీ, ఒకరినొకరు 'వీరు నాడేట్'అని చెప్పు కుంటారు. ) సిగ్గు, జంకు, భయం వున్న పిల్లలకి తగిన డేటు దొరకడం చాల కష్టం. చొరవలేని వారు కొంతమంది జీవితాంతం బ్రహ్మచారులుగా వుండిపోడం జరుగుతుంది. కాని యిది చాల అరుదు. డేటుకి రమ్మని పిలిచే ధైర్యంలేని యువతీయువకు లకు "బ్లైండు డేటింగు"అనే పద్ధతి ఎంతో సహాయపడుతుంది. అంటే పెద్దవాళ్లో, స్నేహితులో పిల్లలిద్దరూ కలుసుకునేటట్టు చేస్తారన్న మాట. ముందునుండీ ఒకరినొకరికి తెలియదు కనుక దీన్ని "బ్లైండు" ( గుడ్డి ) డేటింగు అన్నారు.

ముక్కూ, మొహం తెలియని పిల్లని డేటుకి రమ్మని అడగడం ఎలా? కష్టంకాదా? అని అను మానం రావచ్చు. ఈ సమాజంలో వున్న ఎన్నో ఆచారాలు, అలవాట్లు పిల్లలు ఒకరినొకరు కలిసికొని పరిచయంచేసి కొవేందుకు దోహదం చేస్తాయి.



'పెద్ద వాళ్ళు మన పెళ్ళిళ్ళు కుదిర్చిపెట్టరు, మన భార్యాభర్తలని మనమే వెతుక్కోవాలి' అనే జ్ఞానం వచ్చే సరికల్లా, పెళ్లికావాలనుకున్న యువతీయువకు లంతా రంగంలోకి దిగుతారు. ఇక్కడ ఎక్కువమంది అమ్మాయిలకి చదువుకోవాలి, పేరు సంపాదించాలి అన్న కోరికకంటే, తగిన అబ్బాయిని చూసికొని, పెళ్ళిచేసికొని, సంసారం చెయ్యాలన్న ధ్యాసే ఎక్కువ అందుచేతనే పదమూడు, పద్నాలుగు ఏళ్ళ వయస్సప్పుడు, డేటింగు మొదలు పెట్టి, యిరవై ఏళ్ళ లోపునే చాలమంది పెళ్లి చేసేసుకుంటూరు. సరియైన క్రమశిక్షణలేని పిల్లలు చిన్నవయస్సులో తప్పటడుగులువేసి, జీవితాంతం బాధపడడమో, ఆత్మహత్యలు చేసికోడమో జరుగుతూ వుంటుంది. కాని అమెరికాలో సంఘ సంస్కరణ కేంద్రాలు చాల వుండడంచేత, పట్టణ వాతావరణం ఎక్కువగా వుండడం చేతా, యిలాటివి బయటకు పొక్కవు. పొరపాటు చేసిన పిల్లల జీవితం సర్వనాశనమై పోకుండా కాపాడడానికి ప్రయత్నిస్తాను.

తెలిసీ తెలియనీ యీ వయస్సులో పిల్లలు ఏ అఘాయిత్యం చేస్తారోనని తల్లిదండ్రులు అనుక్షణం భయపడుతూ వుంటారు. మరి చెయ్యగలిగేదేమీ లేక తల్లిదండ్రులు పిల్లలకి పూర్తి స్వాతంత్ర్యం యిచ్చేసి, బాధ్యతఅంతా మీదేనని చెప్పేసి భగవంతుడి మీద భారం వేస్తూ వుంటారు. అంతే కాకుండా, సెక్సు విజ్ఞానం బాగా తెలిసివుంటే ఎవరి మంచిచెడ్డలు వారే నిర్ణయించుకుందుకు వీలవుతుందని, పిల్లలకి హైస్కూలు లోనే యీ విషయాలన్నీ పాఠ్యముఖంగా చెప్పేస్తున్నారు. కొన్ని చోట్ల. ఇంట్లోకూడా చాలామంది తల్లిదండ్రులు సెక్సుకి సంబంధించిన విషయాలు నిర్భయంగా మాట్లాడేసుకుంటూ వుంటే, సెక్సు అంటేవున్న కుతూహలం తగ్గి, పిల్లలు చెడుమార్గాలు పట్టకుండా వుంటారేమోనన్న భ్రమతో కొంతమంది అది కూడా ప్రయత్నించి చూస్తున్నారు.

అలాగని పిల్లలు డేటింగు చెయ్యడం పెద్దవాళ్ళ కిష్టం లేదనుకోడానికి వీల్లేదు డేటింగుకి తల్లిదండ్రుల ప్రోత్సాహం ఎంతో వుంటుంది చర్చిలోనూ, స్కూలులోను ఆడపిల్లలు, మగపిల్లలూ కలుసుకునేందుకు(పెద్దల పర్యవేక్షణలో!) డ్యాన్సులు, పార్టీలు ఏర్పాటు చేస్తూవుంటారు ( వీరి 'చర్చి' ఒక్క దేవాలయం మాత్రమేకాదు సాంఘిక కార్యక్రమాలకొక కేంద్రం కూడా!) చర్చిలో యీకార్యక్రమాలు స్వమత వివాహాలు జరగడానికి తోడ్పడతాయి.

స్కూలుఫైనలు వరకూ మాత్రమే చదివి, పెళ్ళి చేసేసుకొనే పిల్లలు చాలమంది వున్నా, రాసురాను కళాశాలల్లోను, విశ్వవిద్యాలయాల్లోనూ చదవడానికి ఆడపిల్లలు తాపత్రయ పడుతున్నారు. ఈ తాపత్రయం పెద్ద చదువులు చదవడానికే మాత్రం గాదు. భర్తల వేటకోసం. హైస్కూలు రోజులలోనే పెళ్ళిళ్ళు చేసేసుకుంటే, పెద్ద చదువులు చదువుకున్న మొగపిల్లల పరిచయం లభించదని కాలేజీల్లో చేరుతారు.

ఇంజనీరింగు వంటి సాంకేతిక కళాశాలల్లో ఆడపిల్లలు తక్కువగనుక, ఆ విద్యార్థులకు ఆడపిల్లలతో పరిచయమయ్యే అవకాశం కూడా తక్కువే. ఇటువంటి పరిస్థితులలో వారు ఏమి చేస్తారంటే 'మిక్సర్" అనే డ్యాన్సు ఏర్పాటుచేసి, చుట్టుప్రక్కల హైస్కూలు అమ్మాయిలని ఆహ్వానిస్తారు. ఇంకొంచెం వుషారుగా వుండడానికి "కంప్యూటరు డేటింగు" అనే క్రొత్త పద్ధతి సృష్టించి డేటింగుని ఒక శాస్త్రంగా మార్చేశారు. ఈ కంప్యూటరు డేటింగులో అబ్బాయిలకీ, అమ్మాయిలకీ ముందుగా ఒక ప్రశ్నావళి( Questionaire ) అందజేస్తారు. పిల్లలిచ్చే సమాధానాలనిబట్టి, వారి అభిరుచులని గ్రహించి, కంప్యూటరు నుపయోగించి ఏ అబ్బాయికీ ఏ అమ్మాయి సరిపోతుందో నిశ్చయిస్తారు. మిక్సరు నాడు, కంప్యూటరు చెప్పిన అమ్మాయితోను,అబ్బాయితోనూ పరిచయం చేసికోడానికి అవకాశం లభిస్తుంది. ఇది యిప్పుడొక పెద్ద వ్యాపారంగా కూడా మారిపోయింది ఒక్క లాసేంజిలిస్‌లో కంప్యూటరు డేటింగు కంపెనీలు నాలుగైదు వున్నాయి.



## కంప్యూటర్ చెప్పిన అమ్మాయి?



డేటింగు ఒకరితోనో యిద్దరితోనో చెయ్యాలనే నియమమేమీలేదు. ఎంతమందితోనైనా చెయ్యవచ్చు. నలుగురైదుగురు పిల్లలతో డేట్ చేసేసరికల్లా, ప్రపంచం అంటే ఏమిటో, ఎన్నెన్ని రకాల మనుష్యులున్నారో అన్నీ బాగా తెలుస్తాయి. అప్పుడు తమ తమ ఆర్థిక, మానసిక పరిస్థితుల కనుకూలంగావున్న స్నేహితులనెన్నుకొని వారితో తరచు వెళుతూ వుంటారు. కొంచెం స్నేహం పెరిగిన తర్వాత తమ తల్లిదండ్రులకి ఒకరినొకరు చూపించడం పిల్లల కనీసధర్మం. అప్పుడు అమ్మాయి తల్లిదండ్రులు, పిల్లాడిని 'క్రాస్ ఎగ్జామినేషన్' చేసినంతపని చేస్తారు తల్లిదండ్రులకే పిల్లవాడి సాంప్రదాయం, చదువు, మొదలగునవి నచ్చకపోతే, ఆ అబ్బాయిని మానేసి మరొకరిని చూసుకోమని నచ్చచెప్పి చూస్తారు. పిల్లససేమిరా అంటే చేసేదేమీలేదు

సాధారణంగా ఒకటి, రెండుసార్లు డేటు చెయ్యడానికి మత సంబంధమైన పట్టింపులు అంతగా వుండవు కాని స్నేహం ముదిరేలోగా మతం, వగయిరాలు సరిపోతాయా, లేదా అని చూసుకుంటారు. అమెరికాలో పెళ్ళిళ్ళ విషయంలో ప్రేమేముఖ్యం, మతవిబేధాలూ, ఆర్థిక అంతస్థులు అడ్డురావన్నది పూర్తిగా నిజం గాదు పెళ్ళికొరకు జరిగే డేటింగులో కూడా యీ అభ్యంతరాలు కనబడతాయి. ఒకే మతం అయినా, ఒకరు తెలుపు మరొకరు నలుపు వారు ( నీగ్రోలు, మెక్సికన్లు, మొ ) అయితే స్నేహం స్నేహంలాగే వుండిపోతుంది. ఇదే కారణంవల్ల సాధారణంగా మన భారతీయ విద్యార్థులకి దొరికే పిల్లలు కూడా అంతంత మాత్రం వారే! ఈ అభ్యంతరాలు పట్టణాలలోకంటే పల్లెలలో బాగా ఎక్కువ.

అన్ని విషయాలూ అనుకూలంగా కుదిరినప్పుడు పిల్లలిద్దరూ 'స్టెడీ' ( అంటే నిదానం )గా వెళ్ళడానికి నిశ్చయించుకుంటారు. అంటే వారిద్దరు యింకెవరితోనూ డేట్ చెయ్యడానికి ఒప్పుకోరన్న మాట. ఈ ఘట్టంలోనే ఒకరినొకరు బాగా అర్థం చేసికొందుకు అవకాశం లభిస్తుంది. యిద్దరూ ఒకరికొకరు యిష్టమైతే అబ్బాయే అమ్మాయిని "పెళ్ళి చేసికొంటావా?" అని అడగాలి. ఇలా అడగడాన్ని "ప్రపోజు" చెయ్యడం అంటారు. ఇది చాల వుద్రేక పూరితమైన ఘట్టం. పిల్ల ఒప్పుకుంటే, పిల్ల చేతికి ఏదో ఒక రాయిపొదిగిన ( రూలు ప్రకారం వజ్రం ) వుంగరం తొడుగుతాడు దీన్నే 'ఎంగేజిమెంటు' వుంగరం అంటారు. అందుకనే ఏదైనా డ్యాన్సులో యిటువంటి వుంగరం వేలికున్న పిల్లకనిపిస్తే, అటువంటి పిల్లని అడగడం దండగకూడా! ఎంగేజిమెంటు తర్వాతపిల్లమనసు మార్చుకుంటే, వుంగరం తిరిగి అబ్బాయికి యిచ్చెయ్యాలి. డేటింగు, స్టెడీ, ఎంగేజిమెంటు, పెళ్ళి, అన్నీ రెండుమూడు నెలల్లో తెమిలిపోయే సందర్భాలూ వున్నాయి, రెండుమూడేళ్ళు సాగే సందర్భాలూ వున్నాయి.

ఈడేటింగు తరతరాల బట్టీ వస్తూవున్న ఒక పాశ్చాత్య ఆచారం. కాని ప్రస్తుతం యువతీ యువకులు "డేటింగు" అన్నది తమ కనువైన జీవిత భాగస్వామి నెన్నుకునేందుకు ఏర్పరచిన సాధనం అని విస్మరించి, ఆవేశంతో పెడత్రోవలు పడుతున్నారు. దీనికి ముఖ్యకారణం చిన్న వయస్సులోనే హద్దుమీరిన స్వాతంత్రం లభించడం ఒకటి, రెండవది ప్రతివారికీ మోటారు కారు అందుబాటులో వుండడం. పూర్వం పిల్లలని కనిబెట్టి వుండడానికి ఒక పెద్ద వ్యక్తిని ( షేపరూన్ ) తోడుయిచ్చి పంపేవారు. ఆ పద్ధతిని షేపరూన్ డేటింగు అనేవారు. ఇప్పుడు యిటువంటి పద్ధతులేమీ లేకపోవడంతో, పిల్లలు ఒంటరిగా కారులో వెళ్ళి, ఏ చీకట్లోనో ఆపి ఎన్నో దురంతాలు చేస్తున్నారు. ముఖ్యంగా "డ్రైవ్‌ఇన్" సినిమాలలో ( అంటే మన కారుని లోపలికి తీసికొనివెళ్ళి, కారులోంచే చూసే సినిమాలు ) యిది ఎక్కువగా కనబడుతుంది. కనుక యీనాడు జరిగే వివాహాలలో నూటికి తొంభయి పెళ్ళికూతుళ్ళు కన్యలు కారనీ, డేటింగులో వున్న స్వాతంత్రమే యీ స్థితికి కారణమనీ ఒక సోషియాలజీ ప్రొఫెసరు చెప్పేరు. ఈనాడు, యీ దేశంలో, వివాహానికి ముందే 'సెక్సు' అనుభవంలేని పిల్లలు చాల అరుదు. పిల్లలింటతటితో ఆగడంలేదు. పెళ్ళికాని పిల్లలందరికీ, కుటుంబ నియంత్రణ సాధనాలు యూనివర్శిటీ హాస్పిటల్‌లో ఉచితంగా సరఫరా చెయ్యాలని, విద్యార్థినీ విద్యార్థులు కోరుతున్నారని యీమధ్య లాసేంజిలీస్‌లోని కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో జరిపిన "సర్వే"తో తేలింది. ఒకరినొకరు అర్థం చేసికొని, వివాహం చేసికొనడానికి ఏర్పరచిన యీ డేటింగు పద్ధతులని దుర్వినియోగం చేసి, యిలా వెర్రివేషాలు వెయ్యడం చాల విచారించవలసిన విషయం. ●

### డాక్టర్ కబుర్లు

# గుండెల్లో చప్పుడు

3—7 ఏళ్ల చిన్న పిల్లల గుండెలలో సన్నగా శబ్దాలు వినిపించవచ్చు. ఇవి ప్రమాదకరమయినవి కావు. డాక్టరు స్టెతస్కోపు పెట్టివింటే ఇవి వినిపిస్తాయి. గుండెలోపల వాల్వులు సరిగ్గా తెరుచుకుని మూసుకొనక పోవటంతో ఈ ధ్వనులు వస్తాయి.

వీటిని 'నిరపాయకర'మయిన, 'ప్రయోజనకర'మయిన ధ్వనులనీ అంటారు. శిశువు ఎదిగిన కొద్దీ ఇవి తగ్గిపోతాయి. గుండెజబ్బుకీ వీటికీ సంబంధంలేదు.

అయితే, కొందరు పిల్లల హృదయంలోని వాల్వులు చెడిపోవచ్చు. అప్పుడు ఆ పిల్లలకి ప్రయాస ఏదీ లేకుండా చూడాలి. డాక్టరు చేత చికిత్స చేయించాలి. అవసరమయితే శస్త్రచికిత్స కూడా చేయించాలి.



ఏది ఎలా ఉన్నా — డాక్టరు గనక ఈ హృదయంలోని ధ్వనులు నిరపాయకరమయినవని అంటే ఆయన మాట నమ్మండి!

హెచ్. ఎల్. హెర్షన్ సోన్
(కాపీ రయిటు)

సీరియల్

# హృదయం చిగిర్చింది

కె.రామలక్ష్మి

### జరిగిన కథ

రమ బావగారు ఆమెని కాలేజీ లేడీస్ హాస్టలులో చేర్చి వెళ్లిపోతాడు. వార్డెను సరళని పిలిచి రమని పరిచయం చేస్తుంది. సరళ చలాకీపిల్ల. రమతో బాగా స్నేహం ఏర్పరచుకుంటుంది. కొత్తగా వచ్చిన లెక్చరరు రామారావు రమపై మోజు చూపిస్తూ వుంటాడు. రమా, సరళా ఇద్దరూ ఆ విషయాన్ని గ్రహిస్తారు. రమతో రామారావును కలిపి కాలేజీ పిల్లలు అల్లరి చేయడం మొదలెడతారు. రామారావు సరళని రమ దగ్గరికి రాయబార మంపుతాడు. తల్లికి సుస్తీ చేసిందని విన్న రమ చూసిరావడానికి వెళ్తుంది.

## 3

'నీకు హాస్టలు భోజనం పడనట్టుంది బాగా చిక్కిపోయావు తెలుసా ?' అని అడిగింది రమకి అన్నం వడ్డిస్తూ.

'నీకూ ఇంటిపట్టున ఉండడం పడనట్టే ఉంది జానకీ, నువ్వూ చిక్కిపోయావు తెలుసా?'

నవ్వుతూ అంది రమ.

'మీ బావ అంత దివ్యంగా పెడుతున్నాడు భోజనం' అంటూ నవ్వేసింది జానకి.

భోజనం చేసివచ్చి తల్లి దగ్గర కూర్చుంది. దగ్గరలోనే తన బొమ్మలూ ఆటసామానులూ పడేసుకుని కూర్చుంది పాప. 'ఓ వారంరోజు లుండిపోవే రమా, నాకేమీ తోచడంలేదు' అంటున్న తల్లి మాట కాదనలేక 'అలాగేనమ్మా, ఈరోజే నా రూమ్మేటుకి ఉత్తరం వ్రాసిపడేస్తానులే' అంది రమ.

దీపాలు పెట్టేవేళ పల్లెటూరి వాతావరణం చాలా హాయిగా సాయంత్రంలాగే ప్రశాంతంగా ఉంటుంది. పొలాలకి పనికి వెళ్లినవారు తిరిగి వచ్చేసి స్నానాధికాలు ముగించుకుని కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటారు. పశువులుకూడా పాకల్లోకి చేరిపోతాయి. వంటా వార్పూ ముగించుకున్న ఆడవారు మగవారు భోజనాలకి వచ్చే దాకా కాస్సేపు కూర్చుంటారు. అన్ని గదుల్లో దీపాలు వెలిగించింది జానకి. పాపని ఒళ్లో కూర్చోపెట్టుకుని వేడివేడిగా అన్నం తినిపిస్తుంది రమ. మంచంమీద పడుకునే తన బెంగనంతా వ్యక్తం చేస్తూ అప్పుడప్పుడోమాట అంటుంది రమ తల్లి.

'ఈ పిల్ల దానిదేనా నా బెంగ? నే కన్ను మూస్తే దీని గతేమిటి?' అంటున్న ఆమెని వారిస్తూ,

'అంత అధైర్యంగా ఉంటావేంటత్తా? నీ కొక్కత్తెకేనా రమ బాధ్యత?' అన్నాడు సుందరం.

బాగా చీకటులు అలుముకున్నాయి. వాతావరణంలో నిశ్శబ్దత తాండవిస్తుంది. రమ వడిలోనే పాప నిద్రపోయింది. పాపని లోపల పడుకోపెట్టి వచ్చి రమ అరుగు మీద కూర్చుంది. మనస్సులో పరిపరి విధాల ఆలోచనలు పరుగులు తీస్తున్నాయి. సుందరం బావతో ఏవేవో చెప్పాలని మనస్సు ఆరాటపడుతూంది. కాని ఎక్కడ ప్రారంభించాలి? అన్న విషమప్రశ్న రమని మూగగా చేస్తూంది.

సుందరం కూడా వచ్చి అరుగుమీద రమ పక్కగా కూర్చున్నాడు. సిగరెట్టుతీసి వెలిగించి స్తంభానికి జేరపడ్డాడు. 'ఇప్పుడు చెప్పు' అంటూ.

రమ ఆశ్చర్యంగా అతనివైపు చూసింది.

'నేనేం చెప్తాననలేదే!' అంది నవ్వుతూ.

'నువ్వు వచ్చిన దగ్గరనుంచి చూస్తున్నాను. ఏదో చెప్పాలని ఆరాట పడుతున్నావు' అన్నాడు సుందరం.

'ఏం లేదు బావా' అంటూనే కాలేజీని గురించి తన స్నేహితురాలు సరళ గురించి మాట్లాడ్డం ప్రారంభించింది రమ.

'నా గదిలో నాతోపాటు సరళ లేకపోతే ఈపాటికి పిచ్చెత్తి పోదును బావా' అంది యదాలాపంగా.

'అంత పిచ్చెత్తించే మనస్తాపం నీకెందుకుంది రమా' సూటిగా అడిగాడు సుందరం.

బిత్తర పోయింది రమ. మాట తడబడింది.

'ఏంలేదు బావా, కాని...' నసిగింది.

'చెప్పు రమా, నీ మనస్సులో ఏదో ఉంది. అది నాలాంటి ఆత్మీయుడికికూడా చెప్పకపోతే ఎలా!' అడిగాడు.

'నీతో కాకుంటె ఇంకెవరితో చెప్పుకుంటాను బావా ?' అంటూ వినీవినబడని కంఠస్వరంతో తనలో తాను మాట్లాడుతున్నట్టు అంది రమ.

'చెప్పు రమా మనసువిప్పి చెప్పు. దానికి పరిష్కారం ఏమిటో అప్పుడు ఆలోచించవచ్చు.' అంటూ సిగరెట్టు వెలిగించి గోడకి చేరబడి కూర్చున్నాడు సుందరం.

'కాలేజీలో అంతా బాగానే ఉంది బావా. ...కాని...నీ కెలా చెప్పాలో తెలియటం లేదు...' ముందుకెలా సాగాలో తెలియని సంధిగ్ధంలో పడింది రమ.

సుందరం మటుకు సిగరెట్టు పొగలు విడుస్తూ వినడానికి సిద్ధంగా కూర్చున్నాడు.

'లెక్చరరు మాస్టారున్నారు బావా. చాలా మంచివారు.. నేనంటె చాలా అభిమానిస్తున్నారు. మొదట్లో ఆయన ఊహేమిటో నాకు అర్థం కాలేదు. కాని ఇప్పుడిప్పుడే కొంచెం అర్థం అవుతోంది. మొన్న నొకరోజు సరళతో ఆయన తన హృదయంలోని మాట చెప్పారుట బావా, వారినోసారి నీదగ్గరకి తీసుకు రావాలని ఉంది.' ఊపిరి బిగపట్టి చెప్పేసి దీర్ఘంగా నిట్టూర్చింది రమ.

సుందరం ఏం మాట్లాడకుండా విన్నాడు. రమ ఇంకా మాట్లాడుతుందని గ్రహించాడు కాబోలు బదులేనా చెప్పకుండా ఊరుకున్నాడు.

'నామీద నాకు నమ్మకం తగ్గిపోతోంది బావా, ఏం చెయ్యాలో, ఏం చెప్పాలో తెలియడంలేదు. అసలు నా హృదయం ఏం కోరుతోంది? అన్నదే నిశ్చయంగా చెప్పలేక పోతున్నాను. ఏదో తెలియని ఆలోచనా ప్రవాహం నన్ను ఊపిరి తీసుకో

చెప్పడం లేదు' ఆగింది రమ.

అప్పటికి సుందరం బదులు చెప్పలేదు.

'నన్నేం చేయమంటావు ? ఇటు అందరి లాగా నేనూ సుఖం కోరుకోలేను. అటు పరిత్యాగం చేసినట్టు మోడువారి బ్రతకా లేను అనిపిస్తుంది. నా యీ బాధ అమ్మ కెలా చెప్పను ? అసలు అర్థం చేసుకుంటుందంటావా ? పోనీ చదువుకి స్వస్తి చెప్పివచ్చేసి ఇక్కడే ఇంట్లో ఉండిపోనా? నన్నేం చేయమంటావు? పాపమేం చేయమంటావు?' కొంచెం ఆవేశంగానే అంది రమ.

'అసలు నువ్వెవరు?' నీ స్థితి ఎలాంటిదన్న నిజం ఆయనకి తెలుసా?' కొత్త సిగరెట్టు పాతసిగరెట్టు ముక్కతో అంటించుకుంటూ అడిగాడు సుందరం.

ఓ క్షణం నిశ్శబ్దంగా ఉండిపోయింది రమ.

'తెలియదు బావా నే చెప్పలేదు. చెప్పే అవకాశం రాలేదు. అసలీసంగతి తెలిస్తే ఆయనే వెనకడుగువేస్తే నా గమ్యం ఏమిటి? ఒకసారి తీయని తలపులు తలెత్తిన నా హృదయంలో ఇకపై విశ్రాంతి చిక్కుతుందంటావా. చెప్తే ఏమవుతుందోనని భయంగా ఉంది' అంది రమ.

'ఇంత అవివేకం అయితే ఎలా రమా ? అసలు సంగతులు మభ్యపెట్టి ఆయనని ప్రలోభ పెట్టినట్లు అవదా ? నిజం చెప్పకుండా ఆయనని ఆయన కిష్టమొచ్చినట్టు ఆలోచించుకో నీయడం తప్పు కాదా ? నువ్వు చెప్పి ఉండవలసింది' విషాదం ధ్వనిస్తూ అన్నాడు సుందరం.

'నా ఉద్దేశ్యాలేమిటో నాకే అంతుపట్ట నప్పుడు వారికి నేనేం చెప్పను? చెప్పినందువల్ల ప్రయోజనం ఏమిటి?...వితంతువు ప్రేమించడం ఏమిటని నలుగురూ నవ్వరా బావా?' అమాయికంగా అంది రమ.

సుందరం కళ్లలో నీరు సుళ్లు తిరిగింది.

'కావాలని వచ్చని వయస్సులో నువ్వు వితంతువ్వి కాలేదు రమా, దేవుడు చూడ లేక నువ్వీస్థితిలో వున్నావు. నలుగురూ ఏదో అనుకుంటారని ఎన్నాళ్లు బ్రతకగలం చెప్పు ? అలా అనే నలుగురూ మన మనశ్శాంతికిగాని, జీవిత గమ్యాన్ని చేరుకోడానికిగాని ద్రోహదం చేయరు! ఇంక వాళ్ల మాటలకు విలువేమిటి ? నీ ఉద్దేశ్యం ఏమిటో నిర్ణయించుకోముందు'.' అన్నాడు.

'నా జీవితంలో ఇటువంటి, విషమ స్థితిని ఎదుర్కోవలసి వస్తుందని ఎప్పుడూ 'ఊహించనుకూడా లేదు బావా' అంటూ నిట్టూర్చింది.

'ఇదేమంత విషమస్థితి కాదు రమా, నీలాంటి వయసులో ఉన్న అమ్మాయిలు



అందరూ ఎదుర్కొనేదే' అన్నాడు సుందరం.

'నేను అందరిలాంటిదాన్ని కాదు కదా?'

'అంతమాత్రంచేత ప్రకృతి తన తత్వం మార్చుకుంటుందా పిచ్చీ!' అనునయంగా అన్నాడు సుందరం.

'నన్నేం చేయమంటావు బావా? నేనెటూ తేల్చుకోలేక సతమతమై పోతున్నాను. అటు మేష్టారికి సూటిగా నిజం చెప్పగల ధైర్యం లేదు. ఇటు నా మనస్సుని కట్టడిచేసే ఆత్మశక్తి లేదు. నేనేం చెయ్యను?' హృదయం కదలించేలా అడిగింది రమ.

మానసికంగా ఆమె పడే యాతన సుందరం గ్రహించలేకపోలేదు. కాని ఈ విషయంలో ఏ రకం నిర్ణయం చేసుకున్నా అది రమ స్వంతంగా మనఃపూర్వకంగా చేసుకోవాలి.

'నువ్వేం తప్పటాలోచనలు చేయడం లేదు. అడ్డదారి తొక్కడంలేదు. నీ మనస్సుకి నచ్చిన వ్యక్తిని ప్రేమించాలా వద్దా అన్నది నువ్వే తేల్చుకోవాలి రమా, నీ మేష్టారుదీ నిజమైన, నిలకడైన ప్రేమ అయితే నీ గత జీవితప్రసక్తికి తావెందుకుంటుంది?'

రమ ఆలోచనలో పడింది.

'సమయం వచ్చినప్పుడు అన్ని వాటంతట అవే సర్దుకుంటాయి. రాబోయే పరిస్థితులను గురించి ఉట్టినే బుర్ర పాడు చేసుకోకు. నీకేం కావాలన్నది తేల్చుకో

# హృదయం చిగిర్చింది

చాలు' అన్నాడు సుందరం.

'తేల్చుకోలేకుండా ఉన్నాను బావా, జీవితం యిక వృత్తి ఉద్యోగాలలో వెళ్ళమారాలన్న దృష్టితో కదా ఎప్పుడో వదలిన చదువు తిరిగి ప్రారంభించాను?'

'అంతమాత్రతచేత ఇక దృక్పథం మార్చుకోకూడదని లేదుగా' అంటూ లేచి నిలబడ్డాడు సుందరం బద్ధకంగా ఒళ్ళు విరుచుకుని 'నే పోయి పడుకుంటాను. నువ్వు నీ స్నేహితురాలికి ఉత్తరం వ్రాసుకో' అని లోపలికి వెళ్ళిపోయాడు సుందరం.

రమ తన గదిలోకి వెళ్ళింది. దీపం కొంచెం పెద్దది చేసి కాగితం కలం తీసుకువచ్చి ముందుపెట్టుకుంది డియర్ సరూ, అంటూ లేఖ ప్రారంభించింది. ఎప్పుడూ ఎవరి ఎదుటా బయట పడని రమ బేలతనం అంతా ఒక్కుమ్మడిగా కాగితంమీద రూపం దాల్చుకుంది. 'నీకు తెలుసు నేను పడుతూన్న బాధ. నా గురించి నీకు తెలుసు. కాని అక్కడా అక్కడా తెలుసుగాని పూర్తిగా తెలియదు నీకు. నాన్నగారు ఎప్పుడూ ఇంటిపట్టున ఉండేవారు కాదు, మిలిటరీ ఉద్యోగంవల్ల. అమ్మ పల్లె వదిలి ఆయనతో కాపురానికి వెళ్ళలేదు. సెలవుమీద వస్తే నెలా రెండునెలలూ వచ్చి ఉంటూండేవారు నాన్నగారు. నాన్నగారిది చాలా చెలాకీ స్వభావం. అమ్మది చాలా సౌమ్యమైన ధోరణిగా తయారైంది. బహుశా అదే ధోరణి నాకూ అలవడింది కాబోలు. ఎలాగైనా పెద్దచదువులు చదివించి డాక్టరుని చేయాలని నాన్నగారి కోరిక. పదహారేళ్ళకి ఓ యింటిదాన్ని చేసి బాధ్యత వదలించుకోవాలని అమ్మ కోరిక. ఇంటిపట్టునే ఉండే అమ్మ ఆశయం నెరవేరక, అప్పుడూ అప్పుడూ వచ్చే నాన్నగారి కోరిక ఎలా తీరుతుంది? చుట్టాలబలగం అంతా అమ్మవైపు సంబంధాలు వెతకడం ప్రారంభించారు. దేనికీ నాన్నగారు పట్టించుకోలేదు. చివరికి పెళ్ళి రేపనగా వచ్చారు.

మిలటరీ ఆఫీసరుగారి కూతుర్ని.

పెళ్ళి ఎంత ఘనంగా జరగాలో అంత ఘనంగా జరిగింది. నా కప్పుడు పూర్తిగా పదిహేడు ఏళ్ళు కూడాలేవు. బంగారు జడతో సహా వంటినిండా నగలూ, కంటినిండా కలలూ తప్పించి నాకేం తెలియలేదు. నాన్నగారు మిలటరీకి వెళ్ళిపోయారు. నేను అత్తవారింటికి వెళ్ళిపోయాను. మగదిక్కుగా సుందరం బావ మిగిలాడు అమ్మకి. ఎందుకంటే వెళ్ళిన ఎనిమిది మాసాంకే నాన్నగారు పోయారు. అమ్మకిది గట్టిదెబ్బ. చాలా డీలాపడి పోయింది.

అత్తవారిల్లు నాకు చాలా గమ్మత్తుగా తోచింది. మా యింటి వాతావరణానికి ఇక్కడ తల్లకిందులు! అత్తయ్య మాట మీదనే ఇల్లు ఓ మరలాగా నడుస్తుందని కొద్ది రోజులలోనే గ్రహించాను. మా ఇంట్లో అమ్మది వింతధోరణి. నాన్నగారు అసలు పట్టించుకోకుండా తిరిగే వారు. మిలటరీకి వెళ్ళాక మరీ అంటీ ముట్టనట్టుగా తయారైనారు. నా పెళ్ళిలో ఆయనొక్కరే కంట తడిపెట్టారు. 'గొప్ప చదువు చెప్పించి నా తల్లినో డాక్టరుని చేసి చూడాలనుకున్నాను' అన్నారు దండం పెట్టాలని వంగిన నాతల నిమురుతూ. ఎందుకో తెలియలేదు. ఆయన గుండెల కంటుకుపోయి వెక్కివెక్కి ఏడ్చాను సరూ, పెళ్ళి అయిన రెండు నెలలకే నన్ను సారె చీరతో అమ్మ అత్తవారింట దింపింది. నాన్నగారిని మళ్ళీ చూడనేలేదు నేను. కాని ఆయన రూపం ఎప్పుడూ నా కళ్ళనిండా ఉండేది.

అత్తవారింట - నాకు కొడంత్రికం



# హృదయం చిగిర్చింది

అంటూ వేరే అవసరంలేక పోయింది. నా భర్త తీవ్రమైన గుండెజబ్బు మనిషి అని తెలిసినా నాకెందుకో భయం వెయ్యలేదు. ఏదో పెద్దవాళ్ళూ దిక్కులేనివాళ్ళే చచ్చిపోతారు అనుకునేదాన్ని. వారికి పత్యపు వంటలతో ఇతర సేవలతో కాలం వెళ్ళిపోయేది. కొడుక్కి జబ్బు అని చెప్పకుండా సంబంధం ఒప్పించారు. అందుకే ఓ సారి వచ్చిన నన్ను తిరిగి అమ్మగారింటికి వెళ్ళనివ్వలేదు. నా కారోజు బాగా జ్ఞాపకం. సుందరం బావని పంపించింది అమ్మ నన్ను తీసుకురమ్మని బావ యింటికి రాగానే మా అత్తగారు చిలిపి కజ్జా వేసుకున్నారు. ఇవివ్వలేదనీ, అవివ్వలేదనీ, గుండెలనిండా కుచ్చితమే అందుకే కన్నతండ్రి కన్ను మూశాడనీ ఏమేమో అన్నారు. బావ చాలా సౌమ్యంగా సమాధానాలు చెప్పాడు. అమ్మకి ఒంట్లో నలతగా ఉంది. పంపించమని అడిగాడు ఎందుకొచ్చిందో తెలియదు. అత్తగారికి పిచ్చికోపం వచ్చింది. 'తీసుకువెడితే ఒకేసారి తీసుకుపో' అంటూ ఏమేమిటో అరిచారు. బావ బిక్కపోయాడు. ఆవిడ అంటున్నమాటలకి అర్థాలు స్ఫురిస్తూన్నకొద్దీ నాకు మతిపోయింది. 'నువ్వు వెళ్ళిపో బావా,' అని అరిచాను. ఏడుస్తూ లోపలికి పోయాను. అంతే బావ వచ్చినవాడు వచ్చినట్టే వెళ్ళిపోయాడు. నేను కుళ్ళి కుళ్ళి ఏడ్చాను.

'మా ఇంట్లో మగకుర్రాళ్ళు లేరని చేరదీసి స్వంతకొడుకుని పెంచినట్టు పెంచింది అమ్మ' అని వినకపోయినా వారికి వివరంగా చెప్పాను.

ఆ రోజునుంచి ఆ యింటి వాతావరణంలో చాలా మార్పు వచ్చేసింది. మావారి ఆరోగ్యం దిగజారిపోయింది. నాకే తెలియని ఏవో మార్పులు నా శరీరంలో కనిపించి కంపించిపోయాను. 'ఒక్కసారి అమ్మదగ్గరకి వెడితే' అనిపించేది. కాని అడిగే ధైర్యంలేదు. రోజులు భారంగా సాగిపోతున్నాయి.

బావ వచ్చి వెళ్ళిన నెలలోగానే వారు హఠాత్తుగా కన్నుమూశారు. ప్రపంచం అంతా గిర్రున తిరిగిపోయినట్టయింది. కాళ్ళకింద భూమి లేనట్టయింది. ఎక్కడైతే తన జీవితం వెళ్ళమార్చాలని అనుకున్నానో ఆ చోటు లేకుండా పోయింది నాకు.

అంతా వచ్చారు. నాన్నగారి బాధ చూడకుండా తప్పించుకుపోయారు. లేకుంటే ఎంత దుఃఖించేవారో! కొందరి జీవితాలు క్షణాల్లో తారుమారయిపోతాయి సరూ, నాకంతే జరిగింది. అత్తవారింటికి వెళ్ళి బాధ్యతలు బరువులు మోసి వగ్గునైపోతాననుకున్నాను. స్త్రీగా జీవితం సార్థకం చేసుకుని కనుమూస్తాననుకున్నాను. కాని ఏం జరిగింది? నాకేమీ తెలియని అయోమయస్థితి ఎదురైంది. అమ్మ బావ బలవంతం చేశారు—పచ్చేయమని.

భగవంతుని చేష్టలు చాలా గమ్మత్తుగా ఉంటాయి సరళా! కష్టాలనుంచి కోలుకునే మనుషులని సరదాగా నెత్తిమీద ఒకటి చరుస్తాడు కాబోలు! లేవబోయిన మనుషులు తిరిగి నేలకొరుగుతారు.

అత్తవారింట పట్టుమని పద్దెనిమిది మాసాలుకూడా లేని నేను పసుపుకుంకుమలు పోగొట్టుకుని ఇల్లు చేరాను. నా అనే దిక్కులేని మాకు సుందరం బావ కొండంత అండగా నిలచాడు. నే యింటికి గర్భిణీగా తిరిగివచ్చాను. మాసాలు గడుస్తున్నకొద్దీ ప్రపంచపు పోకడ మోసం అని తెలియసాగింది. తక్షణం సుందరంబావ జానకిని పెళ్ళి చేసుకున్నాడు—లోకం నోరు మూయడానికి.

కాలం గడిచిపోయింది. ఆ రోజులు తలుచుకుంటే వాటిని దాటి ఎలా వచ్చానా అనిపిస్తుంది. పాప పుట్టి ఏడాది దాటే దాకా వీధిగడప దాటలేదు నేను. నాకా అవసరం కనిపించలేదు. కాని ఎన్నాళ్ళిలా అన్న ప్రశ్న, వామనమూర్తిలా పెరిగిపోతూ ఎప్పటి కప్పుడు నన్ను నిలవేస్తూనే ఉంది. ఎన్నాళ్ళిలా? అని ఎప్పుడూ నన్ను నేను ప్రశ్నించుకుంటూనే ఉండేదాన్ని. ఆ ప్రశ్నే ఓ రోజు సుందరం బావ అడిగాడు.

'పాపకి ఏడాది దాటిపోయింది. నేనూ జానకీ పెంచుతాం. నువ్వు ఏమైనాచేస్తే బాగుంటుందేమో?' అన్నాడు మాటల సందర్భంలో.

'ఏం చెయ్యమంటావు బావా? నేనేం చెయ్యకలను' అడిగాను.

'ఏదో ఒకటిచేసి జీవితంలో మనశ్శాంతి

నేనా సాధించుకోవాలిగా? ఎన్నాళ్ళిలా గడుపుతావు? అడిగాడు. అంతేకాదు,

'ఈసారి కాలేజీలు తెరిచే సమయానికి నిన్ను చేరుస్తాము' అని తన నిర్ణయాన్ని చెప్పాడు కూడా.

'నాకు మళ్ళీ చదువా ?' అన్నాను ఆశ్చర్యంగా.

'ఏం ఎందుకు చదువుకో కూడదు? చదువు సాగనీ. తరవాత ఏం చేయాలన్నదప్పుడు ఆలోచించుకోవచ్చు. ఏమంటావు?' అని అడిగాడు బావ.

నేనేమంటాను ? పూర్తిగా ఇరవైఏళ్ళైనా లేని నాకు ఓపాప. ముందు దారి చీకటి, వెనుక దారిలేదు. ఏంచేయాలి? చదువుకోవాలనే నిర్ణయించుకుని కాలేజీలో చేరాను. నీకు తెలుసుగా—నీలాంటి సహృదయంకల స్నేహితురాలు దొరకడం నా అదృష్టం సరళా, మనిద్దరిమధ్య పెరిగిన స్నేహంతో నాలో కొత్త ఉత్సాహం మొలకెత్తింది. జీవితం దీర్ఘనిశీధిలా గడిచిపోదన్న ధైర్యం పుంజుకుంది.

కాని ఏంలాభం ? నేనింతటి బలహీనురాలనా ? అని ప్రశ్నించుకునీ ప్రయోజనం లేదు: మేష్టారు తొలిరోజు వచ్చిననాడే నాలో నాకే తెలియకుండా అలజడి ప్రారంభం అయింది. నాకే తెలియకుండా నా హృదయం మేష్టారిని చూసి దడదడలాడింది. మేష్టారు ఎదురైతే నా కాళ్ళు తడబడ్డం ప్రారంభించాయి. ఇదే నీలాంటి కన్నెపిల్లకి తటస్థమైతే పురివిప్పిన నెమలిలా నాట్యం చేసేదానివి. కాని నేనేం చెయ్యను? పిరికిదానిలా భయపడి నీవెనక దాక్కుంటున్నాను. నా స్థితి జ్ఞాపకానికి వచ్చినప్పుడల్లా — ఈ కాలేజీ హాస్టలూ అన్నీవదిలి దూరంగా పారిపోవాలని ఉంటుంది. దీనికి పరిష్కారం లేదు సరళా, నేను చదువు మానేస్తాను. మాష్టారిని మరిచిపోతాను. జీవితం దానిష్టం వచ్చిన రూపు దిద్దుకుంటుంది—అదే సాగిపోతుంది. ఏమంటావు నాకుతెలుసు — ఈ పిరికి తనానికి స్వస్తి చెప్పు అంటావు. కాని ఎలాగ ? నా జీవిత చరిత్ర పుటలు విప్పి మాష్టారి కెలా చెప్పను?...విన్న ఆయన ముఖం ఎలా అయిపోతుందో ఊహించుకోలేనా?...నేనీవారం తరువాత వస్తాను. సరళా మన వార్డెనుకి చెప్పు. అమ్మ ఇప్పుడు

బాగానే ఉంది'. అంటూ ఉత్తరం ముగించింది సరళకి. హరికేన్ లాంతరులో వత్తి సరిగ్గా లేదుకాబోలు చిమ్నీకి ఓపక్క మసి పట్టింది. ఆ లాంతరుచూసి సన్నగా, విషాదంగా నవ్వుతూ తగ్గించింది రమ. నిద్రకు మళ్లింది–

రమ ఊరునుంచి తిరిగివచ్చింది. పరీక్షలుకూడా దగ్గిరకి వస్తున్నాయి సరళ అల్లరి చేసినంతసేపు చేసి చదవడానికి ఉపక్రమిస్తుంది కాని ఏంలాభం? క్లాసులో ఏ రోజునా పాఠాలు విన్న పాపాన పోలేదు. టెస్టులు రాసిన పాపాన పోలేదు. తోటి పిల్లల నోట్సులు తెచ్చుకుని కాపీ చేయడానికి ప్రయత్నిస్తోంది.

# హృదయం చిగిర్చింది

'రమా నువ్వు కొంచెం కాపీ చేసి పెట్టు గబగబ అయిపోతుంది' అని బతిమాలింది.

రమకో మంచి ఊహ తట్టింది.

'ఇప్పుడెందుకు కష్టపడి కాపీ చెయ్యడం? నాదాన్లోనే ఇద్దరం చదువుకుందాం. సెలవల్లో పట్టుకెళ్లి కాపీ చేద్దుగాని'అంది.

'బంగారుతల్లి! ఎంతమంచి బుర్రో' అని సంబరపడిపోయి ఎవరి నోట్సులు వారికిచ్చేసింది సరళ–కొద్దిరోజులు తోసినా తోయడమేనని.

సరళ తెలివైనపిల్లే–కాని శ్రద్ధ తక్కువ. పరీక్షలో తప్పినా అంతపట్టించుకునే రకంకాదు. రమ అలాకాదు. క్లాసులో వేరుధ్యాసలేని రమ నోట్సులు జాగ్రత్తగా రాస్తుంది. ప్రతిటెస్టు చదివి రాస్తుంది అందరి లెక్చరర్ల మన్ననలూ పొందుతుంది.

'ఈ తెలుగుపాఠాలు తెలిసి చావడంలేదు' అని విసుక్కుంటున్న సరళని చూసి నవ్వుతూ,

'క్లాసులో గోలచేసే బదులు వినిఉంటె అర్థం అయేవిగా?' అంది,

'విన్నేం చెప్పమనా చెప్తాంట. అసలే బుర్రపగిలి చస్తూంటె' అంది సరళ. దీనికేమిటి దారి అని ఆలోచించుకుని రమతో అంది.

'మేష్టారుని ట్యూషనుకి పెట్టుకుంటాను'

అదిరిపడింది రమ.

'ఎందుకు? గట్టిగా చదివితే అదే వస్తుంది' అంది.

'వస్తే గొడవేలేదు. రాదని తేలిపోయిందిగా! రేపే మేష్టారి నడుగుతాను.' అని తన నిర్ణయం చెప్పింది.

కాలేజీలోనే కాకుండా సాయంత్రం హాస్టలులో కూడా మేష్టారిని రోజూ చూడాలంటే రమకి భయం పట్టుకుంది. రమ ట్యూషను వద్దని పట్టుపట్టిన కొద్దీ సరళ పంతం ఎక్కువ అయింది.

'నీ సొమ్మేం పోయింది? నువ్వు కంఠతా పట్టేసి రాసేస్తావు. నాలా బుర్రలేని వాళ్లేం కావాలి?' అంటూ వీదర్పులు అరిచి రమని ఒప్పించింది. పరీక్షలకింకో ఇరవైరోజులు వ్యవధి వుండనగా మేష్టారు పాఠాలుచెప్పడానికి ఒప్పుకున్నారు.

పరీక్షలముందు కాలేజీ అమ్మాయిలలో ఒకరకం ఆవేశం ప్రవేశిస్తుంది. అన్నం తింటూ తల దువ్వుకుంటూ కూడా పుస్తకం వదలరు. సరళ స్థితి అలాగే ఉంది. టరమ్ అంతా సరదాగా గడిపేయడంతో స్నేహితుల దగ్గిర నోట్సులు సేకరించడం, ముఖ్యమైనవి రాసుకోవడానికే ఎక్కువ టైము పడుతోంది పాపం. ఇంగ్లీషు గ్రూపు ఎలాగో నెట్టుకు వచ్చినా తెలుగు అసలు కొరకరాని కొయ్య సరళకి. డబ్బున్నవాళ్ల పిల్లేమో పరీక్షల ముందు హాయిగా ఆ లెక్చరరునే ట్యూషనుకి పెట్టుకుంది. **(ఇంకా ఉంది)**






# మిఠాయిచిత్రం

కౌటిల్య

మల్లన్న మంత్రి రాజ్యానికి కొంత దూరంలో ఒక జమీందారు ఉన్నాడు. అతనికి చిత్రకళ అంటే చాలాయిష్టం. అందుచేత యెవరు చాలాసహజంగా ఉండేటట్లుగా చిత్రించగలరో వారికి పదివేలవరహాల్ని బహుమానం యిస్తానని ప్రకటించాడు జమీందారు.

జమీందారు ప్రకటించిన బహుమానం సంగతి విని చాలామంది చిత్రకారులు తాము చిత్రించిన చిత్రాలను తీసికొని, జమీందారువద్దకు వచ్చారు. జమీందారువద్ద సూరయ్యా అనే చిత్రకారుడు ఉన్నాడు. అతనికి మిగిలిన చిత్రకారులంటే అసూయ. అందుచేత చిత్రకారులు తీసకొని వచ్చిన చిత్రాలకు యేవో వంకలుపెట్టి, అవి సహజంగా లేవని ఆక్షేపించాడు.

సూరయ్యచేత ఆక్షేపించబడిన చిత్రకారులందరూ మల్లన్న మంత్రి వద్దకు వెళ్లారు. జరిగిన సంగతంతా మల్లన్న మంత్రితో చెప్పి, యెలాగైనా సూరయ్యకు తగినశాస్తి చేయాలని కోరారు చిత్రకారులు. సూరయ్య సంగతి తాను చూస్తానని మల్లన్న మంత్రి చిత్రకారులతో అన్నాడు.

మారువేషంలో మల్లన్నమంత్రి జమీందారువద్దకు వెళ్లాడు. జమీందారు సభలో మల్లన్నమంత్రి యిలాగ అన్నాడు.

'ప్రభూ! చాలాసహజంగా ఉన్న చిత్రానికి బహుమతి యిస్తామని మీరు ప్రకటించారు. నావద్ద ఒక చిత్రం ఉంది. అది సహజంగా ఉందో, లేదో మీరు యెలాగ నిర్ణయిస్తారు?'

'పటం సహజంగా ఉందో, లేదో ఆస్థాన చిత్రకారుడైన సూరయ్య నిర్ణయిస్తాడు' అని జమీందారు జవాబు యిచ్చాడు.

'ప్రభూ! సూరయ్యా సాటి చిత్రకారుడు. కాబట్టి నాచిత్రం బాగా లేదని అనవచ్చును. అందుచేత ఈర్ష్యాద్వేషాలకు అతీతములైన పశుపక్షికీటకాలే, చిత్రంలోని సహజత్వాన్ని నిర్ణయిస్తే బాగా ఉంటుంది' అని అన్నాడు మల్లన్నమంత్రి.

ఈ సూచన చాలాబాగుందని సభలోని వారందరూ అన్నారు. జమీందారుకూడా అందుకు అంగీకరించాడు. సూరయ్యకూడా అందుకు అంగీకరించక తప్పలేదు.



తరువాత మల్లన్నమంత్రి ఒక చిత్రాన్ని సభలోనికి తీసికొనివచ్చాడు. ఆ చిత్రంలో పళ్లెంనిండా మిఠాయి ఉండలు ఉన్నట్లు చిత్రించబడింది.

'దాని సహజత్వాన్ని పరీక్షించడం యెలాగ?' జమీందారు మల్లన్న మంత్రిని ప్రశ్నించాడు. కొన్ని చీమలను అక్కడకు తెప్పించవలసినదిగా మల్లన్న మంత్రి జమీందారును కోరాడు.

జమీందారు ఆజ్ఞప్రకారం భటులు చీమలను తీసికొనివచ్చి చిత్రానికి కొంత దూరంలో వదిలారు. వెంటనే ఆచీమలు చిత్రంవద్దకు పాకి మిఠాయిని చిత్రించిన ప్రాంతాన్నంతా ఆక్రమించుకొన్నాయి.

దానినిచూసి సభలోని వారందరూ చిత్రం అద్భుతంగా ఉందని ప్రశంసించారు. జమీందారుకూడా చిత్రం చాలా సహజంగా ఉందన్నాడు. సూరయ్య యేమీ మాట్లాడలేకపోయాడు.

అన్నమాట ప్రకారం జమీందారు మల్లన్న మంత్రికి పదివేలవరహాలను బహూకరించాడు. మల్లన్న మంత్రి సూరయ్యను తగినట్లుగా మందలించాడు. జమీందార్లు యిచ్చిన బహుమానాన్ని అక్కడ ఉన్న చిత్రకారులందరికీ పంచిపెట్టి, తనరాజ్యానికి వచ్చాడు మల్లన్నమంత్రి.

చిత్రానికి చీమలు పట్టడానికి కారణం యేమిటి? అని రాజు మల్లన్న మంత్రిని ప్రశ్నించాడు. అందుకు మల్లన్న మంత్రి యిలాగ జవాబు యిచ్చాడు.

ప్రభూ! మిఠాయిని చిత్రించడానికి వాడిన రంగులో తేనె కల్పించాను. అందుచేత మిఠాయి బొమ్మకు చీమలుపట్టాయి.

మల్లన్న మంత్రి యుక్తిని రాజు యెంతగానో మెచ్చుకొన్నాడు. ●




# కాకాసురుడు

## గురుద్యోగపర్వం

వేళపల్లి వెంకటలక్ష్మీనారాయణ...

### 3

గురుద్యోగి తనింటిముందు గదిలో కూర్చుని స్టెనోకి ఒక రిపోర్టు డిక్టేట్ చేస్తున్నాడు. మర్రోజు సోమవారం. ఆరోజేదో క్యాంపుకెళ్ళాలి... యింతలో గురుద్యోగింటిముందొక రిక్షా ఆగింది. దాంట్లోంచొక మనిషి చేతో మాటుకేసుతో సహా దిగాడు. రిక్షావాణ్ణి పంపించి యింట్లోకి జొరబడ్డాడు. యితగాడు గురుద్యోగికి దూరపుచుట్టం. కానీ చూట్టానికి దగ్గిర చుట్టంలా వుంటాడు. చూట్టానికెప్పుడూ వస్తాడు. పేరు ముక్తేశ్వర్రావు. ముక్తిమార్గాలంటే నమ్మకం లేదుగానీ విముక్తిమార్గాలు మాత్రం బోల్డు తెల్సు.

ఇతగాడికి పట్టువిడుపు తెల్సు. ఆ విద్య చిన్నప్పణ్ణించీ తెల్సు చిన్నప్పుడేది కావాల్సొచ్చినా 'ఏడుపు' అనే సాధనాన్ని పట్టుకువేవాడు పెద్దవాళ్ళొక్కొక్కప్పుడు అతిగా ఏడిస్తే అడిగింది పెట్టకుండా నాలుక్కొట్టేవాళ్ళు. అందుకని ఏడుపునంతగా పట్టుకోకుండా మోతాదు మించుతోందనగావే విడిచిపెట్టేవాడు. పెద్దయ్యాక్కూడా మనుషుల్ని పట్టుకోవడంలో 'పట్టు–విడుపు' ప్రదర్శించటం వేర్చుకున్నాడు. రైలు ప్రయాణాల్లో మొదలైన యీ 'పట్టూ–విడుపూ' సూత్రం అతగాడి జీవిత ప్రయాణంలో కూడా ఓ ఆదర్శసూత్రంగా నిలబడిపోయింది. రైళ్ళల్లో తిరగాల్సొచ్చినప్పుడు ప్లాట్‌ఫారంమీద కూర్చున్నంతసేపూ చుట్టూతా వున్న ప్రయాణీకుల్నందర్నీ పలకరించి అందరిచేత తన సామాన్లు కాపలా కాయించుకునేవాడు. ప్లాట్‌ఫారం స్నేహానికి ప్రాతిపదికగా 'రైళ్ళు–అవి ఆలశ్యముగవే వచ్చును' అన్న దానిమీద ప్రసంగించేవాడు. ఎప్పుడూ వివే జోకయినా చుట్టూతా వున్నవాళ్ళు కట్టకట్టుకుని కిలకిలా నవ్వేవాళ్ళు. ఆ నవ్వేటప్పుడు కొందరు మొహమాటం కోసం మొహం ఎర్రబడేటట్లు మాటిమాటికీ నవ్వేవాళ్ళు. ఇలా నవ్వినవాళ్ళని గట్టిగా పట్టుకువేవాడు. వాళ్ళు మొహమాటానికి పడి చచ్చేవాళ్ళని రూఢిచేసుకున్న తర్వాత వాళ్ళవా సామాన్ల దగ్గిర కాపలా పెట్టి యితగాడు ప్లాటుఫారాలన్నీ తిరిగేవాడు. ఆ మొహమాటస్తులెంతటివాళ్ళంటె యితగాడు ప్లాట్‌ఫారాల మీద తిరుగుతుంటె వాళ్ళకి కాఫీ తాగాలనిపించి పక్కనేవున్న స్టాల్‌దగ్గరికెళ్ళి తాగుతూండగా దూరానితగాడొస్తున్నట్టు కనిపిస్తే కాఫీ ఓ గుక్కలో తాగేసి బుద్ధిమంతుల్లాగా మాదిరొచ్చి సామానుల దగ్గిర కూర్చుంటారు. లేకపోతే అతగాడొచ్చి 'అయ్యో ... అట్టా సామానొదిలి వెళ్ళొచ్చునా? దొంగలుంటారు' అని ఓ వంద దొంగతనాల గురించి లెక్చెరిచ్చి మెల్లగా ముందలిస్తాడు. రైలొచ్చేంతవరకితగా

వీళ్ళ వాకట్టేసి 'సామాన్లు కావలా కాయించుకుని రైలొచ్చేముందు తన సామాన్లు పుచ్చుకుని జనంలో కల్సిపోయేవాడు. కల్సిపోతూ పోతూ, 'మీరెక్కే పెట్టెలో ఖాళీగావుంటె కొంచెం వచ్చి చెప్పండి' అనేవాడు. ఖాళీ గనక వుండేటట్లయితే మొహమాటస్తు లితగాడి మొహం వెతుక్కుంటూవచ్చి చెప్పేవాళ్ళు అట్లా కాకుండా యితగాడికి సీటుదొరికి మొహమాటస్తులకి దొరక్కపోతే యితగాడు వాళ్ళవేపే చూసేవాడుకాదు. విండో తలుపు మూసో, ఏవిడో సంచీవో పక్కన పెట్టుకునో, 'అబ్బే.. యిక్కడ సామాను దాచుకున్నాం ...... తలదాచుకునేందుకు చోట్లేదు. మీరు కూడా ఏం బాధపడ్తారు. ఆముందు పెట్టెల్లోకి వెళ్ళండి' అని వాళ్ళొంక చూడకుండా సేపర్తిసేవాడు. యిలా ఎక్కడికక్కడ మనుషుల్ని పట్టటంలోనూ విడిచిపెట్టటంలోనూ యితగాడికి చిన్నప్పట్నుంచి తర్ఫీదు దొరికింది వీళ్ళవంశంలోనే పట్టుకునే పట్టు బడుంది. యితగాడికో బాబాయుండేవాడు. అతగాడి చేతులెప్పుడూ రోజుకోవంద మందిని పట్టుకునేవి అలా ఓ వెయ్యి మందిని పట్టుకుని అతగాడు వాళ్ళ చిరునామాల్ని తీసుకుని పెద్ద పుస్తకం నిండా రాసుకుని జేబులో పెట్టుకునేవాడు. కొన్నివందల పెద్దతలకాయ లతగాడి జేబులో వుండేవాళ్ళు. ఒక చిన్న జాబురాస్తే ఎంతపనయినా చేసిపారేసి, వుత్తరం రాసిపారేసేవా రితగాడికి అట్టా డైరీ తీసుకుని వుత్తరం రాసి పన్లు చేయించుకుని పైకెక్కేశాడు. డైరీలో వున్నవాళ్ళందర్నీ ఏడాది కోసారి పలకరించి మర్చిపోవద్దని చెప్పేవాడు. ఆ రెండు సార్లలో మొదటి సంవత్సరం మొదట్లో లిఖితపూర్వకంగా జరిగేది. 'నూతనసంవత్సర శుభాకాంక్ష' లని పంపేవాడు. తర్వాత ఏడాది చివర్లో తనకున్న శలవంతా ఒకసారి తీసుకుని జేబులో మిత్రుల్ని ముఖాముఖీ పలకరించేవాడు. కానీ అతగాడు మిత్రుల్ని పట్టటంనే నేర్చున్నాడు గానీ వాళ్ళని వదిలించుకోటం విదిలించుకోటం నేర్చుకోలేదు. 'పట్టు—విడుపు' అలవాటు అతగాడికి లేకపోవటంతో అతగాడు పైకెళ్తుంటె కిందున్న మిత్రులంతా అతగాణ్ణి పట్టుకుని పన్లు చేయించుకోవాలని చూసేవారు. దాంతో యీ పట్టుకునే పని అతగాడికి బాగా శ్రమతో కూడిందిగా పరిణమించింది. అభిమన్యుడికి పద్మవ్యూహం లోపలి కెళ్ళటంవేగాని రావటం తెలియనట్టు యితగాడికి పట్టుకోవటంవే కాని వదిలించుకోవటం తెలియలేదు. బాబాయి అనుభవాన్ని ఆసరాగా తీసుకుని ముక్తేశ్వర్రావ్ 'విడుపు' అనే సూత్రాన్ని కూడా జత చేసుకున్నాడు. మిత్రుల్నిట్టా పట్టుకుని వాళ్ళల్లో తనకన్నా కిందున్న వాళ్ళని వదిలించుకునేవాడు. వాళ్ళట్టా వదలకపోతే విదిలించుకునేవాడు. దాంతో అతగాడు పట్టుకున్న వాళ్ళంతా అతగాడి కుపయోగించే వాళ్ళే కానీ అతగాణ్ణుపయోగించుకునే వాళ్ళు లేరు. యిలా పైనున్నవాళ్ళనీ, పనికొచ్చే వాళ్ళనీ పట్టుకుంటూ తన దగ్గరకి పనికొచ్చేవాళ్ళని నెట్టుకుంటూ యితగాడు నిచ్చెనెక్కేశాడు. యితగాడికి హోదాలో వున్న వాళ్ళల్లో పనికిరాని వాడులేదు. యితగాడు పన్చేసేదో ప్రయివేటుకంపెనీలో. రైల్లో కంపెనీ ఖర్చులోనే ఫస్టుక్లాసులో తిరుగుతూ ఫస్టుక్లాసులో వున్న అందరి అడ్రసుల్నూ తీసుకుంటాడు. యిందులో ఆర్మీ ఆఫీసర్లు దగ్గర్నుంచి, కార్మికసంఘ కార్యదర్శులదాకా వుంటారు. 'థర్డు క్లాసులో ప్రజలెందుకు ప్రయాణాలేస్తారో అర్థంకాదు' అని ఓ కామెంటు పారేస్తే పక్కనున్న యింకో ఆయన తనాఫీసు కెళ్ళంగానే మొదటగాచేసే పని టి. ఎ బిల్ సబ్మిట్ చెయ్యటంవే కాబట్టి, అది పూర్తిచేసుకుంటున్నవాడల్లా తలెత్తి 'అవునండీ!...నాకీ ప్రపంచంలో అర్థంకాని విషయం అదొక్కటే' అని ఓ నవ్వు పారేసి ఆ బిల్లు బేగ్‌లో పారేస్తాడు. ఆ పక్కనే కూర్చున్న యింకో రైల్వే వుద్యోగి 'నాకీ థర్డుక్లాసులో ప్రయాణం చెయ్యటం అంటే పరమ అసహ్యం.. నేనెప్పుడూ ఫస్టుక్లాసులోనే చేస్తాను' అంటాడు. పరువుకోసం పట్టుబట్టి ఫస్టుక్లాసు టిక్కెట్టు కొనుక్కుని 'యింతెందుకు ఖర్చుపెట్టానా ?' అని మథనపడ్తున్న ఓ ప్రొఫెసరుగారు ఎంతెక్కువ ఖర్చుపెట్టాడో లెక్కేసుకునేందుకు రైల్వే గైడ్ చివరిపేజీల్చూస్తూ—

'అవునండీ...ఆ క్లాసులో ఎలా నిలబడి ప్రయాణం చేస్తారో తెలీదు...అయినా వాళ్ళ మాత్రం ఏం చేస్తార్లెండి. యీ రేట్లు చూడండి—యీ చివరి పేజీల్లో యిచ్చారు. కొన్నేళ్ళక్రితం బెంగుళూర్నుంచి ఫస్టుక్లాసు టిక్కెట్టు యిప్పుడున్న దాంట్లో మూడోంతు లుండేది. నానాటికీ రైళ్ళేమో ముసలమ్మల్లా నడుస్తుంటె రేట్లేమో మిస్సైల్సులా దూసుకుపోతున్నయ్ పైకి...' అంటూ నవ్వేశాడు. పక్కనున్న వాళ్ళంతా ఫెళఫెళా నవ్వారు. ముక్తేశ్వర్రావు మరీ మరీ నవ్వి—

'రైళ్ళ నడకమీద పరిహాత్త జోకేశారు, మీరు ప్రొఫెసర్‌గారే అయ్యుంటారు. అవునా ? లేకపోతే అందరికీ యీ హారిజివాల్టి వస్తుందా' అంటూ అతగాడడ్రసు తీసుకున్నాడు... యిలా ఓ గ్రూపుని చేర్చి వాళ్ళతో బాతాఖానీకొట్టి వాళ్ళ అడ్రసులు పట్టుకుని జేబులో పెట్టుకునేవాడు. యితగాడి తండ్రికూడా 'పట్టు—విడుపు' పట్టుబడింది. అతగాడికి చిన్నప్పట్నుంచే డబ్బు సంపాదించాలనే ధ్యాసుండేది. 'చదువుకోరా, పైకొస్తావ్' అని ఎవరైనా అంటే—

'ఫలానా వరహాలు చదువుకున్నాడా ? అయినా అతగాడు పైకొచ్చాడా లేదా ? ప్రస్తుతం మూడో అంతస్థులో కూర్చుంటున్నాడు. రేపొ నాలుగో అంతస్థు పూర్తవ్వంగానే పైకెళ్ళి దాంట్లో కూర్చుంటాడుగదా ... అతగాడి కింది భాగాల్లో యిద్దరు ముగ్గురు లెక్చరర్లు అద్దెకుంటున్నారు. వాళ్ళింకా కిందేఉంటున్నారు గదా ? మరి వరహాలేవో పైకొస్తూనే వున్నాడు గదా' అని చెప్పుకుపోయేవాడు. యితగాడు చెప్పేవన్నీ యిలాంటి వుదాహరణలే. రోజూ స్కూలు కెడ్తూ యిలాంటి మనుషుల్నే చూసేవాడు. కిళ్ళీకొట్టు పెట్టుకున్న రౌడీ రంగడి టెర్లిన్‌షర్టు దాని జేబులోంచి కనిపించే పదిరూపాయల నోట్లు, వాడి మెళ్ళో కనిపించే బంగారం గొలుసు ఎన్నోసార్లు చూసేవాడు. 'లోపలున్నదంతా పైకనిపించేట్టు టెర్లిన్ షర్టేసుకున్నాడు, యితగాడెంతపైకొచ్చాడో గందా' అనుకొని—

'రౌడీ రంగడుగారూ ! మీరేం చదువుకున్నారు' అనడిగే దొకసారి పిప్పరమెంటు బిళ్ళ కొనుక్కుంటూ, రౌడీ రంగడు

# గురుద్యోగ పర్వం

అర్నాగేశ్వర్రావులా భయపెట్టేట్టు నవ్వి—

'చదువేందిరా నవ్నాపీ... పైకొచ్చేచదువు బళ్లల్లో వున్న పంతుళ్లు సెబితే ఆళ్లట్టా ఎందుకుంటార్రా ఎర్రిమొగవా' అన్నాడు.

'వీడ్నంపతెగా వీడెంత పైకొచ్చేశాడు? లేకపోతే 'రౌడీ రంగడుగారూ' అనిపిలిస్తే యిన్ని తడవలు 'ఏరా' అని ఎలా పిలవగల్డు. బళ్లో మేష్టరు కూడా అన్నిసార్లన్నేడు. కాబట్టి వీడు మేష్టర్లకంటె పైకొచ్చేశాడన్న మాట' అని అనుకొని చదువుకీ పైకొస్తానికీ ఏం సంబంధం లేదు అని నిర్ణయించుకున్నాడు...

అతగాడందుకుని ధర్డుఫారం ఓసారి తప్పంగానే 'యిక్కడింకో ఏడాది కూర్చుని మళ్లీ వేస్టుచేసేబదులు యీ ఏడాదిలో నలుగుర్ని పట్టుకోవచ్చు. ఆ తర్వాత వాళ్ళదగ్గిర నోట్లు రాసి రూపాయినోట్లు పుచ్చుకోవచ్చు డబ్బు సామాన్యంగా చదువు రాని, చదువులేనివాళ్ల దగ్గరుంటోందిట. నాకు నోట్లు రాసే చదువొచ్చుగందా. అందుకని యిచ్చేవాడికీ, పుచ్చుకునే నాకూ తప్ప చూసేవాడెవరికీ తెలియకుండా నోట్లు రాసి డబ్బు తెచ్చుకుంటాను దానికీ చదువు చాలే' అని డబ్బున్నవాళ్ల చుట్టూ తిరిగి వాళ్లని పట్టుకోటం మొదలెట్టాడు. యితగాడికి చిన్నప్పణ్ణుంచీ డబ్బు తాపత్రయం ఎక్కువ. సంపాదించటం మానవధర్మం. చదువుకోకుండా సంపాదిస్తే యింకా గొప్ప. అదీగాక చదువుకుంటె సంపాదించటం జరగదు కూడాను. అందుకని మనం చదువుకోకుండా సంపాదించాలని ఆలోచించేవాడు. యితగాడి అమ్మా, నాన్న యితగాడికి అన్నప్రాసనచేసి యితగాడికి అన్నంరుచి చూపించి, అభిరుచి దేంట్లోవుందో చూస్తానికని ఎదురుగా పీటమీద పుస్తకాలన్నీ అమర్చారు. యితగాడి తండ్రికి చదువుపిచ్చి. కొడుకు లెక్కల్తీసుకు చదువుతాడా, యింజనీరింగు చదువుతాడా, బిజినెస్ మేనేజిమెంటు చదువుతాడా అని ఆ పుస్తకాలన్నీ తెచ్చి ఎదురుగా పెట్టాడు ముక్తేశ్వర్రావు తండ్రి, తల్లినొడిలో పడుకుని వాటొంక రెండుసార్లుచూసి మొహం చిట్లించాడు. పసివెధవ వాట్నసలు చూశ్లేదేమో నని వాటిమీద మోగించారు. ఆ మోతవిని అటువేపు తిరిగి నవ్వాడితగాడు. 'ఆ పుస్తకాల్లో ఏంవుంది వాటి న్నమ్ముకుంటె పైకొచ్చినట్టే' అని ఓనవ్వు నవ్వాడు

చివరి కిలాకాదని యితగాడి మేనమాం వొచ్చి యితగాణ్ణెత్తుకుని చేతుల్నిపట్టుకు లాగి ఆ పుస్తకాల్దగ్గరుంచాడు. మేనమాంవట్లా లాగుతుంటె యితగాడు గింగిల్లాడిపోయాడు.

'నన్నేం చక్కగా దర్జాగా బతకనివ్వరా? యీ చదువు లంటగట్టి నన్నొక సంపాదనలేని చవట వ్చేద్దాంవనుకున్నారా?' అని అరవలేక పోయాడు కానీ చేతులు యివతలికి లాక్కున్నాడు. పెద్దపెట్టున ఏడ్చాడు. తనంతట తను పుస్తకాలు ముట్టుకునేట్టు లేడని మేనమాంవ యితగాడి చేతులు పట్టుకుని కళ్లుమూసుకుని 'అక్కయ్యా ... మీరీ పుస్తకాలు అటూ యిటూ మార్చండి నేను కళ్ళుమూసుకుని వీడిచెయ్యి తాకిస్తాను. అప్పుడు తెలుస్తుంది' అన్నాడు. మేనమాంవ చంకలో వున్న యితగాడు విలవిల్లాడిపోయి అయ్యా, నాకేది దారి? నా చేతికి బలవంతంగా యీ చదువు నంటగట్టుతున్నారు. మొదటిగా ఏది ముట్టుకుంటే అదే జీవితాంతం ముట్టుకోవాల్సొస్తుందిట నాకేదిగతి' అనుకొని ఏడుస్తూ ఆలోచించటం మొదలెట్టాడు. అప్పుడితగాడికి కళ్లు మూసుకున్న మేనమాంవ జేబులోని పదిరూపాయల కాగితం కనిపించింది దాన్ని లాక్కుని గట్టిగా పట్టుకున్నాడు. . యిట్టా డబ్బుమీ దాపేక్ష పుట్టేటప్పణ్ణుంచే వుంచుకుని, దాన్ని పెంచుకుని నోట్లురాసి డబ్బు సంపాదించాడు. సంపాదనంతా పెళ్ళాంపేరరాసి ఓ రాత్రికాకుండా పగలు గుటుక్కున చచ్చిపోయాడు. అతగాడు 'డబ్బుకి పడిచస్తాడు' అనే వాళ్లందరూ. దాంట్లో నిజంవెంతో సరిగాతెలీదుగాని ఒక సంగతిమాత్రం నిజం. అతగాడు మేడమీంచిదూకి చచ్చాడు అదెట్టా జరిగిందంటె — ఎవడో మాటామాటా నచ్చ 'ఆ మేడమీంచి దూకితే అయిదొందలిస్తా నన్నాట్ట' యితగాడు 'అయితే యిటివ్వు' అని అవి తీసుకుని మేడెక్కి కిందకి దూకబోయి బోర్లాపడి చచ్చిపోయాడు. అప్పణ్ణుంచీ అతగాణ్ణి 'డబ్బుకిపడి చచ్చాడు' అనేవాళ్లు.

అలాంటి ఆస్తికి వారసుడిగా వచ్చిన ముక్తేశ్వర్రావ్ సంపాదన స్ట్రేటజీ కొంచెం మార్చాడు. సంపాదనే కాకుండా కొంచెం హోదా కూడా వుండాలనుకునేవాడు. చిన్నప్పుడు ముక్తేశ్వర్రావుతండ్రి ముక్తేశ్వ



[రావుని నోట్లురాసే వ్యాపారంలోకి దింపు దామనుకున్నాడు. అందుకని అన్నప్రాస నప్పుడు యితగాడిముందు తెల్ల కాగితాల మీద వంద, రెండొందలు, మూడొందలు... యిట్లా అంకెలు వేసివుంచాడు. కొడు కెంత పెద్ద నోట్లురాసి పెద్దవాడవు తాడో చూద్దామనుకున్నాడు, యివన్నీ ముక్తేశ్వర్రావు ముందుంచి–

'మా నాన్నవికాదూ.. యిందులో ఏదో వొకటి తీసుకో' అన్నాడు. యితగాడో నోట్లవంక చూసి – 'నాన్నా! ఏమిటి నీ వుద్దేశ్యం? ... యీ నోట్లు నేను ముట్టుకుంటె నువ్వురాసిన నోట్లు నేను తీర్చాలనా నీ వుద్దేశ్యం' అన్నాడు. యిత గాడికి మనుష్యుల్ని, ఎంత దగ్గరవాళ్ల నయినా నమ్మకూడదనే సద్బుద్ధి అప్ప ణ్ణుంచే వుంది. యిందాక గురుద్యోగింట్లో కొచ్చేటప్పుడుకూడా రిక్షావాడి దగ్గర చిల్లర తీసుకున్న తర్వాతనే రూపాయి కాగితం అతగాడ్చేతిలో పెట్టాడు... యీ మాటలువిన్న ముక్తేశ్వర్రావు తండ్రి–

'అదేం కాదురా చంటోడా! నువ్వెంత పెద్దనోట్లురాసి ఎంత తొందర్లో పైకొస్తావో చూట్టానికి అద్సరే... నోట్లు తీర్చటం అంటున్నావేమిటి? నేనే తీర్చదల్చుకోలేదు, నీకేం ఖర్మ తీర్చటానికి? 'నోట్లు తీర్చటం' అంటూ ఆలోచిస్తున్నావ్; నీక్కూడా ఆనోట్లు రాయించుకున్న వాళ్లలా పిచ్చేమన్నా పట్టిందా?... అదేంకాదు గానీ...మా అమ్మవికదూ ... ఏ దిట్లో ఏదోఒకటి తీసుకో' అన్నాడు.

ముక్తేశ్వర్రావు తండ్రొంక చూసి–

'నాన్నా! నీ మాటల్నమ్మను. యిందాక 'మా నాన్నవికదూ' అన్నావ్; యిప్పుడేమో 'మా అమ్మవికదూ' అంటున్నావ్. అప్పుడే ప్లేటు ఫిరాయించేశావ్. యిప్పుడు నేనా నోట్లు ముట్టుకుంటె తీర్చాలని అర్థం కాదు అంటున్నావ్; రేపు తీర్చమనచ్చు. అందుకని నేనవి ముట్టుకోను... అయినా నువ్వు నోట్లు తీర్చనంటున్నావ్ గందా ... పైగా ఆమాట నిజం అనికూడా అంటున్నావ్. సరే కాస్సేపు నిజం అనే అనుకుందాం. నువ్వు నోట్లు తీర్చకుండా రూపాయినోట్లన్నీ నా పేరేరాసి పోతావనుకుందాం ... కానీ నువ్వు నోట్లు తీర్చక పోతే నాచేత మళ్లీ నోటెవరు రాయించు




కుంటాడు? ... అందుకని నేను నోట్ల వ్యాపారం జోలికేపోను; యిప్పుడీ నోట్ల దాపుకీ పోను నే నింకోవ్యాపారం చేస్తాను' అంటూ ఆ మూలకి పాకెళ్లి, ఓ డైరీ, ఓ పెన్నూ పట్టుకొచ్చాడు.

'ఏంటే యీగాడనేది?...చదువుకుంటా నంటాడా ఏం ఖర్మ' అని తల బాదుకున్నాడు తండ్రి ముక్తేశ్వర్రావ్ నవ్వి – 'నేనంత తెలివి తక్కువాణ్ణి గాన్నాన్నా. తక్కువగా చదువుకుని ఎక్కువ సంపాదిస్తాను. ఎత్తునున్నవాళ్లని పట్టుకుని పైకెక్కుతాను. పైనున్నవాళ్ల అడ్రసు తీసుకుని డైరీలో రాసుకుని, డైరీతో బాటు వాళ్లనికూడా జేబులో పెట్టుకుని వాళ్ల నడ్డంపెట్టుకుని, వాళ్ల చేత నిచ్చెన్లు పట్టించుకుని నిచ్చెన్లెక్కేస్తాను' అని కిలకిలా నవ్వాడు ముక్తేశ్వర్రావ్. యితగాడి మాటల్లో తండ్రికి నమ్మకం కుదిరింది. డైరీ పుచ్చుకోవటం చదువు కోటానిక్కాదని నమ్మాడు; ఎందుకంటె చిన్నపట్నుంచి ముక్తేశ్వర్రావుకి తండ్రి మాదిరి డబ్బుమీదే దృష్టి. యింత డబ్బాపేక్ష నెవ్వడూ చదువుకోడని తండ్రికి తెల్సు. అందులో ముక్తేశ్వర్రావుకి డబ్బంటే బోల్డభిమానం. ఆ సంగతి అతగాడు పుట్టంగానే తెల్సింది. పుడ్తానే ముక్తేశ్వర్రావు 'కేరు కేరు' అనకుండా 'కారు కారు' అన్నాడు. కార్లెక్కాలని చిన్నప్పట్నించే కోరిక. అసలు పుడ్తానే కార్లో కూర్చున్నాడు. యితగాడి తండ్రి 'హాస్పిటల్ కెందుకు? డబ్బు ఖర్చు' అని అనుకుని పదిమందితో మాత్రం 'హాస్పిటల్ నాకు నచ్చదండీ. డాక్టరమ్మ నింటికే తెస్తా'నన్న పెద్దమనిషి పెళ్లాం నెప్పులు పడ్తుంటె వరండాలో తిరుగుతూ కూర్చున్నాడు. కాస్సేపు తిరుగుతూ కాస్సేపు కూర్చుంటున్నాడు.

'ఏమిటయ్యా! వెళ్లి డాక్టరమ్మ నీ్తసుకురాక' అని పక్కింటి పరంధామయ్య కసురుకుంటె–

'ఏం చెయ్యనండీ! కాళ్లాట్టంలేదు' అంటూ కుర్చీలో కూర్చున్నాడు.

'కాళ్లాట్టంలేదా? అయితే వుండు' అని పరంధామయ్యగారో టాక్సీని పిల్చి 'కాళ్లాట్టల్లేదన్నావ్గా. .యిదిగో యీ టాక్సీలో వెళ్లి డాక్టరమ్మనీ్తసుకురా' అన్నాడు... పక్కింటి పరంధామయ్యగారు పక్కవాళ్లకి మాత్రం బాగా ఖర్చయ్యే మార్గాల్చెప్తాడు. తనెవ్వరికీ కార్డు కూడా రాయడు. కానీ పక్కవాళ్లతో మాత్రం 'ఏముందండి ...ఓ నాలుగురూపాయలు పారేసి ట్రంక్ కాల్చేస్తే సరి' అంటాడు. రిక్షా కూడా ఎక్కని పరంధామయ్య పక్కవాళ్లతో 'ఏమిటయ్యా.. దీనికింత పెద్ద బ్రహ్మాండం చేస్తారు. ఓ టాక్సీ పట్టుకొస్తే పోలా' అంటాడు. పరంధామయ్య డ్రాఫ్ట్స్ మన్‌గా చేసి రిటయిరయ్యాడు. తను పూరింట్లో వుంటూ కూడా పెద్ద పెద్ద యిళ్లకి ప్లాన్లేశాడు. అదే పద్ధతి రిటయిరయ్యాక కూడా చేస్తున్నాడు... యిప్పుడో టాక్సీనీ్తసుకొచ్చి వాకిలిముందు నిలబెట్టాడు.

టాక్సీ మాట వినగానే కడుపులో వున్న ముక్తేశ్వర్రావుకి వుత్సాహంఎక్కువైంది. పెళ్లాం పక్కనే వున్న పనిమనిషి–

'అయ్యగారూ! అమ్మగారికి నెప్పు లెక్కువయినై' అనగానే 'యిదిగో వెడ్తున్నా'నంటూ బయటికి పోబోతున్న అతగాణ్ణి జబ్బ పట్టుకులాగి కొట్టొచ్చేట్టు చూసి, కొట్టినంత పనిచేసి—

'ఏం మనిషివయ్యా నువ్వు. ఆవిడకి నెప్పు లెక్కువైతే యిప్పుడెళ్లి ఎప్పటికొస్తావ్? ఆవిణ్ణి కూడా తీసుకెళ్లు హాస్పిటల్‌కి' అని పరంధామయ్య పనిమనిషి నిచ్చి ఆవిణ్ణి కూడా ఎక్కించాడు టాక్సీలోకి...టాక్సీలో కొంతదూరం వెళ్లంగానే

## 18 క్లూలకు తెలుగు అనువాదం

**1.** ఎక్కడ ఎక్కువ సామర్థ్యం/అవసరం వుంటుందో అక్కడ సామాన్యంగా అధిక మహత్వాకాంక్ష వుంటుంది. ఎక్కడ అధిక మహత్వాకాంక్ష వుంటుందో అక్కడ ఉద్యమానికి, అభివృద్ధికి ప్రేరేపణ వుంటుంది.

**2.** సమమైన ధర అంతస్తును నిలకడగా వుంచే కీలకం వ్యవసాయ/ పరిశ్రమారంగం ఆధీనంలోవుంది

**3.** ద్వేషంవల్ల యుద్ధాలు జరుగుతాయి అధర్మం / అజ్ఞానం మరియు అపరిచయంనుండి ద్వేషం ఉత్పన్న మవుతుంది.

**4.** వ్యవహార విషయాలు సవ్యంగా జరిగిపోతున్నప్పుడు దాతృత్వము / ఐక్యత మరియు అవగాహన గురించి ప్రసంగించుట సులభం. బహిరంగ వైరుధ్యంతో హింస, ద్వేషం పెరిగినప్పుడు నిజమైన పరీక్ష బయల్పడుతుంది.

**5.** పూర్వ కీర్తి మనకు ఆత్మవిశ్వాసమును కలిగించ వలెను. కాని అది మనలో ఏ విధమైన సంతృప్తిని / అహంకారమును సృష్టింపరాదు.

**6.** సాంస్కృతిక / ఆధ్యాత్మిక ఆకాంక్షలు మరియు మానవతా రచనాత్మక ప్రేరణలను పోషించి పెంపొందించే నిమిత్తం ఆర్థిక మూలము తగినంత దృఢంగా నుండవలెను.

**7.** భారతదేశపు ఒకవైపునుండి మరియొక తుది ప్రాంతం వరకు వికాసాలు, వ్యవహారాలు మరియు సామాజిక రీతి రివాజులలో అనేకత / ఐక్యత గలదు అని దర్శింప వచ్చిన వారికెవరికైనా విదితం.

**8.** అనిత్య మైన దేదైనా సందిగ్ధం / దుఃఖపూర్ణం.

**9.** భావనాత్మక/ రాష్ట్రీయ ఏకీకరణ నిమిత్తం మంచి చట్టముల నియామకంకంటె మంచి అవగాహన మంచి అలవాట్లు, మంచి నైతిక ప్రమాణములు నియమించుట చాలా ముఖ్యం.

**10.** విశ్వాసం / సత్యం ఆధ్యాత్మిక యాత్రాపూర్ణంవల్ల లభించును, బౌద్ధిక వితర్కం వల్లకాదు.

**11.** తన కృతియందు కళాకారుని శుద్ధత / పూర్ణత దృష్టియొక్క ఉనికి కళయొక్క కృతి నిరంతర ఆకర్షణీయమై వుంటుంది.

**12.** ముద్రాస్ఫీతి / మందం తరుచుగా అర్థతంత్రమందు ప్రాథమిక రచనా, సంబంధంలో కుప్రబంధాన్ని ప్రకటించుచున్నది.

**13.** తర్క పూర్ణ / నైతిక విచారణ శక్తి జ్ఞానం యొక్క అన్ని శాఖలకు ఆదర్శమైయున్నది.

**14.** ఆధ్యాత్మిక మరియు భౌతిక / సామాజిక జీవనం రెండింటా అభివృద్ధికి రహస్యం స్వాతంత్ర్యం.

**15.** తన అంతరాత్మను అర్పించకుండా ఏ దేశం / ధర్మం అయినా ఏదైనా విదేశ సాంస్కృతిని సంపూర్తిగా అవలంబింప నేరదు.

**16.** నియతి / విజ్ఞానం స్వయం ఒక చమత్కారం మరియు ఒక రహస్యం.

**17.** మానవులకు నిజంగా జ్ఞానాభ్యాసంలో వ్యత్యాసంగలదు. కాని అభ్యసించే శక్తిలో సమానులే. వివేకం / ధర్మం ఉపదేశంవల్ల సదాచార ప్రాప్తిని పొందజాలని జాతి యుండదు.

**18.** కార్యం ఎంత పెద్దదో జవాబుదారి / సఫలత అంత గొప్పది.

## No. 32: 18 CLUES

1. Where there is more **Ability / Opportunity** there is usually more ambition, and where there is more ambition there is an incentive to effort and improvement.
2. For ensuring a stable price level the **Agricultural / Industrial** sector holds the key.
3. Wars arise from hatred and hatred is born out of **Arrogance / Ignorance** and unfamiliarity
4. It is easy to speak of **Charity / Unity** and understanding when things go well The real test comes when violence and hatred erupt in open conflict.
5. The glories of the past must given us confidence, but they must not breed in us any kind of **Complacency / Conceit**.
6. The economic root should be strong enough to nourish and nurture the **Cultural / Spiritual** urges and creative aspirations of humanity.
7. There is a **Diversity / Unity** of beliefs and practices and social customs from one end of India to another which strikes even a casual visitor.
8. Whatever is transitory is **Doubtful / Painful**
9. For **Emotional / National** integration it is more important to form good understanding and good habits and moral standards th n to frame good laws.
10. **Faith / Truth** comes at the end of the spiritual pilgrimage, and is not the subject of intellectual d scussion.
11. The presence of the vision of **Godliness / Wholeness** of the artist in his work is the perennial charm of a work of art
12. **Inflation / Recession** often indicates basic structural maladjustments in the economy.
13. **Logical / Moral** thinking is the ideal of all branches of knowledge.
14. Freedom is the secret of progress both in spiritual and **Material / Social** life.
15. No **Nation / Religion** can adopt a foreign culture wholesale without losing its soul
16. **Providence / Science** itself is a marvel and a mystery.
17. Men indeed differ in learning but are equal in the capacity for learning, there is no race which under the guidance of **Reason / Religion** cannot attain to virtue.
18. The bigger the task, the greater the **Responsibility / Victory**.

గమనిక. పై క్లూలు భారతీయ గ్రంథకర్తల, పుస్తకములనుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు ఆఫిషియల్ సొల్యూషన్‌తోపాటు లిట్ క్విజ్ వీక్లీలో ప్రచురించబడును. రు. 6,75,000లు పైగా పంచబడినది.

## గురుద్యోగ పర్వం

ముక్తేశ్వర్రావు పుట్టాడు. పుట్టగానే 'కారు, కారు' అంటూ రోడ్డుపొడుగునా అరిచాడు.

'నాన్నా...యిది కారే చూడు' అన్నాడు తండ్రి. 'అబద్ధం...యిది టాక్సీ' అన్నాడు ముక్తేశ్వర్రావ్...

యిలా చిన్నప్పణ్ణించే కారు కావాలంటున్నాడు కాబట్టి యితగాడు డ్రైవరీ పట్టుకున్నది చదువుకునేందు కాదు. యింకేదో గొప్పపనిచేస్తాడనుకేనని నమ్మాడు తండ్రి...

అలాంటి ముక్తేశ్వర్రావ్ బి. ఎ. దాకా చదివి చదవటం ఆపేశాడు. 'డబ్బులొచ్చే వుద్యోగాలకి బి. ఎ చాలు. డబ్బు రాని లెక్చరర్లకే ఎం. ఎ కావాలి. పైసంపాదనలేని వుద్యోగం నా కొద్దుగదా. కాబట్టి నాకి బి. ఎ చాలు' అని చదువాపేసి ఓ వుద్యోగం దొరకటంతో పనయిపోయినట్టు కాళ్లు ముడుచుకూర్చోకుండా డైరీ తెరుచుకూర్చుని పెద్దవాళ్ల లిస్టు తయారుచేసుకుని వాళ్ల యిళ్లల్లో సొక డయ్యేమార్గాలు ఆలోచించటం మొదలెట్టాడు... యితగాడు ముందో అయిదొందల వుద్యోగంలో చేరాడు. దాంట్లో చేరే ముందో పెద్ద తతంగం చేశాడు. యింటర్వ్యూకో రెండు రోజుల ముందే ఆ యింటర్వ్యూ జరిగే వూరెళ్లాడు. యితగాడు రైల్లో అందరి అడ్రసులిస్తుకుంటూండగా యింకోడు కల్పాడు. 'హౌటు సక్సీడ్ యిన్‌ఏన్ యింటర్వ్యూ' అన్న పుస్తకం చదువుతున్నాడతగాడు. 'ఏ యింటర్వ్యూ'కి వెడిగాడు ముక్తేశ్వర్రావు? 'ఫలానా' దానికన్నా డవతలివాడు. వాడికా ఆ యింటర్వ్యూకే వస్తున్నాట్ట. రెండురోజుల ముందుగా వెళ్లి ఆఫీసు పరిసరాలు అవీ చూసుకుని, రెండురోజులూ యింకా ఏవో పుస్తకాలు చదువుదామనే వుద్దేశ్యంతో బయల్దేరొస్తున్నాట్ట. అదీగాక యితగాడు యింటర్వ్యూ చేసే ఆఫీసుని ఓ రెండ్రోజులు చూడకపోతే కొత్తగా ఫీలయ్యి యింటర్వ్యూ పాడ్చేస్తాట్ట. అదివరకట్లా జరిగిందిట. అందుకని యిప్పుడు ముందే బయల్దేరొస్తున్నాట్ట. ఎం. ఎ. చదివాట్ట. ముక్తేశ్వర్రావ్ ఖంగారు పడ్డాడు. ఖంగారు పడిందతగాడు

ఎం. ఏ. చదివాడని కాదు. 'రెండ్రోజులు ముందొచ్చి ఆఫీసు పరిసరాల్చూసి వూరు కుంటాడా లేకపోతే ఓ పదిమం దాఫీసర్లని పట్టుకుంటాడేమో' అని ఖంగారుపడ్డాడు. తను ముందు బయల్దేరిందందుకే. వీడూ అలాంటిదానికే బయల్దేరాడా?' అని అనుమానం వచ్చి—'మీరేం పట్టుకొస్తున్నారు? ఏవన్నా రికమండేషను లెటర్లు తెచ్చుకుంటున్నారా? ఎవర్నన్నా పట్టుకున్నారా? ఎవర్నన్నా వెంట బెట్టుకొస్తున్నారా?' అని అడిగాడు ముక్తేశ్వర్రావ్.

అతగాడు—'ఏం పట్టుకొస్తున్నాను?... ఓ పదిపుస్తకాలు పట్టుకొస్తున్నాను. మా తమ్ముడు హైద్రాబాదు చూస్తానంటూ వెంట బడ్డాడుగాని వెంట పెట్టుకు రాలేదు' అన్నాడు యింకో రెండు పుస్తకాలు హైద్రాబాదులో కొని చదవాలని కూడా అన్నాడు. అతగాడిదగ్గరున్న పది పుస్తకాల్లో అడ్రసులున్న డైరీ లేదని హాయిగా గాలి పీల్చాడు ముక్తేశ్వర్రావు. అతగాడ్తో సంబంధం అంతటితో విడిచి పెట్టేసి పక్కనున్నాయన్ని పట్టుకున్నాడు.

ముక్తేశ్వర్రావు యిలా రెండ్రోజుల ముందే హైద్రాబాదుచేరి ఓ పదిమం దాఫీసర్లని పట్టుకుని అందరిచేతా 'విష్యూ గుడ్‌లక్' అనిపించుకున్నాడు. యిలా యింటర్వ్యూకిముందే ఆఫీసర్లని చూట్టం మంచిదని ముక్తేశ్వర్రావుకి తెల్సు 'ముక్కూ మొహం తెలియని వాళ్ళ కెవరిస్తారుద్యోగం. అందుకని యింటర్వ్యూకి ముందే ముక్కూ మొహం చూపించాలం'టాడు ముక్తేశ్వర్రావు. అలా యింటర్వ్యూకి ముందే అందర్నీ కల్సుకున్నాడు. వాళ్ళ చేతిలో చెయ్యివేసి షేక్ హేండిచ్చి 'ఒట్టు, ఉద్యోగం నీకే యిస్తాం' అన్నారు... యింటర్వ్యూ రూంలో కెళ్ళి అక్కడున్నవాళ్ళని ముందే చూసినట్టు మొహం పెట్టకుండా విష్ చేశాడు. వాళ్ళు కూడా యితగాణ్ణి మామూలుగా చూసి—

'వాటీజ్ యువర్ నేమ్?' అన్నారు.

'ఫలానా' అన్నాడు ముక్తేశ్వర్రావు. అందులో వొకాయన క్రితం రోజు ముక్తేశ్వర్రావుతో ఓ గంట కబుర్లు చెప్పి వాయన—

# గురుద్యోగ పర్వం

'ఏవిటి నీ పేరు?' అని మళ్ళీ అడిగాడు. యీ సెలక్షన్ విషయంలో యితగాడి కెక్కువ పవరుంది. ఎలాగో సెలక్టు చేస్తాడు కాబట్టి ముక్తేశ్వర్రావు గురించి తనకేవీ యింతకుముందు తెలియదని అందర్నీ నమ్మించాలని పేరు దగ్గర్నించీ రెండుసార్లడిగి—

'చూశారా...యితగాడ్నింతే వీతెలియదు నాకు. యింకో తడవడిగితేగానీ పేరు కూడా తెలియలేదు. పేరు కొత్తగా వుంది కదూ' అని నవ్వాడు చుట్టూతావున్న వాళ్ళొంక చూసి...

చివరికా వుద్యోగం ముక్తేశ్వర్రావుకే యిచ్చారు. ఉద్యోగంలో చేరింతర్వాతితగాడో పద్ధతి అమల్లో పెట్టుకున్నాడు యీ సంవత్సరం యొక్క జాతీయ ఆదాయంలో కొంత శాతం పెట్టుబడి పెడితే తప్ప వచ్చే ఏడదిక్కూడా యింత ఆదాయం రాదు. అంతకంటె ఎక్కువ పెడితే యింకా ఎక్కువ ఆదాయం వస్తుందన్నది ఆర్థిక శాస్త్రంలో ఒక నియమం. అట్లాగే మనిషి కూడా తను పైకెళ్ళాలంటె తన కొచ్చే ఆదాయంలో కొంత తనపైనున్న వాళ్ళపైన ఖర్చు పెట్టేందుకు కేటాయించాలి యీ సూత్రం ముక్తేశ్వర్రావుకి ముఖ్య సూత్రం. అందుకే పై వాళ్ళందర్నీ పిల్చి పక్షానికో పార్టీ, నెలకో డిన్నరూ యిచ్చేవాడు. పక్షానికో పార్టీ తీసుకున్న ప్రతివాడూ యితగాడి పక్షం చేరేవాడు. నెలనెలా ఓ వంద ఖర్చెట్టటం పై ఏడాదికల్లా జీతంలో రెండొందలెక్కువ చేయించుకోవటం; యిదీ యితగాడి లక్ష్యం. పైనున్న ప్రతి ఆఫీసరుకీ పార్టీ యిచ్చి తన పన్లు చేయించుకునేవాడు. పై ఆఫీసర్లుండగా వాళ్ళనివదిలి పైకెళ్ళక వూరికే కూర్చోటం ఏం నీతి. పై ఆఫీసర్లంటె వైకుంఠపాళీలో నిచ్చెన్లలాంటివాళ్ళు. వైకుంఠపాళీలో నిచ్చెనెక్కి పండటం తప్పా? తప్పు కాదుగదా! మరిక్కడా అంతే' అనే వాడు. చిన్నప్పుడు వైకుంఠపాళీ ఆడేటప్పుడు ఒక్క నిచ్చెనకూడా వదలకుండా ఎక్కి మొట్టమొదటిగా పండేవాడు. అట్లానే యిప్పుడుకూడా ఒక్క పై ఆఫీసర్నికూడా వదలకుండా వుపయోగించుకుంటూ పైకొచ్చేశాడు. యిప్పుడు పదిహేనొందల జీతం...

ముక్తేశ్వర్రావ్ చరిత్ర అంతా విన్న పార్వతి 'చాలా గట్టివాడేనే' అంది. పరమేశ్వరుడు నవ్వి—

'మరేవనుకున్నావ్? ముక్తేశ్వర్రావ్ కాకాసుర సంతతివాడు. పూర్వకాలంలో కాకాసురుడొకరోజున అడవుల్లో కొంపలేవీ లేక ఆ కంపనా యీ కంపనా తిరుగుతున్నాడు. కందమూలాలేగాని కంటికింపైన పళ్ళేవీ కనిపించలేదు. చివరికా అరణ్యంలో కూర్చున్న సీతాదేవి కాలిబొటనవ్రేలు పండినపండులా కన్పించింది. పండు దొరికిందిగదా అని కొరుక్కుతింటం మొదలెట్టాడు కాకాసురుడు. రాముడికి నిద్రాభంగం అవుతుందని సీత కాకాసురుణ్ణి 'ఆయ్' అని అదిలించకపోవటంవేకాకుండా 'అమ్మా' అని అరవనుకూడా అరవలేదు. కొంతసేపటికి రాముడులేచి కళ్ళు నలుపుకుని చూసి కాకాసురుడికన్ను పొగొట్టాడు. దాంతో కాకాసురుడి కోపొరం అబ్బింది. 'మన క్కావల్సినవి మనకి రావాలంటె పైవాడికి నొప్పి పుట్టించకూడదు. అతగాణ్ణి మెప్పించి వొప్పించాలి' అదే విశ్వయించుకున్నా రతగాడి సంతతికూడా వాళ్ళే యీ కలియుగంలో మానవులుగాపుట్టి 'కాకా' పడ్తున్నారు అని ఆగాడు పరమేశ్వరుడు...

ముక్తేశ్వర్రావు గురుద్యోగి పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు కూర్చుని చెప్పటం మొదలెట్టాడు: 'గురుద్యోగీ! నువ్వీ ఆఫీసుకి పైనుంచొచ్చావ్ కానీ ప్రమోదరావు కిందున్నావ్. ప్రమోదరావు ప్రవర్తన ప్రతివాడికీ తెల్సిందే నువ్వు తెల్సుకునేందుకు ప్రయత్నం చెయ్యలేదు. అతగాణ్ని కల్సుకుంటూ వుండాలనే నీకు తోచలేదు. ఫైళ్ళు వాటి యిదేతప్ప నీ కిదేవీ పట్టలేదు. ఆదివారం కూడా యీ ఆఫీసు భాగోతం ఎందుగ్గానీ ఆ గదిలోవున్న ప్యూనోని పంపించెయ్యి...నీకు ప్రమోదరావు కథ చెబుతాను' అన్నాడు.

గురుద్యోగి ప్యూనోని పంపించాడు. కానీ 'ప్రమోదరావుకథ' చెప్పమని అడక్కుండా.

'ముందు భోజనం కానిద్దాం.. లే' అన్నాడు గురుద్యోగి. యిద్దరూ లోపలికెళ్ళారు. (ఇంకా వుంది)




## పాపానికి తగిన ప్రాయశ్చిత్తం

బులుసు వేంకటరమణయ్య

దుష్టశిక్షణం, శిష్టరక్షణం భగవంతుని కృత్యాలయినా, స్వయంగావే వాటిని ఎప్పుడూ జరిగిస్తాడని అనుకోకూడదు. కొన్ని సందర్భాలలో దుష్టశిక్షణకు తాను నిమిత్తమాత్రుడుగానే ఉంటాడు.

కాలయవనుడి విషయంలో ఈ పద్ధతి కానవస్తుంది.

శ్రీకృష్ణుడు మధురానగరాన్ని పరిపాలిస్తున్నకాలం అది. కాలయవనుడు గొప్ప సైన్యంతో మధురానగరాన్ని ముట్టడించాడు. ఎన్నాళ్ళు ముట్టడించినా శ్రీకృష్ణుడు బయటికి రావడం కాని, లోపలనుంచయినా శత్రులపై ఆయుధాలు ప్రయోగించడంగాని జరగలేదు. చివరకు కాలయవనుడికి విసుగెత్తింది కూడా.

ఒకనాడు హఠాత్తుగా కోట ద్వారం తెరుచుకుని శ్రీకృష్ణుడొక్కడే వచ్చాడు. అతనిని కాలయవనుడు ఇదివరకెన్నడూ చూడలేదు. అయినా — నారదుడు చెప్పిన గుర్తులను బట్టి అతడే శ్రీకృష్ణుడై వుంటాడని నిశ్చయించుకున్నాడు నిశ్చయించుకుని శ్రీకృష్ణుణ్ణి పట్టుకోడానికి యత్నించాడు.

కాలయవనుడి ప్రయత్నాన్ని శ్రీకృష్ణుడు తెలుసుకున్నాడు. గుర్రం యెక్కి అతడు తన్ను వెంబడించడానికి సిద్ధంకాగా, శ్రీకృష్ణుడు పరుగెత్తసాగాడు. కాలయవనుడు వెంటపడినా దొరకలేదు. ఒకసారి చాలా దగ్గరగా కనబడి, ఇంకోసారి దూరంగా కనబడి, చేతికి చిక్కినట్టే నటించి, ఇట్టే తప్పించుకొని పోతూ యిబ్బంది పెట్టాడు.

కాలయవనుడికి ఎంతో విసుగు కలిగింది. 'నాతో యుద్ధం చెయ్యడానికి చేతకాక పిరికి పందలా పారిపోతావా?' అని కృష్ణుణ్ణి నిందించాడు. అయినా, ఇతని మాటలను లక్ష్యం చెయ్యలేదు కృష్ణుడు; యవనుణ్ణి నానా తిప్పలూ పెట్టి, అడవులూ, కొండలూ తిప్పి, చివరికి ఒక కొండగుహలో దూరిపోయాడు.

శ్రీకృష్ణుని పోకడను గురించి గమనిస్తున్న కాలయవనుడు ఇది చూచి చాలా సంతోషించాడు గుహలో దూరిపోయిన శ్రీకృష్ణుడు తప్పించుకొని పారిపోలేడనీ, తనకు తప్పకుండా పట్టుబడతాడనీ నిశ్చయించాడు.

కాలయవనుడు అశ్వాన్నిదిగి శ్రీకృష్ణుడు ప్రవేశించిన గుహను ప్రవేశించాడు. ఆ గుహలో మహా తపశ్శాలి అయిన ముచుకుందుడు, మాంధాత కుమారుడు యోగనిద్రలో ఉన్నాడు అంధకారమయమైన ఆ గుహలో ప్రవేశించిన కాలయవనుడు ముచుకుందుణ్ణి చూచి కృష్ణుడే అని అనుకున్నాడు. తన్ను నానా తిప్పలూ పెట్టిన కృష్ణుడు టక్కుపెట్టి నిద్రిస్తున్నట్లున్నందున కలిగిన కోపంతో కాలయవనుడు అతన్ని ఒక్క తన్ను తన్నాడు. యోగ నిద్రకు భంగం కలిగి, ముచుకుందుడు లేచి, కోపంతో చూడగా కాలయవనుడు భస్మమైపోయాడు.

భగవంతుని చిద్విలాసాలలో యీ పద్ధతి ఒకటి!

దుష్టస్వభావుడైన కాలయవనుడు తన వేలితో తన కన్నే పొడుచుకున్నట్లు చేశాడు గాని శ్రీకృష్ణుడు తానుగా అతనిని శిక్షించలేదు దుర్గర్వం గల కాలయవనుడు శ్రీకృష్ణుడు తనకు భయపడి పారిపోతున్నాడనే భ్రాంతి పడ్డాడు కాని, తన్ను మృత్యుగుహలో ప్రవేశ పెడుతున్నాడని తెలుసుకోలేక పోయాడు!

అందువల్లనే అంటారు— 'భగవంతుడి మాయలను గ్రహించడం మానవమాత్రుడికి సాధ్యంకా'దని.

## మహీధరోక్తులు

మహీధర నళినీమోహనరావు

అనృత వాది జేతునని హరిశ్చంద్రుని
కౌశికుండు చాల కష్టపెట్టె
ఎన్నికలకు నిలువు మన్నచో చాందా?
హృదయవర్తి యీ మహీధరోక్తి.















# హతవిధీః కొత్త గుండె ఫిట్!



కేప్ టవునులో లూయిస్ వాష్ కాన్స్కీ అనే 56 ఏళ్ళతనికి 24 సంవత్సరాల స్త్రీ హృదయం అతకడంతో గొప్ప రభస వచ్చిపడింది గాని ఆ వాష్ కాన్స్కీ వో 18 రోజులు బ్రతికి, ఆ తర్వాత దక్కించలేకపోయారు. చికాగో హార్ట్ అసోసియేషన్ వారు "ఎరువు గుండెతో బ్రతకడం చాలా అరుదు" అన్నారావాడే.

పసి హృదయాలు పెద్దలకు, పెద్ద హృదయాలు పిల్లలకు, స్త్రీహృదయాలు పురుషులకు, పురుష హృదయాలు స్త్రీలకు మార్చుకుపోయేలా వున్నారీ శాస్త్రవేత్తలు. అప్పుడే అయిదు గుండె మార్పిడీలు జరిగాయి. ఇంకెన్ని జరగనున్నాయో!!

ఈ గుండె కోత మనుష్యులకే గాక సాహిత్యానికూడా జరిగింది. మన సాహిత్యంలో, కావ్యాల్లో వాటిలోని వాక్యాల్లో హృదయానికో పవిత్రమైన ప్రత్యేకమైన, స్థానం గౌరవం అనాదిగా వుంటూవచ్చాయి.

హృదయేశ్వరీ—హృదయేశ్వర —నా హృదయం మీ కర్పించను—నా హృదయం పరధి వుంయి పోయింది. నా హృదయంలో మీ రూపం చెరగని ముద్ర వేసుకుంది. నా హృదయావేదన ఎవ్వరు చెప్పగలరు— నా హృదయంలో నివసించే చెలీ, నేనెంత గాఢంగా మిమ్మల్ని ప్రేమించానో నా హృదయాన్ని అడగండి—మీది పాషాణహృదయం— నా హృదయానికి ఏర్పడిన గాయం ఎవరికి ... వ్— నా హృదయవేదన నీకు తెలీదు సఖీ— వంటి అనాదిగా వచ్చే వాక్యాలకూ ప్రయోగాలకు యిక స్థానం వుండదా! స్వస్తి వాక్యాలు పలకాల్సిందేనా!

స్వామీ! ఆపరేషనుకు ముందు నా హృదయం మీది. ఇప్పుడు ఎవరి హృదయమో నాది. సొంత హృదయం లేదిప్పుడు. అవ్వ—మీరెవరు? మిమ్మల్ని చూస్తుంటే నా (క్రొత్త) హృదయం స్పందించటం లేదు— ఏమి విడ్డూరమో? ఎంత వద్దనుకున్నా నాకీ పాడు బుద్ధులొస్తున్నాయేమిటి? ఏవో హృదయావేశాలు మారుతున్నాయి!!

ఆడ హృదయాలు మగవారికి, మగ హృదయాలు ఆడవారికి మారిస్తే—ఏమిటి? ఆడ దుస్తుల మీద, ఆడ గుణాల మీద మనస్సు పోతోంది— ఏమిటిది? నాకు అన్ని మగ గుణాల మీద మనసవుతోంది—అరెరె! ఏమిటి చిన్నపిల్లడి గుణాలు—అవో ఏ మారతాయా ఆలోచనలు?

ప్రేమికుల్లో గుండె మార్పిడి ఓ స్త్రీకి జరిగితే "పురుషోత్తమా! తమరిని నే వెన్నడూ ఎరుగను. మీరు కలవిస్తున్న విషయాలు, విలాసాలు నా విశావు" అనో లేక ఇంగ్లీషు గుండె పెడితే "హా ఆర్యా! -వోనథింగాస్పైట్యుయ్యాటాక్" అనో అంటుంది ఆమె!

ఇక ఎరువు గుండె పెట్టుకున్నాక నాకు బలొచ్చింది. క్రొత్త గుండెల్లో పాత సమస్యలన్నీ పోయాయి. ఏమిటి బాబూ యీ కొత్త గుండె వచ్చాక ఒళ్ళంతా నడెక్కుతోంది, ఏవో అనిపిస్తుందా' పాత హృదయం చేసుకున్న నిర్ణయాన్ని క్రొత్తగా వచ్చిన హృదయం అమలు పరచగలదా! ఈ రహస్యం నా హృదయానికి తప్ప ఎవ్వరికీ తెలీదు అనుకునే వాని హృదయం మరో శరీరంలోకి వెళితే, ఆ రహస్యం బయటకు వస్తుంది! అప్పు తీసుకున్న వాని హృదయం, ఇచ్చిన వాని హృదయం మార్పిడి జరిగితే ...

అభివృద్ధి చెందిన సైన్సు, సాహిత్యం మీద యిలా దెబ్బతీస్తే ఎలా!! ఇంత గొడవలు వస్తాయని డక్టరు బెర్నార్డ్ గారికి, ప్రొఫెసరు జాక్సన్ గారికి తెలుసా! తెలిస్తే చేస్తుంటారా!




ఈ హృదయావేదన తెలుసుకోలేకపోయిన కాళిదాసు, భవభూతి, బాణుడు, హర్షుడు, నన్నయ, ... జాడలు, షేక్స్‌పియరు, మిల్టను, కీట్సు, వర్డ్స్‌వర్త్ వంటి వారందరూ ధన్యహృదయులా!

నా యీ హృదయావేదన పోవాలంటే నా అసలు హృదయం పీకి, అవతల గిరాటు వేస్తే మరో కొత్తది అంటుకట్టించుకోవాల్సిందేనా.

—పొలాక్షుడు

జి. పి, పత్తికొండ

ఒక అమ్మాయిని ప్రేమించిన తరువాత పెళ్లిచేసుకోవడం మంచిదంటాను.

అంతేమరి. లేకుంటే ప్రేమించకపోవడమే మంచిదంటాను!

ఎ. పి, జాలిపూడి

నింద్రకుండా, ఓ అక్కయ్యా మీ అసలు పేరు తెలుపడానికి అభ్యంతరమా.

అభ్యంతరం ఎందుకు వెర్రిదానా, నా అసలు పేరు "శీలవనలతా మహాత్మాగాంధి దొరసాని." బాగుందా?!

ఆర్. ఎస్. ఎన్, బార్‌బెరా (బీహారు)

చాలామంది ప్రశాంత ప్రదేశాలకి పోవాలనిపిస్తుందని రాస్తారుకదా వాళ్ళందరినీ ఇక్కడికి పంపించేయండి

అంటారే కాని వస్తారా బ్రదర్, ఇలా రాసేవాళ్ళు ఏకాంతాన్ని క్షణంకూడా భరించలేనివాళ్లే.

ఎల్. ఎస్. డి, విశాఖపట్నం

మీ ముఖం అందంగా ఉంటుందా అక్కయ్యా.

అందవికారపు మొగానికి అద్దం ఏం చేస్తుందని చూసుకోవడం మానేశాను తమ్ముడూ.

కె. ఎస్. ఆర్, ధవళేశ్వరం

మన జీవితంలో జరిగేవాటికి నటి జీవితంలో జరిగేవాటికి తేడా ఏమిటి ?

పబ్లిసిటీ!

కె. ఎమ్. పి. ఆర్, గార

ఏపని చేయదల్చినా పాప పుణ్యములు ఆలోచించ రేమి ?

పాపం, పుణ్యం ఆలోచిస్తూ కూర్చుంటే పని చేయడం ఎప్పుడూ!

జి. పి, మచిలీపట్నం

భార్యలమీద లేనిపోని అపవాదాలు వేసి అనుమానపడే యువకులనేమి అనాలి ?

కాగితం కలం కత్తి లేకుండానే మనిషిని చంపే హంతకులనాలి.

ఎ. పి. ఆర్, హుస్నబాద్

అన్ని ఉండి అనుభవించలేని వానికి మనశ్శాంతి ఎలా చేకూరుతుంది ?

వర్షం కురవని వేసవి మేఘంలాంటివాడు లోభి అన్నీ ఉండీ అతని మనశ్శాంతి లభించడం దుర్లభం.

కె. ఎల్. ఆర్, పిఠాపురం

నాకు కలలో లక్షరూపాయిలు వచ్చింది. అవెక్కడ దాచడం అని ఒకటే ఖంగారు పడ్డాను.

కలలో పాలు తాగడానికి పాత్ర కంచుదైతేనేమి? కనకం దైతేనేమి అన్నారు. మీ డబ్బు




ఎలా దాచినా ఫరవాలేదు బ్రదర్.

ఎమ్. కె. కె, బళ్లారి

ఆడవాళ్ల మనసులు అగాధాలు అంటారు. మరి మగవారి మనస్సులు ?

ఎండమావులు! వాటిలో ఏముంటుందో చెప్పలేం.

ఎల్. ఎమ్. ఆర్, పిఠాపురం

స్త్రీలు వివాహం కాక ముందుండే గుణాలు వివాహానంతరం ఉండవు. కారణం ఏమై ఉంటుంది ?

సహవాస దోషం అయివుంటుంది గురూ!

హెచ్. ఎమ్. ఆర్, బళ్లారి

ఆడవాళ్ల మనసులు అర్థం చేసుకోవాలంటే ఏంచేయాలి ?

కనీసం వాళ్లేం చెప్తున్నారో వినిపించుకోవడం అలవాటు చేసుకోవాలి!

కె. ఎస్. ఆర్, కందులవారిపల్లె

స్త్రీకి ప్రియమైనది ఏది ?

స్త్రీ!!

వి. కె, శ్రీశైల ఆత్మకూరు

తల్లిప్రేమకు మించిన అమూల్య సహృదయప్రేమ ఇంకా ఎవరికిఉంటుంది?

తల్లిప్రేమ తల్లికే ఉంటుంది. మరెవరికీ ఉంటుంది సోదరీ.

బి. ఆర్. ఆర్, ఆగ్రా

మీరు సామెతలు ఎక్కువ వాడుతారెందుకు ?

సామెతలు మాటలలో దీపాలవంటివి.

ఎమ్. ఎల్. డి, అత్తిలి

మావారు అర్ధరాత్రయినా సరే, ఏదైనా వండమంటే వండవలసిందే విసుగ్గా ఉండదా మరి.

ఏంచేస్తాం చెల్లీ ఏలేవారికి రేలూ పగలూ ఒకటే!

కె. బి. ఆర్, కాకినాడ

ఇప్పటి కెన్నోసార్లు ఆదుకున్నాను. మళ్లీ ఎప్పటి కప్పుడే సహాయం చేయి అంటూ సిద్ధమయే స్నేహితుల నేమనాలి?

ఎప్పటి మేలు అప్పటికే నని జమకడుతున్నట్టుంది మీ స్నేహితుడు.

ఎస్. ఎస్, శృంగవరపు కోట

మానవుని జీవితంలో దుఃఖం వశించాలంటే ఏంచేయాలి ?

దుఃఖాన్ని అధిగమించాలి.

యన్. ఎస్, కరీంనగరు

ఇంగ్లీషులో ఛందస్సు ఉంటుందా ?

ఉంటుంది. దాన్ని ప్రోజడీ అంటారు.

చూలూ పళ్ళైక ఇలా చిక్కి శల్యమై పోయాను - వెంటనే వెళ్ళి ఓ మంచి డాక్టర్ని పిలుచుకురండి - ఊఁ కదలరేం??





# అందాల తార వాణిశ్రీ

వయ్యారంగా వరండాలో కూర్చొని ఒడిలో కుక్కపిల్లని వుంచుకొని, ఆప్యాయంగా దాన్ని నిమురుతూ ఆహ్వానించింది వాణిశ్రీ

ఏమిటీ, కుక్కపిల్లతో ఆటలాడుకుంటున్నారు? అన్నాను

కుక్క విశ్వాసంగల ప్రాణి అందుకే దాంతో సరసాలాడుతున్నా అని సమాధానమిచ్చింది నవ్వుతూ

ప్ర మీ సినిమా మార్కెట్టు ఎలా వుంది?

జ 'భగవంతుడి దయవల్ల దివ్యంగా వుంది తెలుగుకన్నా తమిళ చిత్రాలే నాకు ఎక్కువగా వస్తున్నాయి

ప్ర దీనికి కారణం ఏమంటారు?

జ నేను వ్యాంప్, హాస్యపాత్రల్ని ఎక్కువగా ధరించాను అందుచేత మనవాళ్ళకి యింకా నన్ను అలాంటి పాత్రల్లోనే చూపించాలని ఆశపడుతున్నారు

ప్ర మీరు కథానాయిక పాత్రల్నే ధరిస్తారా? సహాయభూమికల్ని వెయ్యరా?

జ నేను నాయికగానే వెయ్యాలని యెప్పుడూ అనను మంచిపాత్ర అయితే, యేదయినా సంతోషంగా స్వీకరించి, ఆ పాత్రకు న్యాయం చేకూరుస్తాను

ప్ర ఒకరోజుకి ఎన్ని కాల్‌షీట్లు పని చేస్తారు?

జ ఒకరోజుకి 18 గంటలు పని చేస్తున్నాను

ప్ర అంత కష్టపడితే, మీ ఆరోగ్యం చెడిపోదా ?

జ చెడుతుందని నన్ను నమ్ముకున్న నిర్మాతల్ని యిబ్బంది పెట్టడం సబబా చెప్పండి.

ప్ర మీ మార్కెట్టు యెంతకాలం యిలా వుంటుందని ఊహిస్తున్నారు ?

జ ఈ విచిత్రమయిన సినిమా ప్రపంచంలో ఏ క్షణం ఏం జరుగుతుందో చెప్పలేం ఈ రోజు నన్ను హీరోయిన్ అని చెప్పి వెళ్తారు మరు దినం మరొకరితో షూటింగు జరుపుతారు ఇలా వుండడంవల్ల మార్కెట్టుయొక్క కాలపరిమితిని వూహించలేం

ప్ర మీరు ఏలాంటి పాత్రల్ని ధరిస్తున్నారు ?

జ నేను శృంగార, శోక, హాస్య పాత్రల్ని ధరిస్తున్నాను తమిళంలో పెద్ద నాయకులందరితో నటిస్తున్నాను

ప్ర మరి తెలుగు నటుడయిన మన పద్మశ్రీలతో నటించాలనిలేదా?

జ ఎంత విసురు విసిరారండీ మన పద్మశ్రీలతో నటించే అవకాశం ఎప్పుడు వస్తుందా అని వేయి కండ్లతో యెదురు



...నర్వే సింగారం

చూస్తున్నా అది నా జీవిత [stamp]గా పరిగణిస్తా

ప్ర మీకు వచ్చిన సరదాలేవి?

జ నాకు రంగురంగుల చీరెలంటె యిష్టం వాజూకయిన బొమ్మల్ని కొని యింటినిండా అలంకరించటం, వారానికి ఒకసారయినా నా చేతులారా వంట చెయ్యడం, ఇంగ్లీషు సినిమాకి మా అక్కయ్యతో వెళ్ళడం, ప్రతిదినం షూటింగు ముగిసిరాగానే పత్రికల్ని తిరగెయ్యడం

ప్ర మీకు దేనిపై మక్కువ ఎక్కువ?

జ చేపలకూరంటే చాల యిష్టం ఆపైన కోడి సూపుపై నాచూపు పోతుంది.

ప్ర మీ జీవితంలో మరపురాని సంఘటన లేమయినా వున్నాయా ?

జ ఈ సినిమా రంగానికి రావడం; ఆపైన 'మరపురాని కథ'లో కథానాయిక పాత్రను పోషించడం ఎదురుమాడని విధంగా తమిళచిత్రాల ప్రముఖ నాయిక కావడం

ప్ర మీకు సావిత్రిగారంటే చాల యిష్టమా ?

జ నేను ఆమెకు ఏకలవ్య శిష్యురాల్ని ఆమెలోని నటనా నైపుణ్యం నాలో కొంతయినా ప్రవేశించాలని భగవంతుణ్ణి వేడుకుంటున్నా

ప్ర మీరు శరీరాన్ని అదుపులో పెట్టడానికి ఏమి చేస్తారు?

జ ప్రతి ఉదయం వ్యాయామం



బంగారు భవిష్యత్తు గురించిన మధురమైన తలపులలో

తీస్తాను. కాఫీ, టీలు మానేసాను. తీని కొన్ని త్రాగుతాను. రాత్రుళ్ళు భోజనం మానేసి గోధుమరొట్టె తింటాను.

ప్ర : మీకునచ్చిన వ్యక్తి ఎవరయినా వున్నారా?

జ : ఎవరయితే నన్ను ఆప్యాయంగా పల్కరిస్తారో, వాళ్ళందరూ నాకు నచ్చిన వాళ్లే. నాకు నచ్చిన నంబరు 8. నాకునచ్చిన నటి సావిత్రి' అని యింకేదో చెప్పబోయే సమయంలో కారు హారన్ మ్రోగింది. 'అమ్మా, వేరమాచ్చి, షూటింగ్ కు వారుంగలే' అనే కేక వినడంతో 'క్షమించండి, వస్తాను' అంటూ వాణిశ్రీ రివ్వున కారులో ఎ. వి. ఎం. కు వెళ్ళింది.

ఇంటర్వ్యూ: శ్రీనివాస్

ఫొటోలు: ప్రభాకర్

<u>చిత్రసమీక్షలు:</u>

# సర్కార్ ఎక్స్‌ప్రెస్



'సర్కార్ ఎక్స్‌ప్రెస్'లో విజయనిర్మల.

తెలుగులో అపరాధ పరిశోధక చిత్రాలు రాకపోలేదు. వాటిలో సరయిన స్థాయిలో నిలబడింది ఏది? అనుకున్నప్పుడు పెదవి విరచక తప్పదు. 'జేమ్స్‌బాండ్ యుగం'లో కూడా అపరాధ పరిశోధక చిత్రాల నిర్మాణంలో వెనకబడివుండడం సహించలేక నిర్మాతలు నడుం బిగిస్తున్నారు. తత్ఫలితంగా కొన్ని చిత్రాలు వచ్చాయి. ఈ లోటును భర్తీ చేయడానికి ప్రయత్నించిన ఒక చిత్రం గౌరీ ఆర్ట్స ప్రొడక్షన్స్‌వారి సర్కార్ ఎక్స్‌ప్రెస్.

సర్కార్ ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణం చేస్తున్న ఒకతనిని ఎవరో హత్య చేస్తారు. హంతకుడు ఎవరో ప్రేక్షకులకి ముందే తెలిసిపోతుంది. కాని చిత్రంనిడివి తగ్గుతుందనే మిషమీద కేసును పరిశోధిస్తున్న ఇన్‌స్పెక్టర్ మాత్రం చూసీచూడనట్టు వూరుకుంటాడు. హంతకుడ్ని పట్టుకోడానికి ఎన్నో అవకాశాలున్నా కావాలని చేయిజార్చి వేస్తాడు. కొన్ని సన్నివేశాల్లో పాత్రలు ఆశ్చర్యపోయినంతగా ప్రేక్షకులు ఆశ్చర్యపోరు. 'కళావతి'లో 'రోసీ'ని చూపించడం అసహజంగా వున్నా, చాలా ప్రతిభావంతంగా వుంది. ఇది ప్రేక్షకుల్ని బాగా అలరిస్తుంది. హంతకుల్ని పట్టుకోడానికి ప్రతిసారీ ఒకేరకమైన హత్య జరగవలసిన అవసరంలేదేమో అనిపించకపోదు. కథలో సస్పెన్సు లేమిని తీర్చడానికి చాలాహంగులు కల్పించబడ్డాయి. అందులో రోసీ పిట్ట కథ ఒకటి. జ్యోతిలక్ష్మి నృత్యం మరొకటి.

చిత్రానికి జీవంపోసినపాత్ర రాజ్‌బాబుది. ఆ పాత్రని రాజ్‌బాబు చాల సామర్థ్యంతో పోషించాడు. హంతకుడుగా నటించిన కొట్టార్కర పాత్ర మరో ఆకర్షణ. కృష్ణ పాత్ర మొత్తంమీద రక్తి కట్టించింది. విజయలలిత, విజయ నిర్మలలు పాత్రోచితంగా నటించారు. గుమ్మడి, రావి కొండలరావు అతిథి నటులుగా కనిపిస్తారు.

పాలగుమ్మి పద్మరాజు మాటలు రాశారు. సత్యం సంగీత దర్శకత్వం వహించారు. ఎం. క్రిష్ణన్ దర్శకత్వం వహించిన ఈ చిత్రానికి నిర్మాత వై. వి. రావు. చుట్టు తిరిగివచ్చినా ప్రాణానికి సుఖ మనిపించే సర్కార్ ఎక్స్‌ప్రెస్ ప్రయాణంలానే కథా వివేయమెలా వున్నా; చిత్రీకరణ నిర్వ జనాదరణీయంగా వున్న ఈ చిత్రాన్ని యస్. భావనారాయణ నిర్వహించారు.

# మాంగల్య విజయం

తాళి ఎగతాళికి కట్టినా దాని మహాత్యం గొప్పది; అది విజయాన్ని సాధించి తీరుతుంది అని చాటి చెప్పే చిత్రం శ్రీరామాంజనేయ ప్రొడక్షన్స్ వారి 'మాంగల్య విజయం'.

కానివాడయిన అయినవాడు దొంగతనంగా తాళికట్టాడని పంచాయతీలో నిరూపించడానికి తల్లి బలవంతంగా కుమార్తె మెడలో తాళికట్టడం ఈ చిత్రంలో కొత్తదనం. ఎవరి పేరుమీద ఆ తాళి కట్టబడిందో, అతడినే భర్తగా అనుగ్రహించి మాంగల్య మహాత్యాన్ని ప్రచారం చేస్తూ కథ ముగుస్తుంది. కథకి బలాన్ని చేకూర్చే సన్నివేశాలు చిత్రం నిండా వున్నాయి. ఒక చక్కని కథని అనువాద చిత్రంలో చూడడం కొంచెం బాధ అనిపించినా, అనువదించడంలో మెళుకువ కొంత రిలీఫ్ నివ్వకపోదు.

మాటలు భావగర్భితంగాను, సహజసిద్ధంగాను వినిపింపజేయాలనే రచయిత ప్రయత్నం విఫలం కాలేదు. రాజా శివానంద మాటలు బాగా అమరాయి. కోటిరెడ్డి నిర్వహణలో తయారయిన ఈ చిత్రానికి బొబ్బ వెంకట సుబ్బయ్య నిర్మాత. దర్శకత్వం కడారు నాగభూషణం. బి. సరోజాదేవి, యం. జి. రామచంద్రన్, నాగయ్య ప్రభృతులు నటించారు.

చిత్రానికి ప్రత్యేక ఆకర్షణ రామాంజనేయయుద్ధం నాటకం సీను. శ్రీరాముడుగా షణ్ముఖి ఆంజనేయరాజు నటించి కొన్ని మధురమైన పద్యాలను గంధర్వగానంచేశారు! జె. రామమోహనరావు అంజనేయుడుగా నటించి కర్ణపేయమైన కంఠంతో ఆ పాత్రకి ప్రాణం పోశారు. ప్రేక్షకుల్ని బాగా ఆకర్షించగల ఘట్టాలలో ఇది ఒకటి. ఈ సీనుకోసమైనా ఈ చిత్రాన్ని తప్పక చూస్తారు. —సీతరాజు

# సినిమా

## ఆడపడుచు శతదినోత్సవ సందర్భంగా విందు

మంచితనంతో పరిశ్రమలోని అందరి మనస్సుల్లో మంచికిస్థానాన్ని అలంకరించుతున్న శ్రీ హేమాంబధరరావు నిర్మించిన 'ఆడపడుచు' చిత్రం ఆంధ్రప్రదేశ్‌అంతటా నూరు రోజులు విజయవంతంగా ప్రదర్శింపబడిన సందర్భంలో హోటల్ ఆశోకాలో ఏప్రిల్ ఏడవతేదీన దక్షిణ భారత ఫిలిం పారిశ్రామిక సంఘకార్యదర్శి శ్రీ డి. వి. ఎస్. రాజు అధ్యక్షతన నూరురోజుల పండుగ బ్రహ్మాండంగా జరిగింది.

సుభాషిణి ఆర్ట్సు పిక్చర్స్, పూర్ణా పిక్చర్స్, 'ఆడపడుచు' చిత్రం నటీ నటులకు సాంకేతిక నిపుణులకు షీల్డులను బహూకరించారు.

ప్రముఖ దర్శకులు శ్రీ తాతినేని ప్రకాశరావు 'ఆడపడుచు' యూనిట్‌కు బహుమతి ప్రదానం చేసారు. జనగణమన గీతంతో సభ జయప్రదంగా ముగిసింది. అనంతరం అశోకా హోటలులో షడ్రసోపేతమయిన విందు జరిగింది.

## అందరికీ ఒకే పేరు

జనరంజని పిక్చర్స్ అధినేతల్లో ఒకరయిన శ్రీ తాతినేని చలపతిరావు తన చిత్రానికి టైటిల్ పెట్టడానికి ఒక విచిత్రమయిన పంధాను అనుసరించారు. అదేమిటో తెలుసా!

తాను నిర్మించే చిత్రానికిగాను నాల్గయిదు పేర్లను చీటీవ్రాసి లాటరీపద్ధతిలో తన భార్యను, పిల్లల్ని తీసిమ్మన్నారు. వాళ్ళు వరుసగా ఒక్కొక్క చీటిని తీసియిచ్చారు. చలపతిరావుకు, ఆయన భార్యకు ఒక టైటిల్ వస్తే, వారి చిరంజీవులకు మరోపేరు వచ్చింది. సరే...యీసారి ఆ ఏడుకొండలవాడి పటం ముందు చీటి తీసిచూస్తాం అని అందరూ ఒక్కుమ్మడిగా ఆయన సమక్షంలో చీటి తీసిచూస్తే—అందరికీ ఒకే పేరు వచ్చింది. అదే 'చల్లని నీడ'...వెంటనే తమ చిత్రానికి ఆ పేరును ఖాయం చేసేసారు. ఆ తిరుమలేశునికి రు 116 లు కానుకగా యిస్తానని చలపతిరావు మ్రొక్కుకున్నారు.

* * *

'చల్లనినీడ'కు తాతినేని రామారావు దర్శకులు. శ్రీయుతులు గుమ్మడి, హరనాథ్, జమున, అంజలీదేవి, రాజబాబు, ప్రభాకరరెడ్డి ముఖ్యపాత్రధారులు. శ్రీ చలపతిరావు సంగీత దర్శకుడు. వాహినీ స్టుడియోలో పదిరీళ్ల చిత్రం తయారైంది. శ్రీయుతులు చలపతిరావు, సుబ్బయ్యచౌదరి నిర్మాతలు. రాయల ఫిలింస్ పంపిణీదారులు. ఈ చిత్రంయొక్క మూడవ షెడ్యూలు ఏప్రిల్ 18 నుండి మే 5 వరకు జరుగుతుంది. ఈ సెట్టు కాగానే రెండు పాటల చిత్రీకరణ జరగడంతో చిత్రం విడుదల చెయ్యబడుతుంది.



'దేవకన్య'లో కాంచన.

శ్రీ దాశరథి వ్రాసిన 'కనులేవో పిలిచినవి; కలలేవో పల్కినవి' అనెడి పాటకు చలపతిరావు కూర్చిన సంగీతం ప్రేక్షక హృదయాల్లో చలచల్లని భావాలను రేకెత్తించేవిధంగా శ్రీమతి సుశీల పాడిన పాటను 'చల్లని నీడ' చిత్రంలో శ్రీమతి జమునా రమణాద్వారా మీరు వింటారు. సంగీత ప్రధానమయిన యీ చిత్రంలో శ్రీ తాతినేని తన ప్రతిభను ద్విగుణీకృతం చేస్తున్నారు.

## చిత్రానికి ఆధారం గ్రామీణ జీవితం

ప్రముఖ దర్శక, నిర్మాత హేమాంబధరరావు వద్ద సహకార దర్శకుడిగా వుండే శ్రీ గోపాలకృష్ణ శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ వ్రాసిన కథను వెండి తెరకెక్కిస్తున్నారు. శ్రీ నంది సంభాషణలను వ్రాసారు. శ్రీ టి. వి. రాజు సంగీతాన్ని నిస్తున్నారు. ముఖ్య పాత్రలను పద్మశ్రీ రామారావు, జయలలిత, నాగభూషణం, పద్మనాభం, రాజబాబులు ధరిస్తారు.



'అత్తగారు-కొత్తకోడలు' లో విజయనిర్మల, రమాప్రభ



'తిక్క శంకరయ్య'లో జయలలిత.

శ్రీ హేమాంబరధరరావు దర్శకత్వంలో యీ చిత్రంయొక్క షూటింగు మే నెలలో ప్రారంభమౌతుంది. మన తెలుగు జిల్లాకు సంబంధించిన ఒక గ్రామీణ జీవితం యీ చిత్రానికి ఆధారమని తెలియవస్తుంది. ఈ చిత్రంయొక్క రికార్డింగ్ కార్యక్రమం ఏప్రిల్‌మూడవవారంలో ప్రారంభమౌతుంది.

* * *

మాధవి పిక్చర్స్ నిర్మించే చిత్రంలో ముఖ్య పాత్రలను నిర్వహించేందుకు పద్మశ్రీ నాగేశ్వరరావు, ఎస్. వి. రంగారావు, గుమ్మడి, కాంచనలను యింతవరకు ఎన్నుకున్నారు. మిగతా పాత్రలకు తగ్గ నటీ, నటులను యిప్పుడు మాధవి కార్యాలయంలో తర్జన, భర్జనలు జరుగుతున్నాయి.

శ్రీ పెండ్యాల నాగేశ్వరరావును సంగీత సారధిగా నియమించారు. శ్రీ కె. ఎస్. ప్రకాశరావు దర్శకత్వంలో యీ చిత్రం యొక్క షూటింగు మే మొదటివారంలో ప్రారంభమౌతుంది. శ్రీ నంది సంభాషణలను వ్రాసారు. చిత్రంలోని పాటలను శ్రీ దాశరథి, నారాయణరెడ్డి, ఆరుద్ర వ్రాస్తారు. పాటల రికార్డింగ్ ఏప్రిల్‌లో

# సినిమా

పూర్తవుతుంది. ఈ చిత్రాన్ని శ్రీ ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు నిర్మిస్తారు.

**ఎలాంటి బాణీలని కూర్చాలి?**

జగతి అధినేత శ్రీ వి. రాజేంద్ర ప్రసాద్ నిర్మించే చిత్రానికి శ్రీ కె. వి. మహాదేవన్ ప్రస్తుతం ఎలాంటి బాణీలను సమకూర్చాలోనని ఆలోచిస్తున్నారు. శ్రీ ఆత్రేయ సంభాషణలను వ్రాసే యీ చిత్రాన్ని శ్రీ వి. మధుసూదనరావు డైరెక్టు చేస్తారు. నాయకీనాయకులుగా జయలలిత, పద్మశ్రీ నాగేశ్వరరావు నటిస్తారు. ఇతర పాత్రలను శ్రీ జగ్గయ్య, గుమ్మడి, సత్యనారాయణ, ధరించగలరు. ఈ చిత్రంయొక్క షూటింగు సారధి స్టుడియోలో జూన్‌లో ప్రారంభింపబడుతుంది.

*   *   *

ప్రసాద్ ఆర్టు పిక్చర్స్ నిర్మాత శ్రీ అనుమోలు వెంకటసుబ్బారావు జూన్‌నుండి తమ తెలుగు, తమిళ చిత్రానికి శ్రీ బాలమురుగన్ వ్రాసిన కథను విన్నారు. ఇంకా అంతిమనిర్ణయం జరుగలేదు. తెలుగులో శ్రీ ప్రత్యగాత్మ దర్శకత్వంలో నాగేశ్వరరావు నాయకుడిగా, జయలలిత నాయకగా ఒక సమస్యాత్మక సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తారు.

**తొలి ప్రయత్నం**

ఆప్తమిత్రులయిన శ్రీ మల్లికార్జునరావు, రాజేంద్రప్రసాద్‌లు కలిసి స్థాపించిన సంస్థయే సునందినీసంస్థ. వీరి తొలి ప్రయత్నంగా ఒక మహోజ్వల జానపద చిత్రాన్ని శ్రీ విఠలాచార్య దర్శకత్వంలో నిర్మిస్తున్నారు. శ్రీ పింగళి రచన సాగించిన యీ చిత్రంలో నాయకీ, నాయకులుగా కృష్ణకుమారి, కాంతారావులు, వ్యాంప్‌గా విజయలలిత, విలన్‌గా సత్యనారాయణ నటిస్తారు. ఈ చిత్రానికి కోదండపాణి సంగీతాన్ని సమర్పిస్తారు.



'నవ్వులు-పువ్వులు'లో కృష్ణకుమారి.

## మీకు తెలుసా?

రవిచందర్ తన 27 వ జన్మదినోత్సవ సందర్భంగా 5 వేల మందికి అన్నదానం చేసాడు.

ప్రముఖనటి, నర్తకిఅయిన శ్రీమతి వైజయంతిమాలకు యిటీవల పూనా సమీపంలో ఘోరప్రమాదం జరిగింది

లాల్ సోదరులు నిర్మిస్తున్న చిత్రంలో 'సీజర్' అనే కుక్కను నటింప చేస్తున్నారు.

ప్రముఖనటి షావుకారు జానకి 'మోహన్‌విలాస్' నాటకంలో తల్లి, కూతుళ్ల పాత్రల్ని ధరిస్తూంది.

శ్రీ ప్రత్యగాత్మ, హేమాంబరధరరావు స్వయానా సోదరులు.

ప్రముఖ హిందీనటి నూతన్‌కు నాల్గవసారిగా ఫిలింఫేర్ ఉత్తమనటి అవార్డువచ్చింది.

మాలసిన్హాను వివాహమాడిన నేపాలీ చిత్రనాయకుడు గొప్పగాయకుడుకూడ.

---

ఈ చిత్రంయొక్క షూటింగు మే 2 నుండి ప్రారంభమౌతుంది. మొదటి షెట్యూల్‌లో 20 రోజుల పనిజరుగుతుంది.

*   •   *

మేకప్ వీరరాజు నిర్మిస్తున్న చిత్రానికి 'రాజయోగం' అని పేరు పెట్టారు. ఈ చిత్రంలో రాజనాల, కాంతారావులు తండ్రి కొడుకులుగా నటించారు. అంతే గాక రాజనాల వేషం, భాషల్లోగానీ, నటనా విరతిలోగానీ అసాధారణమయిన మార్పును



'దబ్బారాయుడు సుబ్బారాయుడు' లో పద్మ, రాజశ్రీ.

## సినిమా డైరీ

- ప్రముఖనటి శ్రీమతి శాంతకుమారి పద్మశ్రీ రామారావుకు తల్లిగా ఎస్. వి. జగన్నాధరావు గారి చిత్రంలోనూ, ఎస్. డి. లాల్ చిత్రం లోనూ నటిస్తూంది.
- అరుణ్ ప్రసాద్ మువీస్‌లో పద్మశ్రీ శివాజీకి జయలలిత ప్రేయసిగా నటిస్తూంది. ఈ చిత్రానికి మాధవన్ దర్శకుడు.
- శ్రీ ఎస్. భావనారాయణ నిర్మించిన "సర్కార్ ఎక్స్‌ప్రెస్" ఏప్రిల్ 12న విడుదలయింది.
- రాజ్యం పిక్చర్స్ నిర్మించిన "గోవుల గోపన్న" ఏప్రిల్ 19న విడుదలవుతుంది. ఈ చిత్రంలో పద్మశ్రీ నాగేశ్వరరావు ద్విపాత్రాభినయం చేసారు.
- ఎ. వి. ఎం. "మూగనోము" షూటింగు హైద్రాబాదులో ఏప్రిల్ 1 నుండి 9 వరకు జరిగింది. శ్రీ నాగేశ్వరరావు, జమునలు పాల్గొన్న సన్నివేశాల్ని శ్రీ యోగానంద్ డైరెక్టు చేసారు.
- సారధి స్టుడియోస్ నిర్మిస్తున్న చిత్రానికి దర్శకులుగా వి. మధుసూదన రావు, సంగీత నిర్దేశకుడిగా కోదండ పాణి నియమింప బడ్డారు.



'అమాయకుడు'లో జమున.

చూడగలం. సత్యనారాయణ, రాజబాబు, బాలకృష్ణ, రాజశ్రీ, మీనాకుమారి మొదలగువారు నటించిన ఈ చిత్రానికి శ్రీ సుబ్బరామన్ దర్శకులు మేలో 'అపరాజిత'ద్వారా ఈ చిత్రం విడుదలవుతుంది.

—శ్రీనివాస్.

## దర్శకుడుగా పేకేటి శివరాం

శ్రీ పేకేటి శివరాం స్థానిక వుడ్‌లాండ్స్ హోటెల్‌లో పత్రికా ప్రతినిధులు సమావేశం ఒకటి ఏర్పాటు చేశారు. శ్రీ పేకేటి దర్శకత్వం వహించిన కన్నడచిత్రం 'చక్రతీర్థ' అతనికి అఖండగవురవం తెచ్చిపెట్టింది. అదేకథని తెలుగులో 'చుట్టరికాలు'గా శ్రీదేవి కంబయిన్స్‌వారు నిర్మిస్తున్నారు. దీనికి కూడా శ్రీ పేకేటి దర్శకత్వం వహిస్తున్నారు. చక్రతీర్థని నిర్మించిన స్థాయిలోనే 'చుట్టరికాల్ని' కూడా నిర్మించదలిచామని చెప్పారు. జర్నలిస్టుగా ఫిలింపరిశ్రమలు అడుగుపెట్టిన శ్రీ పేకేటి తన జీవిత వివరాన్ని అందజేస్తూ తను న్యూస్‌రీల్ కెమెరామెన్‌గా పనిచేశాననీ, స్వంత బ్యానర్‌మీద కొన్ని డాక్యుమెంటరీ చిత్రాల్ని నిర్మించానని తెలియపరిచారు.



# క్రీడారంగానికి ఆంధ్రప్రభుత్వం సేవ



మన దేశంలో రానురాను ఆటలు ప్రముఖస్థానాన్ని అలంకరిస్తున్నవి. ప్రభుత్వం కూడా ఈ రంగానికి మంచి ప్రోత్సాహాన్నిస్తున్నది. ఆటస్థలాల నిర్మాణానికే కాకుండా విదేశాలకు వెళ్ళి పెద్ద పెద్ద 'టోర్నమెంటుల'లో పాల్గొనేందుకు ఆర్థిక సహాయాన్నందిస్తున్నది. ఉత్సాహవంతులైన ఆటగాళ్లను ఏరి, వారిని ప్రవీణులుగా తయారుచేసి, యువకులకు శిక్షణనిచ్చే ప్రయత్నం కొనసాగుతూవుంది. క్రీడారంగం అభివృద్ధి విషయంలో ఇది మెచ్చుకోదగిన సంగతి.

ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం క్రీడారంగం అభివృద్ధికోసం ఎన్నో విధాలుగా కృషిచేస్తున్నది. శ్రీ వి. బి. రాజుగారు రెవెన్యూమంత్రే కాకుండా 'ఆంధ్రా ఒలింపిక్ అసోసియేషన్' అధ్యక్షులు కూడాను. ఆయన గుంటూరులో 'ఆంధ్రా ఫెడరేషన్ ఆఫ్ స్పోర్ట్స్'ని ఆవిష్కరించారు. అప్పుడు ఆయన ప్రకటించిన విషయాలు గమనార్హం. అశక్తులయిన ఆటగాళ్ల కుటుంబాలకి సహాయపడటానికి ఒక 'సహాయసంస్థని' ఏర్పాటు చేస్తున్నట్టుగా చెప్పారు. ఇది గొప్ప సంగతి.

పెద్ద పెద్ద ఆటగాళ్లందరూ రాష్ట్రాలకీ, దేశానికీ ఎంతో కీర్తిని అర్జించిపెట్టారు. వారు అశక్తపరులయినప్పుడు ముసలితనంలో క్రీడారంగంనుంచి విరమించుకొని విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు — వారి జీవితం దుర్భరంగా వుంటుందన్న సంగతి విదితమైనదే. ఇటువంటి పెద్ద ఆటగాళ్లకి ఆంధ్రప్రభుత్వం పెన్షన్ ఇస్తూవస్తున్నది. శ్రీ యమ్. ఆర్. అప్పారావుగారు టెన్నిస్ ఆటలో దిట్ట. ఆయన ఈ మంత్రిపదవిలో వున్నప్పుడు పెన్షన్ స్కీమును అమలుపరచారు. దానివల్ల ఎంతోమంది ఆటగాళ్ళు ప్రయోజనం పొందారు. శ్రీ వి. బి. రాజుగారు సూచించినది మరొక ఉపయోగకరమైన పద్ధతి. ఇందువల్ల ఆటగాళ్లకు ఎక్కువ ప్రోత్సాహం లభిస్తుంది.

* * *

కొయినా భూకంప బాధితుల సహాయార్థం బొంబాయిలో ఒక 'మ్యాచ్' జరిగింది. యమ్. యస్. హార్దికర్ కెప్టెనుగా వున్న ప్రధాన మంత్రి టీము-పటవుడీ నవాబు కెప్టెన్‌గా ఉన్న ప్రెసిడెంటు టీమును ఓడించింది. ఇంగ్లాండు, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ మొదలైన దేశాలనుంచి వచ్చిన ఆటగాళ్ళు అతిథులుగా పాల్గొన్నారు. జైసిన్హా, హార్దికర్ సెంచరీలు సాధించారు. రెండు ఇన్నింగ్సులో పటవుడీ నవాబు 62-61 సాధించారు. మద్రాసునుంచి వెళ్ళిన యస్. వెంకటరాఘవన్ 8 వికెట్లకు 52-61 స్కోరును సంపాదించి చక్కని ఆట చూపించాడు.

—కె. ఎస్. నరసింహన్

## సినిమా

'చుట్టరికాలు' చిత్రాన్ని రెండు నెలలలో పూర్తి చేయాలని సంకల్పం. ఉత్సాహం, కార్యశూరత్వం వున్న శ్రీ పేకేటి మన తెలుగు పరిశ్రమలో దర్శకుడుగా స్థిరపడే అవకాశాలు చాలా కనిపిస్తున్నాయి.

— సీతరాజు

## అవీ...ఇవీ...

### 'భాగల్ పూర్ లో ఉగాది'

బీహార్ రాష్ట్రం, భాగల్పూర్ స్థానిక మెడికల్ కాలేజీలో చదువుచున్న ఆంధ్ర విద్యార్థులు మొత్తం 27 గురు కలసి తెలుగు ఉగాది పండుగ తే. 29—3—68 ని ఘనంగా జరుపుకున్నారు.

ఆంధ్ర ఎసోసియేషన్, కీలకనామ సంవత్సర అధ్యక్షులుగా శ్రీ పి. సత్యనారాయణ, కార్యదర్శిగా శ్రీ టి. వి. రంగారావు కోశాధికారిగా శ్రీబి. వెంకటేశ్వరరావు ఎన్నికయినారు.

### శ్రీ కృష్ణదేవరాయల కళాపరిషత్తు వార్షికోత్సవాలు

ఈఏడు కృష్ణదేవరాయల కళా పరిషత్తు యొక్క వార్షికోత్సవాలు రాయలసీమకు చెందిన అనంతపురం జిల్లాలోని మైనూరు పరిహద్దు పట్టణం అయిన అమరాపురంలో ఇటీవల జరిగాయి. రాయలసీమ భీష్ములు శ్రీ భీమసేనరావుగారి అధ్యక్షతన జరిగాయి.

(ఒ. వి.)

### హైదరాబాదు ఎకౌంటెంట్ జనరల్ ఆఫీసు తెలుగు నాటకసమితి

హైదరాబాద్‌లోని ఎకౌంటెంట్ జనరల్ కార్యాలయంలోని తెలుగు నాటక సమితివారు యిటీవల స్థానిక రవీంద్ర భారతిలో ఉగాది ఉత్సవాల్ని వైభవంగా జరుపుకున్నారు. అకౌంటెంట్ జనరల్ శ్రీ టి. రంగాచారి అధ్యక్షతన జరిగిన ఈ ఉత్సవానికి అనేకమంది పురప్రముఖులు, సినీ నిర్మాతలు, దర్శకులు, రచయితలు హాజరైనారు. ఆంధ్రప్రదేశ్ విద్య, సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ టి. వి రాఘవులు ప్రధాన అతిథిగా విచ్చేశారు.

(ఒ. వి.)



## ...బృహత్కథామంజరి

(15వ పేజీ తరువాయి)

పొట్టమీది మూడు మడతలమీద వున్న నూగారును చూస్తే ముత్యాల దండలవే హంసలు తమ చంచువులనుంచి వదలి పెట్టిన వాచు అలలమీద కొట్టుకుపోతున్నదా అనిపించింది. మరొకమారు చూచాడు ఉదయనుడు. అప్పుడు ఆమె కందర్పుని కరిణిలాగ కనిపించింది. ఆమె పెదవులు శోణకాంతి విలసితాలు. చనుకట్టుకు కుంకుమ పూవుప్పొడి అలదుకొన్నది. పక్కన పంచారికలు ఆమెను చంద్రకిరణాలవంటి తెల్లని చామరాలతో వీస్తున్నారు. కందర్పుని కరిణి తొండం ఎర్రనిది. కుంభస్థలానికి సిందూరం పూశారు. చంద్రకిరణాలవంటి చామరాలు ఇరువైపుల అందంకోసం వ్రేలాడగట్టారు.

రాజతనయ వాసవదత్తను చూచి ఉదయనుడు ఊగిసలాడిపోయాడు; కాంతి కల్లోలినీతీరంలో ప్రతిబింబించిన చంద్రబింబం ఊగిసలాడినట్టు. వాసవదత్త ఉదయనుని చూచింది. సిగ్గుతో తల వంచుకొంది. ఆమె నడుముకు బిగించికట్టిన మణిమేఖలలోని మణుల కిరణాలు ముఖంమీదికి పొంగారాయి. దానిని చూడగా, ఆమె వంచిన తలను ఆ కిరణాలు ఎత్తి పట్టుకుంటున్నాయా, అనిపించింది. ఉదయనుని చూడగానే వాసవదత్త ముఖం సంభ్రమాశ్చర్యాలతో చెమర్చింది. ఆ చెమట బిందువులకు కపోలాలపై అందంకోసం అగరు మొదలయిన సుగంధ ద్రవ్యాలతో వ్రాసిన మకరికా పత్రాలు తడిశాయి. ఇది చూడగా, మన్మథుడు వారుణాస్త్రం ఆమెపై ప్రయోగించాడా అనిపించింది.

(ఇంకావుంది)

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

అందచందాల

# గోయా

ఆశ్చర్యకరం!







క్రొత్త సూత్రం 'గోయా' మీరు కనే కలల టాల్కం పౌడరు. తక్కిన టాల్కులకన్న ఇది తేలికగా. ఆహ్లాదకరంగా ఉంటుంది.

ఇంకను, 'గోయా' నిపుణుల సాయంతో. సుగంధితమైన యీ 'టాల్క్' రోజంతా హాయినిస్తూ. పరిమళాన్ని వెదజల్లుతుంది.

అందాల 'బ్లాక్ రోస్' పువ్వుల్లా పరిమళించే గార్డీనియా. 'మురిపించే' 'పాస్‌పోర్ట్'లలో మీక్కావలసింది ఎన్నుకోండి!

జ్ఞాపకం వుంచుకోండి. ఈ మూడున్నూ చిరకాలం మన్నే కొత్త నిడుపాటి డబ్బాలలో దొరుకుతున్నాయి.

అట్లాంటిస్ (ఈస్ట్) లిమిటెడ్
(ఇంగ్లండ్‌లో స్థాపితం)




క్రొత్త సూత్రంతో తయారయిన ఆహ్లాకరమైన టాల్క్ ఇప్పుడు పొడుగైన క్రొత్త టిన్నులలో లభిస్తోంది

AGC-5 TE

సుగంధముతో గూడిన టాల్కు తయారుచేసే

# గోయా

పారిస్
లండన్
న్యూయార్క్

